# నూరు వసంతాల రాజోలు



ప్రియదర్శిని

1901 - 2000

1998 నుండి 1999
మరియు 1999 నుండి అమలాపురం లోక్‌సభ
నియోజకవర్గ సభ్యులు మరియు
ఇప్పటి లోక్ సభ స్పీకరు

**గౌ॥ శ్రీ జి.యమ్.సి. బాలయోగి గార్కి**

రాజోలు నియోజక వర్గ శాసన సభ్యులు

**శ్రీ అల్లూరి వెంకట సూర్యనారాయణరాజు గార్కి**

మరియు

రాజోలు వాస్తవ్యులు, నగరం శాసన సభ్యులు

**శ్రీ మానేపల్లి అయ్యాజ్ వేమా గార్కి**

అభివందనలతో...

# నూరు వసంతాల రాజోలు ప్రియదర్శిని

## శృతి, స్మృతి, శోధన



**పొన్నాడ హనుమంతరావు**
అడ్వకేటు, గాంధీహౌస్, రాజోలు.

మూల్యము : అమూల్యము — హక్కులు రచయితవి

ప్రకాశకులు : ముద్రణ 2001
ఓ. చక్రధరరావు
శ్రీ రవిఆర్ట్‌ప్రింటర్స్, రాజోలు

1901 సెప్టెంబరు 13న జన్మించి
దేశ స్వాతంత్ర్యంకోసం, రాజోలు
కోసం ఎంతో చేసిన నా తండ్రి గారు



నేను మా నాన్నగారితో...

కీ॥శే పొన్నాడ శ్రీరామవెంకట సూర్యారావు గారు
(1901-1964)

**శతజయంతి సంవత్సరంలో భక్తిపూర్వకముగా సమర్పణ**





## తొలిపలుకు

కన్నతల్లిప్రేమ మధురమైనది. పుట్టి పెరిగిన గడ్డ ప్రేమ కూడ అమూల్యమైనది. కాబట్టి కన్నతల్లిని గూర్చి పుట్టిన ఊరు గురించి గొప్పగా చెప్పుకోవడం తప్పుకాదు. చెప్పుకోకపోతే అది అపరాధం. అది మానసిక వైకల్యం అవుతుంది.

కన్నప్రేమ గొప్పదో, పెంచిన ప్రేమగొప్పదో వేరుగా ఉంటే గాని తెలియదు కాని ఆ రెండూ ఒకటైతే ఆ తీపి చెప్పనక్కర్లేదు. బొబ్బట్లు, పాయసం కలిపినట్లే అవుతుంది.

రాజోలు నన్నుగన్న తల్లి, పెంచిన తల్లి కూడ. అందుకే చాలమంది లాగే నాకు వల్లమాలిన అభిమానం రాజోలంటే.

చిన్నతనం నుంచి రాజోలుకు ఏదో చెయ్యాలని తపన. చేయలేకపోయాననే వ్యథ. చాలా ఊళ్ళకంటే రాజోలుకు ఎంతో చేయడానికి ఎన్నో వనరులు ఉన్నా అధినేతలు ఎవరూ పట్టించుకోవడం లేదనే ఆందోళన.

రాజులు పోయినా రాజ్యాలుపోయినా చరిత్ర మిగిలి ఉన్నట్లే, ఈ తరంలోని నైరాశ్యపుటాలోచనల ప్రవాహంలో కొట్టుకుపోయిన రాజోలుకు ఒక చక్కటి చరిత్ర ఉంది. ఎన్నో జాతులు కళ్ళుతెరవక ముందే మన భారత జాతి యావత్ప్రపంచానికి సంస్కృతి నేర్పిందని జవహర్‌లాల్ నెహ్రూ తన డిస్కవరీ ఆఫ్ ఇండియాలో అన్నారు. అల్లాగే ఇప్పుడిప్పుడే పుట్టి పెరుగుతున్నాం అని చెప్పుకునే చాలా ఊళ్ళకంటే, రాజమహేంద్రి వంటి కొన్ని పురాతన పట్టణాలతో సమాంతరంగా రాజోలుకు కూడ గత శతాబ్దాల వైభవం ఉన్నది. రాజోలుకు ఏమీచేయలేకపోయినా కనీసం పూర్వవైభవాన్ని పారదర్శకం చేయడమే నా ఉద్దేశ్యం.

ఇందుకు నా పితామహులు లేటు పొన్నాడభానుమూర్తి గారు (1859-1905) మరియు నా తండ్రిగారు లేటు పొన్నాడ శ్రీరామవెంకటసూర్యారావు (1901-1964) గారలు వ్రాసి, నిక్షిప్తం చేసిన డైరీలు నాకు ఆధారం కావడం, నన్ను ప్రోత్సాహం చేయడం నా పూర్వజన్మసుకృతం. చరిత్ర బంధించడానికి సినిమాకెమేరాలు, వీడియోకెమేరాలు లేని ఆ రోజుల చరిత్రకు వ్రాతలే ముఖ్యఆధారమైతే నా జ్ఞాపకాలు కూడ చిన్న ఆధారం.

ఇది నాది ఇది నా స్వంతం అనుకున్నదంతా అందరికీ ఇవ్వడం ; నాకు తెలుసున్న విషయాలను అందరికీ పంచడం నా అలవాటు. అల్లాగే నా ఇంట్లో ఉన్న నా పుస్తకాలలో నిక్షిప్తమైన ఊరుసంగతులు నాకే అనుకొనిచేస్తే నా అలవాటుకు భిన్నం అవుతుందనే ఉద్దేశ్యంతోనే ఈ చిన్న ప్రయత్నం. ఇందుకు ప్రత్యక్షంగా పరోక్షంగా సహకరించిన అందరికీ నా కృతజ్ఞతలు.

పొన్నాడ హనుమంతరావు

## విషయసూచిక









# 1. రాజోలు నైసర్గికము

భారతదేశపు పశ్చిమతీరాన, సంస్కృతి పుట్టినప్పుడే నాసికా త్రయంబకంలో పుట్టిన పవిత్ర గోదావరీమతల్లి, శబరి, మంజీర, వంటి ఉపనదులను చేర్చుకొని నిండుచూలాలుగా అఖండ గౌతమిగా రాజమహేంద్రి చేరింది. ధవళేశ్వరం వద్ద గౌతమి, వశిష్ఠ అను రెండు ముఖ్య శాఖలుగా విడిపోయింది. అక్కడే గౌతమికి మధ్య పిచికల్లంక. వశిష్ఠ కు మధ్య మద్దూరులంక అను చిన్న దీవులను సృష్టించి, ఈ రెండు శాఖలు ప్రయాణం సాగించి గౌతమి యానాం వద్ద, వశిష్ఠ అంతర్వేది వద్ద బంగాళాఖాతంలో కలసిపోయాయి. ఈ రెండు నదుల మధ్యభాగమే కోనసీమగా వ్యవహరింపబడుతోంది. సాంకేతిక పరంగా సెంట్రలుడెల్టాగా పిలువబడుతోంది. ఈ రెండు నదుల ముఖ కలయిక బొబ్బర్లంక. అక్కడ బయలుదేరిన పశ్చిమ శాఖయిన వశిష్ఠానది, పి. గన్నవరం ఎగువున గల బెల్లంపూడి వద్ద చీలి వైనతేయనదికి జన్మనిచ్చింది.

ఈ వైనతేయ నది గన్నవరం, పాశర్లపూడిల మీదగా గోగనమఠం వద్ద సముద్రాన్ని చేరింది. ఈ వశిష్ఠ, వైనతేయల మధ్య లంకనే నగరం దీవిగా వ్యవహరిస్తారు. అదే ఆలనాటి రాజోలు తాలూకా. ఈ వశిష్ఠా నది తూర్పుగాను, ఆ తరువాత దక్షిణంగాను తిరిగి పశ్చిమంగాను ప్రవహించి అంతర్వేది చేరి బంగాళాఖాతంలో కలసింది. అంతర్వేదికి సుమారు 20 మైళ్ల ఎగువ భాగాన్న గోదావరి ఎడమ ఒడ్డున ఉన్నదీ రాజోలు.

రాజోలు వద్ద మళ్ళీ వశిష్ఠ గోదావరిలో ఒక లంక ఏర్పడింది. అదే మధ్యలంక దీనికి 1984లో ఇందిరా ఐలాండ్స్ అని పేరు పెట్టబడింది. ఈ లంక అవతల చిన్న పాయ, దానికి ఉత్తరాన పశ్చిమగోదావరి జిల్లా దీనికి సరిహద్దు. గగనమార్గంలో పాలకొల్లు కేవలం 8 మైళ్ళు ఉత్తరంలో ఉంది. అలాగే గగన మార్గంలో సుమారు 10 మైళ్ళలో దక్షిణాన కేశనపల్లి వద్ద బంగాళాఖాతం ఉంది. రాజోలుకు తూర్పున సొంపలి మరియు బి. సావరం గ్రామాలు, దక్షిణం, పడమర శివకోడు గ్రామాలు సరిహద్దుగా ఉన్నాయి.

1853 సం॥లో కాటన్ మహాశయుడు ధవళేశ్వరం వద్ద 4 ఆనకట్టలు గన్నవరం వద్ద అక్విడెక్ట్ కట్టడంతో గోదావరికి ఎడమగట్టు ఏర్పడి దానికి ప్రక్కగా ఊరికి ఉత్తరంగా గన్నవరం మెయిన్ పంటకాల్వ ఏర్పడింది. దీనితో గోదావరి తనకు దక్షిణాన్న హద్దు నిర్ణయించుకొంది.

గోదావరి ప్రక్క నల్లరేగడి భూమి కావడంతో పచ్చదనం ఇక్కడ ప్రకృతికి శోభనిస్తుంది. ఊరు పొడువునా వెళ్ళే నిండు కాల్వ దాని ప్రక్క పచ్చని గోదావరి గట్టు. ఈ గట్టుపై నిల్చుని పచ్చని మధ్యలంకను, సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాలలో గోదావరిలో పడే సూర్యకిరణాల పరావర్తనం చూస్తే పులకించని హృదయాలు ఉండవు.

ఇక "**తల్లి గోదావరికి ఎల్లువొస్తే అందం**" అన్నట్లుగా వరదల్లో గోదావరి అందాలను చూసి తరించని వారే ఉండరు. చూపరులను ముగ్ధులను చేసే ఈ ప్రకృతికి సహజ సౌందర్యాన్ని ఆసరాగా తీసుకొని పర్యాటక కేంద్రంగా చేయుదాన్కి అన్ని అవకాశాలు ఉన్నాయి.

రాజోలులో వాతావరణం కూడా సాదారణంగానే ఉంటుంది. వేసవిలో అధిక వేడిమికాని, శీతాకాలంలో అధికచలిగా గాని ఉండదు. మండు వేసవి మే నెల చివరి వారంలోని రోహిణీకార్తిలో కూడా గరిష్ట ఉష్ణోగ్రత 40 డిగ్రీల సెంటిగ్రేడ్ కు మించదు. అట్లే శీతాకాలంలో కనిష్ట ఉష్ణోగ్రత 20 డిగ్రీల సెంటీగ్రేడ్‌కు తగ్గదు. ఎటొచ్చి గాలిలో తేమశాతం ఎక్కువ కావడంతో వేసవిలో చెమటపడుతుంది. వర్షపాతం కూడా సాదారణమే. ఇక్కడ ప్రకృతి వైపరీత్యాల వల్ల నష్టాలు ఎన్నడూ. ఏమీ జరగకపోవడం అదృష్టం.





## 2. రాజోలు - చరిత్ర

రాజోలు గ్రామం ఎప్పుడు పుట్టిందో తెలియదుకాని ఇది ఒక పురాతనమైన ప్రాంతం అనడానికి కొన్ని కథలు, ఆధారాలు లభిస్తాయి. ప్రక్కనే ఉన్న సోంపల్లిలో వశిష్ట ల వారు తపస్సు చేసారని, ఆయన అచ్చట సోమయజ్ఞం చేసారని అదే సోమపల్లి గా వ్యవహరిస్తూ ఇప్పుడు సోంపల్లి గా మారిందని పురాణ కథలు గా చెప్తారు. అలాగే ప్రక్కనే ఉన్న శివకోడు లో రాముల వారిచే ప్రతిష్ఠ చేయబడిన కోటి శివలింగాలలో ఆఖరిది శివకోడులోని శివాలయం కాబట్టి ఆగ్రామానికి శివకోటి అని పేరు వచ్చి శివకోడుగా మారిందని పురాణ కథలు చెపుతాయి. ఈ రెండు గ్రామాల మధ్యనే రాజోలు ఉన్నది. కడలి గ్రామంలో గల పురాతన కపోతేశ్వర స్వామి, అంతర్వేది గ్రామంలో గల నరసింహస్వామి ఆలయాలు, పురాతన క్షేత్రం, రామేశ్వరం క్షేత్రాలను బట్టి పురాతన కాలం నుంచి ఈ ప్రాంతం ఉన్నదని చెప్పవచ్చు. అదుర్రు గ్రామంలో బౌద్ధస్తూపాలు, తాటిపాక లో పురాతనమైన జైన విగ్రహాన్ని బట్టి అవి పురావస్తువులని తెలుస్తోంది. కాబట్టి నగరం ఖండంగా పిలవబడే ఈ ప్రాంతం క్రొత్తగా ఏర్పడిన దేవి కాదని అర్థం అవుతుంది.

ప్రస్తుతం రాజోలు ప్రక్కగల వశిష్ట గోదావరిపాయ ఇంకా ఉత్తరంగా ఉండేదని, ఏటిగట్లు వేయకముందే కాలక్రమేణా గోదావరి దక్షిణం వైపుకు కోసుకు వచ్చిందని పూర్వీకులు చెప్పేవారు. ప్రస్తుతం ఉన్న గోదావరి మధ్య భాగంలో రాజగోపాలస్వామి ఆలయం ఉండేదని అందుకే రాజోలు "రాజపోలు" అని పిలువబడేదని, గోదావరి దక్షిణాన్కి కోసుకు వచ్చినప్పుడు ఆ రాజగోపాలస్వామి ఆలయం నదీగర్భంలో కలిసిపోయిందని, ఆ తరువాత రాజగోపాలస్వామి విగ్రహం నరసాపురంలో తేలితే అచ్చట అక్కడప్రజలు రాజగోపాలస్వామి ఆలయం నిర్మించారని. (ఇప్పటికీ గోదావరి దగ్గరగా నరసాపురం లో రాజగోపాలస్వామి ఆలయం ఉన్నది.) తన పరిశోధనలో తేలిందని 1970 నుంచి 75 వరకు రాజోలు ప్రభుత్వ కళాశాలలో ప్రిన్సిపాల్ గా పనిచేసిన శ్రీ అన్నాప్రగడ లక్ష్మీనారాయణ గారు బహిరంగ ఉపన్యాసాలలో చెప్పేవారు. ప్రస్తుతం రాజోలు ఉమారామలింగేశ్వర స్వామి ఆలయంలోని, క్షేత్రపాలకుడు రాజగోపాలస్వామి కావడం, ఒక విగ్రహం అక్కడ ఉండటం కూడా ఈ వాదనను బలపరుస్తుంది.

పిఠాపురం వాస్తవ్యుడు కూచిమంచి సుబ్బారావు (సుబ్బకవి) చే రచింపబడి పునర్ముద్రింపబడిన "**హిందూసుందరి**" మరియు 1927 సం॥లో ప్రచురింపబడిన "శ్రీ రాజారావు జగ్గమాంబ" అను పద్మనాయక్ వంశజ (పిఠాపురం రాజ్యం) యొక్క జీవితచరిత్రలో వ్రాసిన ప్రకారము, పిఠికాపుర వంశ మూలపురుషులు నవపోతమనాయుని వంశ వృక్షంను బట్టి, పిఠికాపుర పదవ తరంవారు. సంస్థానాధీశుల వల్ల భ్రష్ట్యములను పొందే నరసన్న గారి మునిమనవుడు నీలాద్రిరాయణం గారని (1794-1828) వ్రాయబడింది. "**శ్రీ రమణయరాం చరిత్ర**" (1926)లో ఈ నీలాద్రి రాయణం గారు (2) ప్రథమభార్య తన మూడవ సోదరియగు చేబ్రోలు రాయణంగారి భార్య సీతయ్యమ్మకు "**నగరం ఖండము**"ను 1816 సం॥ ప్రాంతమున వ్రాయించి ఇచ్చినట్లు చెప్పబడింది. 1824 సం॥ ఈమె తన భర్తపై దావాలు చేయటానికి, సంసార ఖర్చులకు, ఈనగరం ఖండాన్ని అమ్మివేసినట్లు 37వ పేజీలో వ్రాయబడింది. పిఠాపురం ప్రక్కగల "పొన్నాడ" అను గ్రామంనుంచి కరణాలుగా కొందరిని ఈ నగరం ఖండంకు పంపినట్లు అర్థంవుతుంది. ఈ విధంగా నగరం ఖండం పిఠాపురం ఎస్టేటునుండి క్రయంకాబడి తరువాత బ్రిటిషువారి అధీనం చేయబడింది.

# 3. రెవిన్యూ వివరాలు - రాజోలు తాలూకా

1865 వ సం॥ సర్వే జరిగే నాటికి రాజోలు గ్రామం గోదావరి జిల్లా, నర్సాపురం తాలూకాలో భాగంగా ఉండేది. రెవిన్యూ లెక్కల ప్రకారం ఈ గ్రామ విస్తీర్ణము సుమారు 1100 ఎకరములు అంటే సుమారు రెండు చదరపుమైళ్ళు మాత్రమే. సుమారు 500 సర్వే నంబర్లుగా విభజింపబడింది. అప్పటికే ధవళేశ్వరం ఆనకట్టనుండి గన్నవరం కాలువ ఉన్నందున ఇచ్చట భూమి ఆ పెద్ద కాలువనుంచి వచ్చే 5 చిన్న కాలువలతో సాగుబడి అయ్యేది. 3వంతులు వరి, ఒకవంతు చెఱకు, మిర్చి వేసేవారు. కొద్దిగా కొబ్బరి, ఫలతోటలు చాలా తక్కువగా ఉండేవి. రొయ్యపంట లేదు. భూమి బంకరేగడిగా ఉండి మంచి స్వభావము కలది. నూతులలో 4 గజములలో నీరు పడుతుంది. అప్పటికే శివలి మరియు నగరం గ్రామాలలో సంతలు జరిగేవి. 1865 నాటి రాజోలు గ్రామ జనాభా 1225 మాత్రమే.

తిరిగి 1902వ సంవత్సరములో సర్వే చేయబడింది. శ్రీ జి.యఫ్.ఫర్గేసన్ అనే ఇంగ్లీషు స్పెషలు సెటిల్‌మెంట్ ఆఫీసరు పర్యవేక్షణలో సర్వేచేయబడింది. అప్పటికి రాజోలు, గోదావరిజిల్లా నర్సాపురం తాలూకాగా కొనసాగింది. గ్రామాన్ని ఈ రీసర్వేలో 246 సర్వేనంబర్లుగా విభజించారు. మిగతా విషయాలలో మార్పులేదు. అయితే 1901 జనాభా లెక్కలునాటికి గ్రామజనాభా పురుషులు 1232, స్త్రీలు 1321తో మొత్తం 2553కు పెరిగింది. ఇందులో 28 మంది ముస్లింలు అయితే క్రిష్టియన్‌లు అసలు లేరు. ఈ జనాభా 1911 నాటికి 2,831, 1921 నాటికి 3,727కి పెరిగింది. 1921 నాటికి ముస్లింలు 119 మంది క్రిష్టియన్స్ 10 మంది మాత్రము. ఈ జనాభా 1961 నాటికి రెట్టింపుఅయి 7వేల చిల్లరకు మాత్రమే చేరింది. 1991 జనాభా లెక్కలు ప్రకారము రాజోలు జనాభా 12,997 ఇందులో పురుషులు 6,455 స్త్రీలు 6,542 ఇందులో షె.కులు 1056 షె.తె.లు 88

గ్రామాలలో, పట్టణాలలో,నగరాలలో 20వ శతాబ్దంలో జనాభా విపరీతంగా పెరిగిపోతుంటే రాజోల్లో మాత్రము రాజోలు ఎక్కువ పెరగనందకు విచారించాలో లేక జనాభానియంత్రణ సాధించి దేశంలో అగ్రగామిగా నిల్చేమని గర్వించాలో అర్థంకాదు. జనాభా తక్కువ అయినప్పటికి కోనసీమలో అమలాపురం, రాజోలు, రెండు ఊళ్ళు మాత్రమే పట్టణప్రాంతాలుగా ప్రకటింపబడ్డాయి. ఇప్పటికి పట్టణప్రాంతలుగా వచ్చే నష్టాలే తప్ప





లాభాలు ఏమి కన్పించవు. రాజోలు ప్రాంతాన్కి ఉత్తరంగా ఉన్న మధ్యలంక (ఇందిరా ఐలాండ్స్) కూడా సర్వేచేయబడి రాజోలు రెవెన్యూ గ్రామంలో భాగంమై ఉన్నది.

1904సం॥లో నర్సాపురం నుండి విడిపోయి రాజోలు తాలూకాగా ఏర్పడింది. అప్పటికే గోదావరిజిల్లా తూర్పు, పశ్చిమగోదావరిజిల్లాలుగా విడింది. గోదావరి ఆఖరిపాయ వశిష్టానదిగా తూర్పుప్రాంతమంతటా తూర్పుగోదావరిజిల్లా అయింది. ఆ వశిష్టనదిని చేరి ఉన్న రాజోలుతాలూకా తూర్పుగోదావరికి చివరిప్రాంతం అయింది.

ఈ రాజోలు తాలూకాకు కొద్ది రోజులు మాత్రము శివకోడు కేంద్రముగా ఉన్నదని చెబుతారు. 1908 సం॥లో రాజోలులో భూములు సేకరించి కార్యాలయాలు నిర్మించడంతో రాజోలు కేంద్రం అయింది. నగరం ఖండంమే (గన్నవరం, పోశర్లపూడి వరుకు) గాకుండా కొత్తపేటతాలూకా కూడా ఈ రాజోలుతాలూకా లో భాగంగా ఉండేది. పడమటివైపు వశిష్టనది, ఉత్తరంవైపు బొబ్బర్లంక (రాజమండ్రి) వరకు విస్తరించి ఉండేది. గన్నవరం అవతలి భాగాన్ని (అక్విడెక్ట్ అవతల, తొట్టి అవతల, ఇవతలభాగాన్ని తొట్టిఇవతల అని వ్యవహరించేవారు. 1949 వ సం॥లో ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో రెవిన్యూమంత్రిగా పనిచేసిన శ్రీ కళావెంకట్రావు గారి (ముక్కామల) చొరవతో రాజోలుతాలూకా నుండి విడిపోయి, వేరే కొత్తపేట కేంద్రంగా కొత్తపేటతాలూకా ఏర్పడింది.

1915 సం॥లో లోనే కోళ్ళవారివద్ద భూములు సేకరించి తాలూకా ఆఫీసు భవనం విశాలమైన 3ఎకరముల 5సెంట్ల భూమిలో నిర్మించడమయినది.అదే భవనంలో సబ్‌జైలు, సబ్‌ట్రెజరీ, సబ్‌మెజిస్ట్రేట్ కార్యాలయం, సర్కిల్‌ఇన్స్‌పెక్టర్ కార్యాలయాలు, పోలీసుస్టేషన్ నెలకొల్పబడ్డాయి. బ్యాంకులు స్ట్రాంగ్‌రూమ్‌లులేని ఆరోజులలో ప్రభుత్వ ఖజానాఅంతా సబ్‌ట్రెజరీలో నిల్వఉండేది. ప్రక్కనే పోలీసుస్టేషను ఉన్నందున ఆఖజానా కాపాలాబాధ్యత కూడా వారు వహించేవారు. ఈ భవనం కట్టకుముందు తాలూకాఆఫీసు జైలుగదులు ప్రస్తుతంఉన్న కోర్టుభవనంలో ఆర్.ఎస్.నెం.111/1లో ఉండేవి.

రాజోలుతాలూకా ఏర్పడకముందు రాజోలులో డిప్యూటితహశీల్దార్ వారి కార్యాలయంఉండేది. 7-6-1898 ని డిప్యూటితహశీల్దారు ఆఫీసులో గ్రూపుఫోటో ఒకటి కూడా తీయబడింది. నర్సాపురంతాలూకా బోర్డు మీటింగ్ రాజోలులో 18-6-1898న జరిగింది. అప్పట్కి ఆర్.సుబ్బారావుగారు డిప్యూటితహశీల్దార్‌గా ఉండేవారు. వారు భీమవరం ట్రాన్స్‌ఫర్‌యితే ఉండిరామారావుగారు డిప్యూటితహశీల్దార్‌గా 24-8-1898న చార్జితీసుకొన్నారు. ఈయనఇక్కడపనిచేస్తుండగా కమలాబాయమ్మ అను ఆమెతోఉండేవాడనే అభియోగంతో డిప్యూటికలెక్టర్‌వారి వద్ద 1902 జూలైలో ఎంక్వైరీ

జరిగింది కూడా. "19-8-1902న ఇంగ్లడ్‌లో ఏడవ ఎడ్వర్డ్‌చక్రవర్తి పట్టాభిషేకం జరిగే సందర్భంలో రాజోలులో చక్రవర్తి గౌరవార్థం భాగవతకాలక్షేపం జరిగింది. డిప్యూటితహశీల్దారు, సబ్‌రిజిస్ట్రారు హాజరుఅయినారు." 1898 సం॥ ప్రాంతంలో అయ్యగారి సుబ్బారాయ్డుగారు కరణం, డిప్యూటిగా. పొన్నాడ భానుమూర్తిగారు అసిస్టెంట్ కరణంగా, అరుమిల్లి వెంకటరత్నం గారు, గ్రామమున్సబు గా పనిచేశారు. 3-10-1902లో పొన్నాడ వీరభద్రరావుగారు కరణీకం చార్జితీసుకొన్నారు.1902లో జిల్లెళ్ళ కృష్ణారావుపంతులుగారు డిప్యూటితహశీల్దారు గా పనిచేశారు. కృష్ణారావుపంతులు గారి తర్వాత వి.పద్మనాభరాజుగారు డిప్యూటితహశీల్దార్ గా చేరారు. పొన్నాడ భానుమూర్తిగారు అసిస్టెంట్‌కర్ణంగా రాజీనామాచేయగా తటవర్తి వెంకయ్యగారు 7-1-1903న చార్జితీసుకొన్నారు. 1-1-1903 సం॥తేదిన 7వ ఎడ్వర్డ్‌చక్రవర్తి భారతచక్రవర్తిగా ఢిల్లీలో వేరే పట్టాభిషేకం జరిగింది. ఆ సందర్భంలో డిప్యూటి తహశీల్దారు ఆఫీసులో సభ జరిగింది. స్కూలుపిల్లలకు మిఠాయిలు పంచారు. గ్రామంలోని పబ్లిక్ భవనాలను అలంకరించి దీపాలు పెట్టారు.

రాజోలుతాలూకా ఏర్పడ్డాక మొదటి తాహశీల్దారు ఎవరో తెలియదు. కాని 1910కి ముందు దావులూరు ఉమామహేశ్వరరావుగారు.1910-12మధ్య తాయిసుబ్బారావునాయుడు గారు తాహశీల్దార్లుగా పనిచేశారు. అప్పుడే పద్మశాలనర్సింహంగారని తాలూకా ఆఫీసులో హెడ్‌గుమస్తాగా పనిచేశారు. నాయుడుగారు తర్వాత 1914-16 ప్రాంతంలో మంత్రిప్రగడనర్సింహంగారు తాహశీల్దార్‌గా పనిచేశారు. ఆయన హయాంలోనే సుందరమ్మచెరువు గట్టున ఇండ్లకు, స్థలాలు ఇచ్చారు. ఆపేటకు నర్సింహారావుపేట అనిపేరు వచ్చిందని చెప్పబడింది. ఆయన 1933 ప్రాంతంలో అమలాపురం ఆర్.డి.వో. గా పనిచేసారు. ఆయన గౌరవార్థం చేబియ్యం బుచ్చిఅబ్బాయిశర్మగారు ఆయన ఇంటివెనుక పూలతోటవద్ద 21-12-1933న పార్టీ ఇచ్చారు.

రాజోలు తాలూకా తహశీల్దార్లుగా ఈ క్రిందివారితో పాటు చాలామంది ప్రముఖులు పనిచేశారు. ఆఖరి తాహశీల్దారు పి.ఎల్. గణేశ్వరరావు ఈయన ఆతర్వాత మొదట ఎం.ఆర్.ఓ.అయ్యారు.

**రాజోలుతాలూకాలో పనిచేసిన కొంతమంది తహశీల్దార్‌లు**

| | |
|---|---|
| 1904-1910 మధ్య | దావులూరి ఉమామహేశ్వరరావు గారు |
| 1910-1912 మధ్య | తాయి సుబ్బారావునాయుడు |
| 1940 లో | రామమూర్తినాయుడు |
| 1942-1946 | జట్ల సత్యనారాయణగారు |





**1949 తర్వాత ఎక్కుకాలం పనిచేసిన తహశీల్దార్లు**

| | | | |
|---|---|---|---|
| 1950-51 | కె.వి.రాఘవయ్య | 1964-65 | కె.ఎస్.కామేశ్వరరావు |
| 1952-53 | జె.యమ్.డి.ఖాన్ | 1965-67 | ఎస్.నారాయణ |
| 1953-54 | వై.వెంకన్ననాయుడు | 1967-69 | బి.వి.గుణ్ణేశ్వరరావు |
| 1954 | పి.పుండరీకాక్షుడు | 1969-70 | డి.సత్యనారాయణ |
| 1955-56 | డి.యస్.నారాయణ | 1970-71 | వి.ఎస్.రంగారావు |
| 1956-57 | డి.వి.శాస్త్రి | 1972-73 | జి.వి.శర్మ |
| 1957-58 | జి.వెంకటేశ్వర్లు | 1973-76 | ఆర్.ఎస్.ఎన్.మూర్తి |
| 1958-60 | కె.ఎస్.ప్రకాశరావు | 1976-78 | ఎ.ఎస్.ప్రకాశరావు |
| 1960-62 | పి.అబ్బాయిరెడ్డి | 1978-81 | గోపాలచార్యులు |
| 1962-63 | ఎల్.విశ్వనాథం | 1981-82 | ఎస్.ఎ.పద్మనాభరావు |
| 1963 | ఎ.కె.పాలు. | 1982-83 | ఎ.సత్యనారాయణ |
| | బి.సూర్యనారాయణ | 1983-84 | జి.రంగారావు |
| 1963-64 | సి.సూర్యారావు | 1984-85 | పి.ఎల్.గణేశ్వరరావు |

1985వ సం॥లో రాష్ట్రప్రభుత్వం మండలవ్యవస్థ ప్రవేశపెట్టినప్పుడు రాజోలుతాలూకా సఖినేటిపల్లి, మలికిపురం, రాజోలు,మామిడికుదురు మండలాలుగా విడిపోయింది. రాజోలుతాలూకాలోని మానేపల్లి, వాడ్రేవుపల్లి, మొందెపులంక మరియు లంకలగన్నవరం రెవిన్యూగ్రామాలు పి.గన్నవరం మండలంలో కల్సిపోయాయి. ఈమండలవ్యవస్థలో రెవిన్యూడిపార్ట్‌మెంట్ తన పూర్వపు వైభవము, హుందాతనాన్ని, ప్రాబల్యాన్ని, కోల్పోయిందని చెప్పకతప్పదు. తహశీల్దారు స్థానంలో మండలరెవిన్యూఆఫీసర్లు ఏర్పడ్డారు. రాజోలుకు మొదటి ఎం.ఆర్.ఓ.శ్రీ పి.ఎల్.గణేశ్వరరావు గారు.

**కొంతమంది ముఖ్యమైన ఎం.ఆర్.ఓ.ల పేర్లు**

| | |
|---|---|
| 1) పి.యల్.గణేశ్వరరావు - 1985 | 4) ఎండి. ఇబ్రహీం -1988 |
| 2) జి.వెంకటరత్నం-1985 | 5) కె.వి.కె. సుబ్బారావు -1988- 92 |
| 3) డి.చిన్నయ్య- 85-87 | 6) బాలాజిసింగ్ - 92-97 |

| | |
|---|---|
| 7) వి.సూరపరాజు -97-99 | 9) ఎస్.శ్రీధర్ (ట్రైనీకలెక్టర్) - 1999 |
| 8) కె.వి.ఎల్.ఎస్. స్వామి - 1999 | 10) హేమసుందరవెంకట్రావు - 21-5-99 శతాబ్దపు చివరి మరియు కొత్తశతాబ్దపు మొదటి ఎం.ఆర్.ఓ. |

1920నుండి రాజోలుగ్రామకర్ణంగా పొన్నాడ వీరభద్రవిశ్వేశ్వరరావు గారు. మున్సిబ్‌గా మీనవల్లి సుబ్బారాయుడుగారు పనిచేశారు. ఆతరువాత కస్తూరి జయరావుగారు ఆయన తర్వాత వీరికుమార్తు రామచంద్రమూర్తి కరణంగాను మీనవల్లి సుబ్బారావుగారు గ్రామమున్సబ్ గా ఆవ్యవస్థ రద్దువరుకు పనిచేశారు. ఆతర్వాతనుంచి సిరిగినీడి కృష్ణమూర్తిగారు వి.ఎ.వో.గాపనిచేశారు. ఇక గ్రామసేవకులుగా ఆకుల అఖండం, కర్రినారాయణమూర్తి లోగడ పనిచేశారు. ప్రస్తుతం తలుపూరి సత్యనారాయణ వగైరాలు పనిచేస్తున్నారు.

1996లో అప్పటి జిల్లాకలెక్టర్ వారు రాజోలు. రామచంద్రపురాలను వేరే సబ్‌డివిజన్ చేసి అక్కడ ఆర్.డి.ఓ.కార్యాలయాలను నెలకొల్పాలని ప్రభుత్వాన్కి సిఫార్స్ చేశారు. ఇదిపత్రికలలో ప్రకటించారు కూడా. ఎక్కువ ల్యాండ్‌రెవెన్యూ వస్తున్నందున, కోస్తాప్రాంతం ఉన్నందున, పూర్వపు తాలూకాగా రాజోలు సిఫార్స్‌చేశారు. రామచంద్రపురంలో నెలకొల్పేరుగాని ఇంతవరకు రాజోల్లో స్థాపించకపోవటానికి బహుశా రాజకీయాలు కారణంకావచ్చు.





# 4. రవాణా

20వ శతాబ్దపు ప్రారంభంలో రవాణా అంతా నీటిప్రవాహాలపైన, రోడ్లపై జంతువులు లాగేబండ్లపైనే సాగేది. అప్పటికి రైళ్ళుగాని, మోటారువాహనాలుగాని లేవు. అయితే చరిత్ర పుట్టినప్పటినుంచి నీటిపై ప్రయాణాలు ఎక్కువుగా ఉండటంతో నాగరికత యావత్తూ సముద్రపు ప్రాంతాలలోను, నదిఒడ్డులలోను వెలసింది. కొన్ని చరిత్రాత్మక ప్రదేశాలు కూడా ఈ సముద్రపు ఒడ్డున, నదీ ఒడ్డున వెలిసాయి. ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్నం, మచిలీపట్నంలు సముద్రం ప్రక్కన ఉండటంతో కలకత్తా, మద్రాస్, బొంబాయి నగరాల వలెనే అభివృద్ధిచెందాయి. అట్లాగే కృష్ణానది ప్రక్కన విజయవాడ, గోదావరినదిప్రక్కన రాజమండ్రి నగరాలు చరిత్ర సృష్టించుకొన్నాయి.

అదేవిధంగా వశిష్టానదికి దక్షిణ ఒడ్డున ఉన్న రాజోలు, పశ్చిమాన్న ఉన్న నరసాపురం కూడా ప్రాధాన్యత సంపాదించుకొన్నాయి. రాజోలుతాలూకాకు చుట్టూనీరు ఉన్నందున నౌకాయానం ఒకటే రవాణా సౌకర్యంగా ఉండేది. వశిష్టానదిలో పడవపై బయలుదేరి నరసాపురం వెళ్ళి అక్కడనుంచి ఇతర ప్రాంతాలకు వెళ్ళవలసవచ్చేది. 1860లో కాలువలు ఏర్పడిన తరువాత గన్నవరం కాలువ ద్వారా పడవలో బయలుదేరి రాజమండ్రి రెండు రోజులుకు చేరుకొనేవారు. తరువాత కాల్వల్లో లాంచీ సర్వీసు ఏర్పడింది. తెల్లవారుజాము గం॥ 3.30ని॥లకు రాజోలులో బయలుదేరిన లాంచీ సాయంకాలాన్కి రాజమండ్రికి చేరుకొనేది. కొంతమంది ధనవంతులు గుర్రాలపై వెళ్లటం కూడా కద్దు. కొద్ది కాలం తరువాత రాజోలు నుండి నరసాపురాన్కి లాంచి సర్వీసు ఏర్పాటు చేయబడింది. ది 5-3-1898న "నైల్" అనబడే పెద్ద స్టీమరు మొదటిసారిగా నరసాపురంనుండి ఉదయం 11-50 ని॥లకు రాజోలు చేరింది. అప్పటినుంచి పెద్ద స్టీమరు సర్వీసు ప్రారంభమయింది. టిక్కెట్టు 3 అణాలు ఉన్నట్లు తెలుస్తోంది. రాజోలుతాలూకాలోనేగాక అమలాపురం తాలూకాలో కూడా కొన్ని గ్రామలవారికికూడా ఇదే ముఖ్యమైన రవాణాసౌకర్యంగా ఉండేది. తప్పనిసరిగా రాజోలు వచ్చి ఈస్టీమరు ప్రయాణంచేశేవారు. గోదావరికి దగ్గరిగా ప్రయాణీకులకు సత్రం నిర్మించబడింది. ఆంజేయస్వామి ఆలయంలో కూడా ప్రయాణీకులు విశ్రాంతి తీసుకొనేవారు. 1928 సం॥లో నిడదవోలు, పాలకొల్లు, నరసాపురం రైల్వేలైను ఏర్పడటంతో రాజోలునుండి నరసాపురాన్కి ఈస్టీమరు ప్రయాణం ప్రాధాన్యత సంతరించుకొంది. గోదావరికి కాలువపై ప్రస్తుతం ఉన్న వంతెన అప్పటినుంచి ఉన్నది. ఈ సెంటర్, ప్రయాణీకులరద్దీతో ఎన్నో కాఫీ హోటల్స్, వ్యాపారస్టాల్స్‌తో కళకళలాడుతూ ఉండేది.

పూర్వం పాతగన్నవరం అక్విడెక్ట్‌కు ఇరువైపులా కాలినడక గట్లు మాత్రమే ఉండేవి. కాబట్టి కనీసం బండ్లు కూడా రాజోలు తాలూకానుండి బయటకు వెళ్ళాలంటే పడవపై వెళ్ళవలసి వచ్చేది. ఆ నది వరకుగాని కాల్వవరకుగాని ఎడ్లబండిపై లేక గుర్రాల పై గాని వెళ్ళేవారు. గొప్పింటివారు, ఆడవారు సవారీలపై వెళ్ళేవారు (మనుషులు మోసేపల్లకీలు) పొన్నాడ భానుమూర్తి గారు పలివెలనుంచి పడవలలో వచ్చి మొండపులంక వచ్చి అచ్చటనుంచి పల్లకీలో 27-4-1898ని రాత్రిబయలుదేరి 28-4-1898 ఉదయం చేరినట్లు డైరీఎంట్రీలను బట్టి తెలుస్తోంది. ఇంచుమించు 1925 సం॥వరకు ఈ ప్రాంతంవారికి గోదావరిలో స్టీమర్లు, పడవలు, కాల్వల్లో పడవలు, గట్లపై గుర్రాలు, బండ్లు, ధనవంతులకు సవారీలు మాత్రమే ప్రయాణసాధనాలు. 1925వ సం॥ తర్వాత మోటారుబస్సులు, చిన్నకార్లువచ్చాయి. 1929వ సం॥లో మహాత్మాగాంధీ రాజోలు వచ్చినప్పుడు అమలాపురం నుంచి పాశర్లపూడి గోదావరిదాటి కారులో రాజోలు వచ్చారు. ముందు మరో కారులో కొంతమంది స్థానికులు వారికి స్వాగతం ఇవ్వటానికి రాజోలు చేరుకొన్నారు. మర్నాడు గాంధీమహాత్ముడు గన్నవరం మీదుగా వెళుతూ అప్పటి వేసవికాలం వల్ల కాల్వలో నీరు లేనందున గన్నవరం అక్విడెక్ట్ తొట్టిలోనుండి కారులో వెళ్ళినాడు. కాబట్టి అప్పటికే రాజోలులో చిన్నకార్లు వచ్చాయి. 1930లో శ్రీ కళావెంకట్రావు గారిని రాజోలులో అరెస్ట్ చేసినప్పుడు, పొన్నాడ సూర్యారావుగారిని అరెస్టుచేసినప్పుడు, వారిని పోలీసులు రాజోలు నుంచి అమలాపురం ప్రత్యేక బస్సులలో తీసుకువెళ్ళేరు. కాబట్టి అప్పటికే బస్సులు వచ్చాయిని అర్థంఅవుతుంది. 1930నుంచి బస్సులు పాశర్లపూడి రేవునుండి సఖినేటిపల్లిరేవు వరకు చాలాకాలం పెట్రోలుతో నడిచాయి. 1939 నుండి 45వరకు రెండవప్రపంచయుద్ధం వచ్చినప్పుడు పెట్రోలు కొరత ఏర్పడి బొగ్గులతో బస్సులు నడిపేవారు. తర్వాత మళ్ళీ పెట్రోలు తో నడిచేవి. ఈ బస్సులు కేవలం 24 సీటర్ మాత్రమే. ఇవి ఓపెన్ బ్రైవు బస్సులు. అంటే వీటి బాడీ కేవలం పందిరి లాగ మాత్రమే ఉండేది. ఒక పెద్ద సైజు జీపు లా ఉండే అకారం లాగ ఉండేవి. టాపు మాత్రము రేకుతో ఉండేవి. ఒక వేళ బస్సు కాల్వలో పడితే తప్పించుకోవడాన్కి వీలుగా ఉండాలని కోనసీమలో ఈ రకం బస్సులు మాత్రమే అనుమతించేవారు. ప్రైవేటు యజమానులు ఈ బస్సులు నడిపేవారు. ఈ బస్సులలో డ్రైవరు ప్రక్కసీటు ప్రతిష్టాత్మకంగా ఉండేది. పెద్దవార్కి, పోలీసువార్కి మాత్రమే ఈ సీటు కేటాయించేవారు. వీరు ప్రయాణానికి వస్తే టైంతో నిమిత్తం లేకుండా బస్సులు ప్రయాణికులతో సహా వారికోసం వేచిఉండేవారు. ఎడమ మడ్గార్డ్‌పై కాలు పెట్టుకొని బస్సులో కూర్చోవటం ఒక దర్జా. అయితే ముందుసీటులో నిద్రపోరాదని హెచ్చరిక వ్రాసేవారు. 1960 ప్రాంతంలో మల్కిపురం





స్టేషన్లో సబ్‌ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తున్న ఒక లావుపాటి అధికారి ఇటువంటి బస్సులో ఫ్రంటు సీటులో ప్రయాణం చేస్తూ గన్నవరం అక్విడెక్ట్ పై కునుకుపాట్లుపడుతూ ప్రక్కకాల్వలో పడ్డారు. వెంటనే ప్రయాణికులు రక్షించారు. అదృష్టవశాత్తు ఆయనకు దెబ్బలు తగలలేదు. (ఇది పోలీసువారిపై జోకు కాదు, నిజంగా జరిగింది. సరదా కోసం వ్రాసేను.) 1944 సం॥ ఆగష్టు 24 ప్రాంతంలో వచ్చిన గోదావరి వరద వల్ల గన్నవరం అక్విడెక్ట్‌కు సంబంధించిన 4,5 స్తంబాలు పడిపోయాయి. అందుచే అది తిరిగి నిర్మించవలసివచ్చింది. ఆసందర్భంలో అక్విడెక్ట్ తొట్టిలోని కాల్వలో ఎడమవైపున దిమ్మలు కట్టి రోడ్డు ఏర్పాటుచేశారు. అదే ఇప్పటి పాత అక్విడెక్ట్ రోడ్డు. మద్రాస్ ఉమ్మడి రాష్ట్ర రెవిన్యూమంత్రి కళావెంకట్రావు గారి జోక్యంతో నిర్మాణం జరిగి 1948 చివరకు పూర్తి అయింది. దీని ప్రారంభంతో మొదటిసారిగా రాజోలు తాలూకాకు కోనసీమ ఇతర ప్రాంతాలుకు రోడ్డు సౌకర్యం ఏర్పడింది. అయితే చాలాకాలం వరకు ఈ అక్విడెక్ట్ బ్రిడ్జిపై చిన్న కార్లు మాత్రమే అనుమతించేవారు.

తరువాత స్వర్గీయ రుద్రరాజు రామలింగరాజు గారు చొరవతో మొదటిసారిగా 1959 లో రాజోలు నుండి బొబ్బర్లంకకు బస్సు వేసేరు. శ్రీ బోళ్ళ సత్యనారాయణ గారు (మాజీ ఎమ్మెల్సి గారికి) రూటు ఇవ్వబడింది. రాజోలులో ఉదయం 5-30గం॥లకు బయలుదేరి బొబ్బర్లంకకు 8-15 ని॥లకు చేరి తిరిగి 8-30కు అచ్చట బయలుదేరి 11-15 కి రాజోలు చేరేది. తిరిగి మధ్యాహ్నం రాజోలులో బయలుదేరి బొబ్బర్లంకకు 2-45 ని॥లకు చేరి మళ్ళీ 3-00కు బయలుదేరి సాయంకాలం రాజోలు చేరేది. ఈ బస్సు సరిగ్గా టైం మెయింటెయిన్ చేసేది. బస్సు రావడంతో రాజమండ్రిలో ఉదయం 7-00లకు బయలుదేరి బొబ్బర్లంక లాంచీలో 8గంటలకు చేరి 11-15కి రాజోలు, ఇంతతక్కువ సమయంలో సాదారణ ప్రయాణికులు సైతం చేరడం ప్రారంభమయింది. ఆ తరవాత సఖినేటపల్లి నుండి కూడా బొబ్బర్లంక బస్సులు వచ్చాయి. అట్లాగే 1960 నుండి రాజోలు నుండి అమలాపురంనకు, ముక్తేశ్వరాన్కి,పల్లంకుర్రుకు నేరుగా బస్సులు ఏర్పడ్డాయి. మొదటిసారిగా పెద్దబస్సులు (పెట్టె బస్సులు అనేవారు) ప్రారంభముఅయ్యాయి.

1967లో రావులపాలెం వద్ద బ్రిడ్జి ఏర్పడటంతో రాజోలునుండి రాజమండ్రి,కాకినాడకు ప్రైవేటు బస్సులు ఏర్పడ్డాయి. 1972 సం॥ మొదటిసారిగా రాజోలునుండి హైదరబాదుకు ఆర్టీసి బస్సు ప్రవేశపెట్టబడింది. 1976 సం॥లో తూర్పుగోదావరి జిల్లాలో బస్సులను జాతీయంచేయడంతో ఆర్టీసి బస్సులు వచ్చాయి. 1979 సం॥లో అప్పటి తహశీల్దారు శ్రీ ఆకెళ్ల సూర్యప్రకాశరావు అప్పటి సర్పంచ్ మరియు

రామలింగరాజు కృషితో రాజోలులో ఆర్టీసి డిపో ఏర్పాటుచేయబడింది. శివకోడు వైపు రాజోలులో 8 ఎకరాలభూమి ల్యాండ్ ఎక్విజిషన్ చేసి డిపో నిర్మాణం ప్రారంభించారు. అయితే నిర్మాణం ఆలస్యం చేయడంతో మళ్ళీ ఇంకో క్రాంట్రాక్టరుకు ఇచ్చి పూర్తిచేసారు. ఆర్టీసి రావడంతో విశాఖ.గుంటూరు మరియు విజయవాడకు.భద్రాచలం. తిరుపతికి బస్సు సౌకర్యంఏర్పడింది. అట్లాగే తాలూకాలోని మారుమూల ప్రాంతానికికూడా రాజోలుకు నుండి బస్సుసౌకర్యం ఏర్పడింది. పూర్వం ప్రైవేటు బస్సులన్నీ గాంధీబొమ్మ వద్ద ఆగేవి. జగ్గన్నపేట వైపు బస్సులు తోరం మునేశ్వరావుగారి కొట్టు వద్ద. సఖినేటిపల్లి వైపు బస్సులు, గ్రంధి వారి కొట్టు వద్ద ఆగేవి. తర్వాత ఈ స్టాండు నెహ్రూవిగ్రహం వద్దగల పాతబస్టాండుకు మార్చేరు. పూర్వం అది గుర్రపుబళ్ళ స్టాండు. ఆర్.టి.సి డిపో బస్‌స్టేషన్ ఏర్పడ్డాక పాతబస్టాండు టాక్సీ స్టాండ్‌గా మారింది బస్సు ప్రయాణికుల సౌకర్యార్థం జగన్నపేట పతి అండ్ కో వారు గ్రామచావిడి వద్ద. 1990 శ్రీకొండాసుబ్బారావు గారు వారి భార్య జ్ఞాపకార్థం పాతబస్టాండ్ వద్ద. 1990లో శ్రీ చిక్కిన నర్సమ్మ గారు తన భర్త మూరయ్యగారి జ్ఞాపకార్థం డా॥ నున్న నారాయణ మూర్తి గారి హాస్పటల్ వద్ద 1992లో శ్రీమతి నున్న అన్నపూర్ణమ్మగారు తన భర్త నాగభూషణం గారి పేర కాలేజి వద్ద ఎంతో వ్యయించేసి బస్సు షెల్టర్స్‌ను నిర్మించి పెట్టారు. అవి ఏమి అర్థం వచ్చాయఅనో, ఆర్.అండ్.బి. వారు 1997లో వాటిని కూలగొట్టారు. 1996 సం॥నుండి హైదరాబాద్‌కు కేశినేని. జయంతి.వెంకటరమణ. సాయికృష్ణ వగైరా ప్రైవేటు బస్సులు ఏర్పడ్డాయి.

### ఆర్.టి.సి.డిపోమేనేజర్ల వివరాలు

ఎస్.కె.బాషా (1-10-79 నుంచి 30-11-79), ఎస్.రామచంద్రరాజు (4-12-79నుంచి 20-5-81), వి. జానకిరామయ్య (21-5-81 నుంచి 7-6-84), సి.హెచ్.శ్రీనివాసరావు, కె.రామారావు (8-6-84 నుంచి 26-6-86), ఎస్.ధనంజయరావు (12-12-87నుంచి 12-6-90), పి.వి.రామారావు (18-6-90 నుంచి 18-6-92), టి.హెచ్. విష్ణురావు (11-6-92నుంచి 14-7-93) ఎస్.టి.పి. రాఘవకుమార్ (14-7-93నుంచి 20-5-96), బి.హెచ్.సింగ్ (25-5-96 నుంచి19-3-97), పి.అప్పన్న (19-3-97నుంచి 19-5-97), ఎమ్.గణపతిరావు (20-5-97 నుంచి 30-4-2000) ప్రస్తుతం బి.చిట్టిబాబు డిపోమేనేజరుగా ఉన్నారు. ప్రస్తుతం రాజోలులో ఆర్.టి.సి డిపో అతిపెద్ద వ్యవస్థ అయింది. రాజోలులోని మెయినురోడ్డును కె.ఎన్.ఫ.రోడ్డు అని వ్యవహరిస్తారు. అంటే కత్తిపూడి-నర్సాపురం ఫెర్రి రోడ్డు అని అర్థం. ఈ రోడ్డుకు మద్రాసు-కలకత్తా జాతీయరహదారిపై







గల కత్తిపూడి వద్ద (అన్నవరం ఇవతల) ప్రారంభమై కాకినాడ, కోటిపల్లి, ద్రాక్షారామం, ముక్తేశ్వరం, అమలాపురం, బోడసుకుర్రు, పాశర్లపూడి, జగన్నపేట, రాజోలు, శివకోడు, గుడిమెళ్ళంక, మల్కిపురం మీదుగా సఖినేటిపల్లికి చేరుతుంది. ఇది పూర్వం హైవేసుడిపార్టుమెంట్ వారి అధీనంలోను తర్వాత ఆర్.అండ్.బి.వారి అధీనంలోనికి వచ్చింది. రహదారుల శాఖ పరిభాషలో ఈ K.N.F.రోడ్డు. ఎమ్.డి.ఆర్ (మేజర్ డైవర్షన్ రోడ్డు) అంటారు. పూర్వం దీనిని కత్తిపూడి చించినాదరోడ్డు అనేవారు. 1991లో చించినాడ వద్ద వశిష్ట పై బ్రిడ్జి పని ప్రారంభించబడి తయారకు సిద్ధంగా ఉంది. ఇప్పుడు ఈ రోడ్డు కొద్ది మార్పులతో ఎన్.హెచ్.214 గా అమలాపురం పార్లమెంట్ సభ్యులు, లోకసభస్పీకరు శ్రీ గౌరవనీయులు గంటిమోహనచంద్ర బాలయోగి గారు సాధించి ఆమోదింపచేశారు. దీనితో ఈ రహదారికి మంచి భవిష్యత్ ఉన్నది.ఈ రాజోలులో పూర్వం కంకరరోడ్డుగానే ఉండేది. 1953లో వరదలు వచ్చినప్పుడు అప్పటి గవర్నర్ సి.యమ్.త్రివేది ఈ ప్రాంతపర్యటన చేసిన సందర్భంలో ఈ రోడ్డు మొదటిసారి తారురోడ్డుగా మారింది. ప్రస్తుతం ప్రపంచబ్యాంకు నిధులతో విస్తరణ చేపట్టబడింది.

**సరకుల రవాణా** నేరుగా రోడ్డు సౌకర్యాలు లేకపోవడంతో పూర్వం సరకులన్నీ కాల్వలపైన, నదులపైన, పడవలలో రవాణాజరిగేవి. అట్లే రాజోలు ప్రాంతంలో కొబ్బరి, ధాన్యం వగైరా ఎగుమతి చేయాలంటే ఇటు రాజమండ్రి అటు పాలకొల్లు కాల్వలలో రహదారి పడవలపై వెళ్ళేవి. అట్లే రాజోలుకు రావల్సిన సరుకులు కూడా పడవల్లో వచ్చేవి. ఇక్కడకి పాలకొల్లు, రాజమండ్రి వ్యాపారకేంద్రాలుగా ఉండేవి. ప్రస్తుతం టాక్సీస్టాండ్‌వద్ద (పాతబస్టాండ్‌వద్ద) కాల్వలో పడవలపై ఎగుమతి, దిగుమతులు జరిగేవి. ప్రైవేటుగా ఈ రవాణా జరిగేవి. ఆ తర్వాత 1928లో నిడదవోలు రైలుమార్గం ఏర్పడటంతో సరుకు రవాణా కూడా రైళ్ల ద్వారా నరసాపురం, పాలకొల్లు చేరడం ప్రారంభమయింది. అయితే రాజోలులో రైలు సౌకర్యంలేనందున రాజోలులో ఒక ఔట్ ఏజన్సీ ఏర్పడింది. మొదటిగా ఈ ఆఫీసు సంతమార్కెట్ ప్రక్కనగల కాల్వగట్టుపైగల బిల్డింగ్‌లో ప్రారంభింపబడి పూర్తిగా అక్కడే కొనసాగింది.

1931 నుండి 1933 వరకు అంబర్ ఖానా వెంకట్రావ్ గారు ఔట్ ఏజన్సీ గుమస్తాగా పనిచేసేరు. అప్పట్లో రైళ్ళనుప్రైవేటు కంపెనీలు నడిపేవి. దక్షిణభారతదేశంలోని రైళ్ళను ఎం.ఎస్.ఎమ్ (మద్రాస్ సదరన్ మరాఠా) రైల్వేకంపెనీ నడిపేవారు. 1956 సం॥లో రైళ్లు జాతీయంచేయబడేదాకా ఈ కంపెనీ వారి ఔట్‌ఏజన్సీ రాజోలులో నడిచేది. అప్పట్లో పబ్లిక్ పరీక్షలో ఢింకీలుకొట్టి సప్లిమెంటరీ పరీక్షలకు వెళ్ళేవారివి ఎం.ఎస్.యమ్. రైలు ఎక్కేవా,

అని వేలాకోళంచేసేవారు. (మార్చి-సెప్టెంబర్-మార్చి). జాతీయం చేసేక సదరన్‌రైల్వే ఔట్‌ఏజన్సీగాను తరువాత సౌత్‌సెంట్రల్ రైల్వే ఔట్‌ఏజన్సీగా మారింది. ఇది వరలో రైల్వేవారే నడిపే ఈ ఏజన్సీని తరువాత ప్రైవేట్ ఏజన్సీగా కమీషన్ పద్ధతిగా నియిమించారు. కొన్నాళ్ళు బిక్కిన రామంగారి ఇంట్లో వారి ఏజన్సీగా ఉండేది. తరువాత నేరుగా మోటారుట్రాన్స్‌పోర్ట్, లారీట్రాన్స్‌పోర్ట్ రావడంతో ఈ ఏజన్సీ రద్దు అయింది.1960 దశకంలో భారతమోటార్‌పార్శిల్ సర్వీసు, 1969 ఎస్.ఆర్.ఎమ్.టి.పార్శిలు సర్వీసు వచ్చాయి. తరువాత ఎస్.ఆర్.ఎమ్.టి. బ్రాంచి రద్దుఅయింది. తరువాత నవత, క్రాంతి ట్రాన్స్‌పోర్ట్ కంపెనీలు వచ్చాయి. 1976 తర్వాత కోనసీమలో మొదటిసారిగా ఆర్టీసి. పెద్దవాహనాలు రావడంతో భారీ వాహనాలను అనుమతించారు. అప్పటి నుంచి రాజోలులో కూడా లారీలు ప్రారంభమయ్యాయి. ఓ.ఎన్.జి.సి. వారి భారీవాహనాలు కూడా వారి బరువైన సామాగ్రి తేవడం 1976 నుంచి ప్రారంభంఅయింది. రాజోలులో లారీ సప్లయి ఆఫీసులు కూడా ఏర్పడ్డాయి.

ఇక చిన్నకార్లు 1930 ప్రాంతంనుంచి రాజోలులో టాక్సీలుగా నడిచేవి. గుడ్డటాపు కార్లు ఉండేవి. వీటిని టూరర్లు అనేవారు. కీర్తిశేషులు భారం సత్యనారాయణ గారు టాక్సీలు మెయిన్‌టైన్ చేసేవారు. ఆ తర్వాత 1948 ప్రాంతాలలో ఎరకయ్య గారు వ్యాన్‌లు కూడా అద్దెకు తిప్పేవారు. ఆ తర్వాత రాజా సుబ్బారావు గారు ఇంకా ఇతరులు టాక్సీలు అద్దెకు మేయింటైన్ చేసేవారు. చివరకు చెవర్లెట్ మరియు ఫోర్డ్ పెద్దకార్లు టాక్సీలుగా నడిపేవారు. మొన్నమొన్నటిదాక అంటే ఇరవైసంవత్సరాల క్రితంవరకు రాజోలు లో మాత్రమే టాక్సీలు ఉండేవి. 1960 తర్వాత అంబాసిడర్ కార్లు టాక్సీలుగా వచ్చాయి. ఆతర్వాత మెటాడోర్లు, ఆటోరిక్షాలు వచ్చాయి. రాజోలుకు మొదటిసారిగా భారం కృష్ణమూర్తి గారు 1959 లో సైకిల్ రిక్షా తెచ్చారు. ఆతర్వాత క్రమేణా సైకిల్ రిక్షాల సంఖ్య పెరిగింది.

పూర్వకాలంలో అంటే సుమారు 1935-40 ప్రాంతంకే డా॥ ఆమంచిరామారావు గారు, డా॥ భారతనరసింహరావు గారు, డా॥ కె.టి. రాజారావు గారు చిన్నకార్లు మెయిన్‌టెన్స్ చేసేవారు. 1970 తర్వాత విపరీతం గా మోటారు సైకిళ్ళు స్కూటర్లు పెరిగిపోయాయి. రాష్ట్రంలో మిగతా ప్రాంతాలతో పోలిస్తే రాజోలుతాలూకాలో ఎక్కువసంఖ్యలో స్కూటర్లు ఉన్నాయని చెబుతారు.

రాజోలులో 1990లో సహాయమోటారు తనిఖీ (బ్రేక్‌ఇన్స్‌పెక్టర్ కార్యాలయం) ఏర్పడింది. 1997లో రావులపాలెం తరలించారు. రాజోలులో మోటారు పర్మిట్లు డ్రైవింగ్





లైసెన్స్ లు వగైరా వ్యవహారాలను పూర్వం నుంచి మంగిపూడిసుబ్బారావు గారు చూసేవారు. ప్రస్తుతం వారి కుమారుడు శివాజి వీటిని చూస్తున్నారు. మొదట్లో రోడ్స్ హైవేస్ వారి మేనేజిమెంటులో ఉన్నప్పుడు రాజోలులో హైవేస్ సూపర్‌వైజర్, ఇంజినీరింగ్ డిగ్రీవారయితే జూనియర్ ఇంజనీర్లు పనిచేసేవారు. భవనాలు పి.డబ్ల్యు.నుంచి విడిపోయి రోడ్లు భవనాలశాల శాఖ ఏర్పడిన తరువాత క్రమేణ రోడ్లకు ఒకరు, భవనాలకు ఒకరు, వేర్వేరుగా అదిషినల్ అసిస్టెంట్ ఇంజనీర్లు వచ్చారు. రాజోలును 1986 ప్రాంతంలో సబ్‌డివిజన్ చేసినప్పుడు రాజోలులో డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసు నెలకొల్పారు. తరువాత జగన్నపేట, మలికిపురం లలో వేరే సెక్షన్‌లు ఏర్పడ్డాయి.

1980లో అప్పటి తహశీల్దారు శ్రీ ఆకెళ్ల సూర్యప్రకాశరావు గారి చొరవతో రాజోలుకు ఈశాన్యంవైపు పుంతకు చేరి శ్రీ ఆరుమిల్లి మారెయ్య గారి తాలూకు ఎకరంభూమి సేకరించి అందులో కోనసీమలోనే మొదటిగా విశ్రాంతి భవనాన్ని (ఆర్.అండ్.బి. ఇన్స్‌పెక్షన్ బంగళా) నిర్మించారు. ది.16-3-1986 తేదిని ఈ భవనం అప్పటి రోడ్లభవనాలశాకామంత్రి జానారెడ్డి గారిచే ప్రారంభింపబడింది. రెండు సూట్లతో మొదటిసారిగా ఆధునిక విశ్రాంతి భవనం ఈ ప్రాంతంలో ఏర్పడింది. ప్రస్తుతం ఆ ఆవరణలో డి.ఇ.ఇ.కార్యాలయము ఏ.ఏ.ఇ. కార్యాలయం నడుస్తున్నాయి. ప్రస్తుతం పి.రామయ్యనాయుడు గారు డి.ఇ.ఇ.గా పనిచేస్తున్నారు.

చాలాకాలం నుండి రాజోలులో ఆర్.అండ్.బి. లో పనిచేస్తున్న శ్రీ మోసుగంటి రాజబాబు ముత్తాత కాటన్‌దొర వద్ద పనిచేసారని చెబుతారు. అందుకే రాజబాబు కాటన్ పై ఎంతో భక్తివిశ్వాసాలతో అన్నదాతగా బుర్రకథలు, పాటలు పాడుతూ ఉంటాడు. పి.డబ్ల్యు.డి. ఆఫీసువద్ద పొన్నాడ హనుమంతురావు గారి పేర పర్మిషన్ పొంది కాటన్ గారి బస్ట్ విగ్రహాన్ని 1995లో నెలకొల్పి ప్రతి సంవత్సరం మే 15న కాటన్ జయంతి జూలైలో వర్ధంతి ఎంతో భక్తి శ్రద్ధలతో జరుపుతూ అన్నదానం చేస్తాడు. రైతులకెవరికీ లేని శ్రద్ధ ఆయనకు ఉండటం హర్షదాయకం.

# 5. విద్యారంగం

పూర్వం ప్రాథమిక పాఠశాలలో ఒకటి,రెండు,మూడు తరగతులు ఆపైన 4,5 తరగతులు, 1st, 2nd& 3rd ఫారంవరకు లోయర్ సెకండ్రీ స్కూలుగా ఉండేవి. అయితే రాజోలులో 20శతాబ్దపు మొదట్లో ప్రాథమిక పాఠశాలలు మాత్రము ఉండేవి. లోయర్ సెకండరీ స్కూల్ మాత్రము 19వ శతాబ్దం చివర నుండి ప్రక్కనే ఉన్న శివకోడు గ్రామములో ఉండేది. 18-11-1898న శివకోడులో క్రొత్తస్కూల్ భవనం ప్రారంభింపబడింది. దానికి ఒక ఫంక్షన్ జరిగింది.

రాజోలు ప్రాథమిక పాఠశాలలో 1903 అక్టోబర్‌లో అయ్యగారి సోమయ్య, ఆతరువాత జనవరి 1904లో ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రి ఉపాధ్యాయులుగా పనిచేశారు. ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు నవంబరునెల 1904 నాటికి హెడ్‌మాష్టార్ అయ్యారు. ఆ తరువాత1908 ప్రాంతంలో గొనెళ్ళ నరసింహంగారు హెడ్‌మాస్టార్ గా పనిచేశారు ఆయనతో కురుముద్దాల గోపాలకృష్ణమూర్తిగారు,వెంకన్నమాష్టార్లు గారు వగైరాలు మాష్టార్లుగా పనిచేశారు. అలాగే శివకోడు లోయర్ సెకండరీ స్కూల్‌లో 1911 నుండి 1916 వరకు గండికోట వెంకటచలపతిరావు గారు హెడ్‌మాష్టార్ గాను, మల్లుభొట్ల పురుషోత్తంగారు, కామయ్యగారు,దైవాధీనం గారు, దువ్వూరుజగన్నాథంగారు, నేదునూరి అనంతరావు గారు, వారణాసి వెంకటరామయ్యశర్మగారు వగైరాలు ఉపాధ్యాయులుగా పనిచేశారు. అప్పట్లో పార్థరాఘవేంద్రరావు గారని స్కూళ్ళఇన్‌స్పెక్టర్‌గా ఉండేవారు. అమలాపురం హైస్కూల్ హెడ్ మాష్టార్ అయ్యర్ గారు కూడా సూపర్‌వైజింగ్ కు వచ్చేవారు. 1933నుండి 1935 వరకు సర్వభద్రంగారు డిప్యూటి ఇన్‌స్పెక్టర్ ఆఫ్‌స్కూల్స్ గా పనిచేశారు. ఈయన సాలూరు బదిలీ అయిన సందర్భంలో 5-9-1935న వీడ్కోలు పార్టీ జరిగింది.

1916 సం॥లో శివకోడులో గల లోయర్ సెకండరీస్కూల్ రాజోలు తరలించబడి హైస్కూల్ గా మారింది. అప్పటి వరకు శివకోడులో హెడ్‌మాష్టారుగా ఉన్న గండికోట వెంకటచలపతి రావు గారు రాజోలు బోర్డు హైస్కూలు మొదటి హెడ్ మాష్టార్ (1916-1920) ఈ స్కూల్ ఎక్కడ ఉండేదో తెలియదు కాని మొదట్లో తాటిఆకుల పాకల్లో ఉండేది. ఈ పాకలు ఎవరో తగులబెట్టారు. తరువాత ప్రస్తుతం బాలికల హైస్కూలు గల పెద్దలోకి మారింది. గండికోటచలపతిరావుగారి తర్వాత 1-11-1920 నుంచి చాలా కాలం అంటే 5-7-1936 వరకు అప్పాద్వేదుల శీతారామయ్యగారు హెడ్‌మాష్టార్ గా పనిచేశారు (ఈయన సోదరుడు ఏ.ఎల్. నారాయణ, ఆంధ్రయూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్‌గా పనిచేశారు). ఆ తర్వాత గార్లంక వీరవెంకట సత్యనారాయణగారు కొద్దికాలం





8-7-1936 నుండి 30-11-1941 వరకు పనిచేసి తిరిగి 1-8-1948నుండి 30-6-1950 వరకు హెడ్‌మాష్టార్ గా పనిచేశారు. కొటపాలయ్యగారు 1-12-1938 నుండి 31-7-1939 వరకు, టి.వి. శేషగిరిరావు గారు 1-8-1939నుండి 31-12-40 తిరిగి 1-1-1941 నుండి 31-7-1941 వరకు తిరిగి 24-1-1944 నుండి 30-9-45 హెడ్‌మాష్టార్ గా ఉన్నారు. పులవర్తి సోమన్న గారు 1-8-1941నుండి 31-10-1943 వరకు, శ్రీ సుబ్బారావు గారు 1-11-1943 నుండి 23-1-1944, ఏ.సత్యనారాయణ గారు 1-1-1945నుండి 31-8-1946 వరకు, ముత్యాలసుబ్బారాయుడుగారు 1-9-1946నుండి 31-7-1948 వరకు హెడ్‌మాష్టార్లుగా పనిచేశారు. ఈ పెద్ద ఆఫీసు మరియు లేబరేటరీలకు సరిపోకపోవడంతో కొంతకాలం కాల్వ పెద్దవంతెన వద్దగల నున్న వారి కొట్లలోను, హైస్కూలు ప్రక్కన ఒక బిల్డింగ్‌ను అద్దెకు తీసుకొనినడిపేరు.

1948నుండి ప్రస్తుతం ఆంధ్రబ్యాంక్ వద్దగల రాజుగారు మేడ, ప్రక్కనగల మొగల్లవారి భవనం మొత్తం ఎదరఖాళీస్థలం అద్దెకు తీసుకొని ఆఫీసు, లేబరేటరీ మరియు అన్ని క్లాసులలోని ఆడపిల్లలు గల 'ఎ' సెక్షన్లు అక్కడ నడిపేవారు. 1961 వరకు చింతలపల్లి అల్లూరిసూర్యనారాయణరాజుగారి(పెదరాజుగారు) ఈ భవనంలో అద్దెకు నడిపారు. 1950 వరకు ఈ హైస్కూల్ ఎక్కువ సంఖ్య విద్యార్థులతో నడిచేది. సఖినేటిపల్లి, పొన్నమండ, నగరం, గన్నవరం ప్రాంతాలనుండి హైస్కూల్కు ఇక్కడికే రావాలి. సైకిళ్ళమీద, నడిచి వచ్చేవారు. హరిజన విద్యార్థులకు గొల్లచంద్రయ్య గారి హాస్టల్ ఉండేది. అంతే గాక పశ్చిమగోదావరి జిల్లాలో అబ్బిరాజుపాలెం, దొడ్డిపట్ల, మట్లపాలెం వగైరా గ్రామాలునుండి కూడా వరదలలోను, వర్షాలలోను కూడా రెండేసి రేవులు దాటి నడుస్తూ వచ్చి మధ్యాహ్నం ఇక్కడ ఎవరి ఇండ్లలోనో వారాలు చెప్పుకొని భోజనం చేసి సాయంకాలానికి ఇండ్లకు చేరేవారు. ఇంచుమించి 1960 వరకు వారు ఇటు వైపు వచ్చి చదువుకొనేవారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి వి.కె.రావ్ కేంద్రమంత్రి చేసిన బోళ్ళబుల్లిరామయ్య, ప్రముఖనేపథ్యగాయకుడు పి.బి.శ్రీనివాస్ మొదలైనవారు ఈ హైస్కూల్‌కు పాత విద్యార్థులే. అంతేగాక ఆంధ్రప్రదేశ్ అడిషినల్ అదనపు డైరెక్టర్, వైద్యఆరోగ్యశాఖగా పనిచేసిన డా॥ వి.చిట్టిశేషు, 1950కి ముందే ఈ హైస్కూలు విద్యార్థులే ఇంకా ఎంతోమంది న్యాయవాదులుగా, డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, సైంటిస్టులుగా,రాజకీయనాయకులుగా, కళాకారులుగా రాణించారు. 1960 వరకు ఈ హైస్కూల్ అక్కడ ఉన్నంతవరకు ఇంకా కె.కృష్ణమూర్తి,నున్నరమణారావు, భారం పురుషోత్తంనాయుడు వగైరాలు ఆరోజులలోనే విదేశాలకు వెళ్ళేరు కూడా. ఈ స్కూల్ విద్యార్థులు ఇంకా వి.బాపేశ్వరరావు, వలవల సుబ్బారావు, డి. రంగారావు గార్లు ఈ

స్కూల్ లో చదివి ఐ.ఐ.టి. ప్రొఫెసర్ల్ గా పనిచేశారు. ఇంకా తెలియని ఎందరో ఉన్నారు. ఈ స్కూలు జిల్లా బోర్డు లోకల్‌ఫండ్ స్థలంలోనే నడిచింది. చాలా చిన్న స్థలం నూతనభవనాలకు అవకాశంలేదు. కొబట్టి 1950 నుండి ఈ హైస్కూలుకు స్థలం సేకరించదానికి డా॥ ఆమంచి రామారావు గారు (డా॥ అప్పారావుగారు తండ్రి) ఆధ్వర్యంలో ఒక హైస్కూల్ కమిటీ ఏర్పడి ఆరోజులలో సుమారు 30వేలు విరాళాలు సేకరించి ప్రస్తుతం జడ్.పి. బాలుర పాఠశాల ఉన్న స్థలాన్ని సేకరించింది. స్థలాన్ని పొన్నాడ శంకరనారాయణ వగైరాల వల్ల క్రియమునకు పొందారు. అయితే ఈ స్థలం కొంత సోంపల్లి లోను కొంత రాజోలులోను ఉన్నది. మధ్యలో ప్రభుత్వం వారి పుంత కూడా ఉన్నది. ఆ పుంతను కూడా హైస్కూల్‌కు ఇచ్చివేయుటకు ప్రభుత్వం అంగీకరించింది. చివరకు 1953లో స్థలసేకరణ పూర్తయింది. ఆ సందర్భంలో ఆస్థలంలో కమిటీవారు, అధికారులు,హైస్కూలుప్రధాన ఉపాధ్యాయులు, ఉపాధ్యాయులు, విద్యార్థులతో ఒక పెద్ద సమావేశం జరిగింది. సభలో వక్తలు ప్రభుత్వం వారి పుంతను కూడా ఇచ్చినందుకు అప్పటి ముస్లిం తహశీల్దార్ జనాబ్ మహ్మద్ ఎ.బి.ఖాన్‌ను అభినందించారు. ఆయన సమాదానం ఇస్తూ మేము చేసింది ఏముంది ఏదో ఉడతాభక్తిగా చేశాం అని రామాయణ అంశాన్ని తనముస్లిం యాసలో చెప్పేసరికి సమావేశమంతా నవ్వుల జల్లులతోను ఆనందం తో నిండిపోయింది.

ఆతర్వాత 1959లో జిల్లాపరిషత్ ఏర్పడి ఆస్థలంలో ప్రస్తుతపు పెంకుటిభవనాలు అప్పటి రాజోలుపంచాయితి సమితి అధ్యక్షులు మంగెన గోపాలం గారి కృషితో ఏర్పడ్డాయి. అప్పటి జిల్లాపరిషత్ అధ్యక్షులు తోట రామస్వామిగారు వీటిని 1961 లో ప్రారంభించారు. తూర్పువైపుభవనాలను హయ్యర్‌సెకండరీ (సెవన్త్ ఫామ్) కొరకు నిర్మించి 1964లో శ్రీ రామస్వామి గారిచే ప్రారంభింపబడ్డాయి. అక్కడే 1983 సం॥ బాలుర హాస్టల్ నిర్మింపబడి అప్పటి సాంఘీక సంక్షేమమంత్రి శ్రీమతి ప్రతిభా భారతి చే ప్రారంభింపబడింది. ఆ తర్వాత అదే స్థలంలో వాయవ్యం మూల జిల్లా పరిషత్ సబ్‌డివిజన్ ఇంజినీరు ఆఫీసు, గొడౌను వగైరాలు నిర్మింపబడ్డాయి. ఈ భవనాలలోకి తరలించేవరకు కందుకూరి రామభద్రరావు గారు 1-7-1950నుంచి 4-8-1952వరకు,యజ్ఞమిల్లి అగస్త్యరాజుగారు 5-8-1952 నుండి 31-7-1958 వరుకు, ఇరుకు సత్యనారాయణగారు 1-8-1958 నుండి 3-6-1960 వరకు, పొత్తుని లక్ష్మణరావు గారు 1-7-1960 నుండి 31-7-1960 వరకు హెడ్‌మాష్టర్లగా పనిచేశారు. ఈ కాలంలోనే అంతకుముందు కూడా శ్రీ మీనవల్లి సత్యనారాయణ గారు, వెంపటి రామశాస్త్రి గారు, రామశర్మగారు, ఇంగువ వెంకటేశ్వరరావుగారు, పుట్టపర్తి మారెయ్యగారు, నల్లి వెంకటపతిగారు, బచ్చు





సుబ్బారావుగారు, కదలి దుర్గాదాస్‌గారు, శ్రీమతి గొల్లసత్యవతిగారు, బూసిం నాగమల్లయ్యగారు వగైరాలు, ఇంకా మైలవరపు శ్రీరామచంద్రంమూర్తిగారు (ఈయన్ను డబ్ బి.ఏ గారు అనేవారు) కస్తూరి శ్యామలరావుగారు, బండారు సత్యనారయణరావు గారు, పేరి సత్యనారాయణగారు, డబ్ల్యు.రామూర్తి గారు, ముక్తేశ్వరరావుగారు మొదలైన వారు ప్యాపులర్ ఉపాధ్యాయులు అట్లే వద్దమాని వెంకటశాస్త్రిగారు, చైనులు గారు, కందుకూరి భాస్కరశాస్త్రి గారు తెలుగుపండితులు గాను, మోదేకుర్రు శివరావు, మంచిగంటి చిదంబరం వగైరాలు హింద్ పండితులు గాను, కాశిభట్ల హనుమంతురావు (స్వాతంత్రసమరయోధులు), డ్రాయింగ్ టీచర్ గాను, మొక్కపాటి శ్రీరామమూర్తి, బడాసాహెబ్, ఆరుమిల్లి రామారావు వగైరాలు డ్రిల్ల్ టీచర్లగా పనిచేశారు. బెజవాడ భూషణం గారు,డేనియల్ గారు వగైరాలు ఆఫీసులోను శంకరంగారు ల్యాబ్‌అటెండర్ గాను, ముత్యాల వీరస్వామి, సూరన్న వగైరాలు జవాన్‌లుగా పనిచేశారు. 1947 సం॥ నుండి 1960దాటిన తర్వాత కూడా పనిచేసిన శ్రీమీనవల్లి సత్యంమాషారు ఇంగ్లీషు గ్రామర్ చెప్పడంలో ఆయనకు ఆయనే సాటి. హైస్కూలులో ఆ రోజులలోనే అన్ని విషయాలలో ప్రముఖపాత్ర వహిస్తూ పౌరశిక్షణ మాక్‌పార్లమెంటు నిర్వహించడం క్రమశిక్షణనేర్పడం వంటివి ఎన్నోచేశేవారు. వారు తన తొంబైవ ఏట ఇప్పుడు రాజమండ్రిలో తన కుమారుని వద్ద ఉన్నారు. ఆయన శిష్యులంతా ఆయనను రాజోలు రప్పించి 1987 సెప్టెంబర్ 5వ తేదిన ఉపాధ్యాయదినోత్సవ సందర్భంగా అదే ఆవరణలో ఘనంగా సత్కరించారు.

ఈ హైసస్కూల్‌లోనే ఎన్నో సారస్వత కార్యక్రమాలు ఆరోజుల్లో కూడా నిర్వహింపబడేవి. 6-5-1945 న జరిగిన ఉత్సవానికి మల్లాది సూర్యనారాయణశాస్త్రి, వేదాంతం శేషయ్య ప్రముఖ పండితులు జటావల్లభుల పురుషోత్తం గార్లు ప్రసంగించారు అట్లే 1953 లో పాలగుమ్మి పద్మరాజు (పాప) కూడా హైస్కూల్ కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రతి సంవత్సరం హైస్కూల్ ఉపాధ్యాయులు వనభోజనాలు ఏర్పాటు చేసుకొనేవారు. అటువంటి ఒక కార్యక్రమము 29-11-1942 న జరిగింది. ది.11-7-1940 ని అప్పటి బోర్డు ప్రసిడెంట్ మల్లిపూడి పల్లంరాజుగారు హైస్కూలు సందర్శించారు. డా॥ ఆమంచి రామారావు గారు, పొన్నాడ శ్రీరామవెంకటసూర్యారావు గారు వారితో హైస్కూల్ విషయాన్ని చర్చించారు.

హైస్కూలు నూతనభవనాన్కి మారాక అల్లూరి గోపరాజు గారు (1-8-1961 నుంచి 9-12-69), వోలేటి సూర్యనారాయణ గారు (10-12-69 నుంచి 30-4-72), కె.వి.రాఘవయ్యనాయుడు గారు (1-5-1972 నుంచి 1-6-72 ), భమిడిపాటి కృష్ణమూర్తి

(2-6-72 నుంచి 1-7-76). జొన్నలగడ్డ సుబ్బారావు గారు (2-7-76 నుంచి30-11-86), మంత్రిప్రగడ వెంకటసుబ్బారావుగారు (1-12-86 నుంచి 8-2-87 ). డి.శ్రీరామచంద్రమూర్తి గారు (9-2-87 నుంచి 31-5-91). యం. సత్యనారాయణ (1-6-91 నుంచి 18-8-91 ). సి.హెచ్. శ్రీరామచంద్రమూర్తి (19-8-91 నుంచి 31-5-96). సి.హెచ్.నరసింహరాజు (1-6-96 నుంచి 23-7-96 ) హెడ్‌మాష్టర్లుగా పనిచేశారు. వీరిలో జొన్నలగడ్డ సుబ్బారావు గారు రాజోలు లో పనిచేస్తూ ఉండగానే రాష్ట్ర మరియు జాతీయ ఉత్తమ ఉపాధ్యాయఅవార్డు పొందారు. అలై యం.వి.సుబ్బారావు గారు ఇక్కడ ఉండగా రాష్ట్రీయ ఉత్తమ ఉపాధ్యాయునిగాను ఆ తర్వాత గంధేపల్లి లో పనిచేస్తూ ఉండగా 1998లో జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ బహుమతులు పొందారు. ఈయన రాజోలులో ఉండగా అనేక కార్యక్రమాలు నిర్వహించారు. జాతీయ మరియు తెలుగునాయకుల,వీరుల చిత్రాలను అప్పటి డ్రాయింగ్ టీచర్ శ్రీ అన్నంరాజు గారి చేత చిత్రింపచేసి విద్యార్థులకు ఆ నాయకుల స్ఫూర్తి కలిగించే ప్రయత్నం చేశారు. 24-7-1996నుంచి సహస్రాబ్ది చివరి వరకు శ్రీమతిమామిడిశెట్టి సత్యనారాయణమ్మగారు ఈ హైస్కూలు మొదటి మహిళ ప్రధానోపాధ్యాయునిగా పనిచేసి ఇంకా కొనసాగుతున్నారు.

1961 సం॥లో హైస్కూలు నూతన భవనాలకు మారిన తర్వాత పాతభవనాలలో బాలికలకు ప్రత్యేకంగా బాలికల హైస్కూలు ఏర్పడింది. 1959 లో జిల్లా పరిషత్ ఛైర్మన్ తోటరామస్వామి గారిచే ప్రారంభించబడింది. అప్పటి నుంచి ఈ హైస్కూలుకు 1). శ్రీమతి ఏ.శకుంతలాదేవి (30-7-65 నుంచి 11-7-66), 2).కుమారి జి.వి.రంగనాయకి (12-7-66 నుంచి 22-7-67), 3). శ్రీ బి.హెచ్. కృష్ణమూర్తి (23-7-67 నుంచి 1-5-68), 4). కుమారి జి.ఎస్. పద్మావతి (2-5-68 నుంచి 23-7-72), 5). శ్రీమతి ఎస్.కనకలత (24-7-72 నుంచి 2-9-74), 6). శ్రీ కె.సోమశంకరం (3-9-74 నుంచి 1-1-75), 7). శ్రీమతి అన్నపూర్ణ (2-1-75 నుంచి 31-1-75), 8). శ్రీ టి. సత్యనారాయణ (1-2-75 నుంచి 28-10-75), 9).శ్రీ యం. అయ్యప్పరాజు (29-10-75 నుంచి 4-12-75) 10).శ్రీ యస్.బి.బి.ఎల్.ఎన్. ఆచార్యులు (5-12-75 నుంచి 24-6-76). 11). శ్రీమతి ఆర్.సి. ఎలిజబెత్ (26-6-76 నుంచి 14-6-82). 12). శ్రీ ఆర్.వి. సత్యనారాయణ (15-6-82 నుంచి 1-1-83) 13). శ్రీ కె.వెంకటశాస్త్రి (2-1-83 నుంచి13-8-84), 14). కుమారి సుశీల మేరీబాయి (14-8-84 నుంచి 3-8-85), 15). శ్రీమతి యం.సత్యనారాయణమ్మ (4-8-85 నుంచి 9-8-90), 16). శ్రీ వై.వి. సుబ్బారావు (10-8-90 నుంచి 29-8-90). 17). శ్రీమతి టి.భాస్కరమ్మ (30-8-90 నుంచి 30-9-94). 18).ప్రస్తుతం శ్రీపి.కృష్ణశాస్త్రి (18-10-94)





హెడ్‌మాష్టర్సుగా, హెడ్‌మిస్ట్రెస్‌లు గా పనిచేశారు. శ్రీ పారుపూడి కృష్ణశాస్త్రి గారు హెడ్‌మాష్టర్ గాను సహస్రాబ్దివరకు పనిచేస్తూ ఇప్పటికి కొనసాగుతున్నారు. ఈయనకు 1999లో జిల్లా ఉత్తమ ఉపాధ్యాయఅవార్డు అందుకొన్నారు. వీరు హైస్కూల్లో పురజనులను ఆహ్వానించి అనేక కార్యక్రమాలు ఏర్పాటు చేస్తూ ఉంటారు.

పూర్వం బాలికలకు ప్రత్యేకంగా శ్రీమతి కమలమ్మగారు సాంఘికసంక్షేమహాస్టళ్ళు నడిపేవారు. ఈమె కుమార్తె శాంతిప్రియ టీచరు. రాజోలు బాలికల హైస్కూల్లో టీచరుగా పనిచేసి ప్రస్తుతం చింతలపల్లి హైస్కూలు హెడ్‌మిస్ట్రెస్ గా పనిచేస్తున్నారు. ప్రస్తుతం బాలికల హాస్టలు ప్రైవేట్ భవనంలో ప్రభుత్వంవారి ఆదీనంలో నడుస్తుంది. వెనుకబడిన తరగతుల విద్యార్థులకు గెద్దాడ వెంకన్న గారు సాంఘిక సంక్షేమహాస్టలు నడిపేవారు. ఇక ప్రాథమిక విద్యకు వస్తే ఒకటి ఎలిమెంటరీస్కూలు (బోర్డువారిది) ఉండేది. ఆ తర్వాత బాలికలకు ప్రత్యేకంగా ఒకటి, కోపరేటివ్‌స్కూల్, ఆర్.టి.సి. వద్ద ఒకటి. చెల్లింగవారిగూడెం వద్ద ఒకటి, పల్లిపాలెంలోను స్కూళ్ళు ఏర్పడ్డాయి. ఇవి సమితి ఆ తర్వాత మండలపరిషత్ ఆధీనంలోనికి వచ్చాయి. సమితి ఆధీనంలోకి వచ్చాక దొరగారి తోటలో 1970లో ఒక స్కూలుకు, పంచాయితీ ఆఫీసు వద్ద శివాలయం స్థలంలో కోపరేటివ్ (ప్రత్యేక ఎలిమెంటరీ) స్కూలు శాశ్వత భవనాలు ఏర్పడ్డాయి. అలాగే 1985-86లో పల్లిపాలెం, చెల్లింగవారి స్కూల్స్ శాశ్వత భవనాలు ఏర్పడ్డాయి. ఇదిగాక ఒక ఉర్దూస్కూలు కూడా నడిచేది. దీనిని తర్వాత మరియొకస్కూల్లో కలిపివేశారు. 1998లో రాజోలు మధ్యలంకలో కూడా ఒక ప్రాథమికపాఠశాల ఏర్పడింది. రాజోలు ఎలిమెంటరీ స్కూల్‌లో పూర్వం పనిచేసిన ఉపాధ్యాయులు దుర్గా శంకరంగారు. కళానిధి సంజీవరావుగారు. వీరరాజు మాష్టారు, రావి సూరయ్యమాష్టారు. చిరంజీవి మాష్టారు. పుల్లయ్యమాష్టారు. అనిసెట్టి కృష్ణమూర్తి గారు, రాపాక ఆదినారాయణ గారు. శ్రీ చిత్రపు సుబ్రహ్మణ్యంగారు వగైరాలు పేరు మోసిన ఉపాధ్యాయులు. వీరిలో అనిశెట్టి కృష్ణమూర్తి గారు కళారంగానికి ఎంతో సేవ చేశారు. మంచి మేకప్ ఆర్టిస్ట్ కావడమే కాకుండా నటనా కౌశల్యము ఉండేది. స్కూల్ పిల్లలచే మంచి సాంస్కృతిక కార్యక్రమాలు తయారుచేయించేవారు. ఈయన సినిమాలలో చిన్నచిన్న పాత్రలుకూడా వేసారు. సాహిత్య, ఆధ్యాత్మిక రంగాలలో కూడా ఎంతో కృషిచేస్తూ కొలది సం॥ల క్రితమే స్వర్గస్తులు అయ్యారు. ఇక రాపాక ఆదినారాయణ గారు మంచి గాయకులు. ఈయన, కృష్ణమూర్తి గారు చిత్రపు సుబ్రహ్మణ్యం గార్లతో ఒక బుర్రకథ దళంగా ఏర్పడి కార్యక్రమాలు ఇస్తూ రేడియోగాయకులుగా ప్రసిద్ధిచెందారు. శ్రీ రాపాక ఆదినారాయణ గారు "మాతెలుగుతల్లికి" మల్లెపూదండ పాటపాడితే కంచుమ్రోగినట్లు ఉండేది. ఈయన కూడా కొద్ది సంవత్సరాల క్రితం స్వర్గస్తులైనారు.

ఇక గత 20సం॥ల చరిత్ర చూస్తే క్రమేణా ప్రభుత్వ విద్యాసంస్థలు వాటి ప్రాబల్యాన్ని కోల్పోయి కాన్వెంట్ మరియు ప్రవేటు విద్యాసంస్థల జోరు పూర్తిగా పెరిగింది. రాజోలు తాలూకాలోనే మొదటిసారిగా 1970లో డేవిడ్‌రాజ్ అనే ఆయన ప్రైవేటురంగంలో "**రవీంద్రభారతివిద్యానికేతన్**" పేరుతో కాన్వెంట్ విద్యప్రారంభించారు. ఆ సంస్థ ఇప్పుడు ఒక కమిటీ అధీనంలోకి వచ్చి శ్రీ ఇరగవరపుటాపిరాజు గారు కరస్పాండెంట్ గా ఉంటూ మంచి అభివృద్ధిలోకి వచ్చి హైస్కూలు దశకు చేరుకొని గుర్తింపు కూడా పొందింది అట్లే బోడపాటి చిట్టిబాబుచే సరస్వతివిద్యానికేతన్ ఏర్పాటు చేయబడి హైస్కూల్ గా మారింది. ఆ తర్వాత తాటికాయల శ్రీను, రమేష్ వగైరాలచే చిల్డ్రన్స్ కాన్వెంట్ ఏర్పడింది. ప్రక్కనే బి.సావరంలో శోభనాకాన్వెంట్ స్కూల్ ఏర్పడింది. రెండువేలసం॥లో శ్రీ అప్పనధర్మసాయి గారు అన్నపూర్ణపబ్లిక్‌స్కూల్ స్థాపించారు.

రాజోలులో దక్షిణభారత హిందీ ప్రచారసభ నడిచేది. హిందీ పరీక్షలు కూడా జరుగుతాయి. బూడిదసత్యంమాష్టారు ఇప్పటికీ 60 సం॥లునుండి ఎంతోమందికి ప్రైవేట్‌గా హిందీ విద్యాభోధచేసి పరీక్షలుకు పంపుతుంటారు.

**కళాశాలవిద్య** : 1948 సం॥వరకు కూడా కోనసీమవిద్యార్థులు కళాశాల విద్యకోసం రాజమండ్రి, కాకినాడ, విజయవాడ వెళ్ళవల్సివచ్చేది. 1948వ సం॥లో అమలాపురం, నరసాపురం, భీమవరం, ఏలూరులలో కళాశాలలు ఏర్పడ్డాయి. పేదవారు అక్కడికి వెళ్ళి చదువుకోలేక ఆడపిల్లలను అంతదూరం పంపటం పెద్దలకు ఇష్టంలేకపోవడంతో రాజోలు తాలూకాలో చాలామంది హైస్కూలువిద్యతో ఆపేసేవారు. పేదవారు, మహిళలుకోసం రాజోలులో ఒక కళాశాల ఉండటం అవసరమని అందరిలో ఒక భావన చాలా కాలంగా ఉండేది. కాని ఇది కార్యరూపం దాల్చలేదు. 1966 సం॥లో స్వర్గీయ రుద్రరాజురామలింగరాజు గారు (రాజోలుతాలూకా గుడిమూలవాస్తవ్యులు) రెండవసారి స్థానికసంస్థలు నుండి యం.ఎల్.సి (శాసనమండలి సభ్యులు) గా ఎన్నికైయ్యారు. ఆసందర్భంలో రాజోలు బార్ అసోసియేషన్‌లో వారికి సన్మానం జరిగింది. ఆ సందర్భంలో యువన్యాయవాది పొన్నాడ హనుమంతరావు కళాశాల విషయం ప్రస్తావించారు. ఆ తర్వాత ది.23-10-1966 విజయదశమి రోజున శ్రీ పొన్నాడ హనుమంతరావు రాజోలుతాలూకాలోని అన్ని రాజకీయ, మరియు వర్గాల ప్రజల సమావేశాన్ని ఏర్పాటుచేసి తాలూకా అంతా తిరిగి స్వయంగా ఆహ్వానించారు. ఆ విజయదశమి రోజున ఏర్పాటుచేసిన ఆ సమావేశం నూరుశాతం విజయవంతం అయింది. రాజకీయప్రముఖులు, భూస్వాములు, ధనవంతులు, సంఘసంస్కర్తలు, న్యాయవాదులు,





డాక్టర్లుఎంతోమంది సమావేశానికి హాజరైనారు. రుద్రరాజురామలింగరాజు యం.ఎల్.సి గారు, సైనాల గణేశ్వరరావు ఎమ్మెల్యే నగరం, గెడ్డంమహాలక్ష్మి ఎమ్మెల్యే రాజోలు, మంగెన వేణుగోపాలం రాజోలుసమితి అధ్యక్ష్యులు, బోళ్ళసత్యనారాయణగారు గన్నవరం సమితి అధ్యక్ష్యులు స్వాతంత్ర్యసమరయోధులు ఆకులబుల్లిస్వామి గారు, ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు బోడపాటి నరసింహరావు, కనుమూరి రంగరాజు గారు, ఇంకా నగరం జమీందారు, కలబ్ అలీబేగ్‌సాహెబ్ గారు, జాన వీరభద్రరావు గారు, వెంపరాల కామేశ్వరరావు గారు, వాతేపు సుబ్రహ్మణ్యం గారు, జాలెం నరసింహమూర్తి గారు, కె.టి.రాజారావు గారు, టిక్కిన జానకిరామారావు గారు వగైరాలు ఎంతోమంది ప్రముఖులు హాజరై కళాశాల స్థాపనకు పునాది వేశారు. అప్పటికి అప్పుడే ఒక కమిటి ఏర్పడింది. రామలింగరాజుగారు అధ్యక్ష్యులుగా మంగెన సత్యనారాయణమూర్తిగారు కార్యదర్శిగా ఇంకా ఇతరులతో ఒక కమిటీ ఏర్పడింది. 1967లో సాధారణ ఎన్నికలు జరుగుతాయి కాబట్టి, ఆ సం॥లో కళాశాల సాధ్యం కాకపోవచ్చుని, 1968లో ప్రయత్నిద్దాం. 1969లో తప్పక సాధిద్దామని రామలింగరాజు గారు మంచి ఉత్సాహాన్నిచ్చారు. విజయదశమి రోజున ప్రారంభించిన ఏ కార్యక్రమం అయినా విజయవంతం అవుతుందని ఆ సమావేశం ఋజువుపర్చింది. కొద్దిరోజులతర్వాతఈకమిటీ పునరవ్యవస్థీకరించబడింది. శ్రీబోళ్ళ వెంకట సత్యనారాయణమూర్తి అధ్యక్షులుగా వి.వి.ఎస్. కామేశ్వరావు అడ్వొకేట్ గారు కార్యదర్శిగా డా॥ టిక్కిన జానకిరామారావు గారు కోశాధికారిగా ఇంకా ఇతరులు ఆరుగురితో "రాజోలు తాలూకా ఇంప్రూవ్‌మెంట్‌ట్రస్ట్" అని 46/68గా రిజిష్టర్ చేయబడింది. కళాశాల స్థాపనకు విరాళాలు సేకరించడం వగైరా పనులు చేయడానికి నిర్ణయించింది. అయితే రాజోలు పట్టణవాసులలో ఈ కళాశాల రాజోలులో గాక మరియొక చోటకి తరలిస్తారేమోననే అనుమానం కూడా ఉండేది. అందుచేతరిగి పొన్నాడ హనుమంతరావు పట్టణ ప్రముఖులతో వేరే కమిటీ వేయడానికి డా॥టిక్కినజానకిరామారావు గారి ఇంటివద్ద ఒక సమావేశం ఏర్పాటు చేశారు. కళాశాలకు అవసరమైన స్థలాన్ని రాజోలు ప్రజలు స్వయంగా సేకరించి ఇస్తే బాగుంటుందని నిర్ణయించారు. అందు పై డా॥ టిక్కిన జానకిరామారావు గారు అధ్యక్షులుగా పొన్నాడ హనమంతరావు గారు కార్యదర్శిగా , రాజాసుబ్బారావు గారు కోశాధికారిగా, సుతాపల్లి లక్ష్మీనరసింహం (అబ్బాయి) జాయింట్ కార్యదర్శిగా ఇంకా ఇతరులతో "THE RAZOLE TOWN EDUCATIONAL AND CULTRUAL IMPROVEMENT SOCIETY " అను మరియొక సంస్థను ఏర్పాటుచేసి రిజిష్టర్ చేశారు. అప్పట్లో కళాశాల స్థాపించాలంటే మూడులక్షల రూ॥లు విరాళం ప్రభుత్వంనకు కట్టాలి. పదిఎకరాలకరాలు భూమిని తక్కువకాకుండా ఇవ్వాలి. రాజోలు వాస్తవ్యులు ఈ పదిఎకరాలు భూమిని సేకరించి

ఇస్తే బాగుంటుందని. మిగతా విరాళాలు బయటినుంచి తాలూకా ఇంప్రూవ్‌మెంట్ తేవాలని సలహా ఇచ్చి నిర్ణయించారు. ఇక అప్పటినుండి Activity ప్రారంభమయింది. డా॥ జానకిరామారావు గారిల్లు (ప్రస్తుతం స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా) వేదికగా మారింది. కాలేజ సమావేశాలు అన్నీ అక్కడే జరిగేవి. శ్రీ జానకిరామారావు గారు ఒక సైనికుడిలాగ పనిచేసి అందరిని ఇన్‌వాల్వ్ చేసేవారు. 1967 సం॥ సాధారణ ఎన్నికలు జరిగిన తర్వాత రుద్రరాజురామలింగరాజు గారు, శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డిగారి మంత్రివర్గంలో మొదట సాంఘికసంక్షేమ మంత్రిగా వెనువెంటనే దేవాదాయధర్మాదాయశాఖలో క్యాబినెట్ మంత్రి కావటంతో కాలేజస్థాపనలో అందరికీ ద్విగిణీకృత ఉత్సాహం వచ్చింది. పెదపట్నం అగ్రహారంలోని బోళ్ళవారు ముఖ్యదాతలుగా ఉండటానికి ప్రయత్నాలు జరిగేవి. బోళ్ళ సత్యనారాయణ గారి తాతగారు బోళ్ళ బులిసుబ్బారాయుడుగారి పేర కళాశాల పెడితే 2లక్షరూపాయిలు విరాళం ఇవ్వటాన్కి ముందుకు వచ్చారు. అయితే అదే గ్రామాన్కి చెందిన శ్రీ బోళ్ళవెంకటరత్నం ప్రసాద్ గారు తన మేనత్త భర్త డా॥ వి.ఎస్.కృష్ణ (ఈయన గొప్పవిద్యావేత్త ఆంధ్రయూనివర్సిటి వైస్ ఛాన్సలర్‌గా, యూనివర్సిటీ గ్రాంట్ కమీషన్‌ఛైర్మన్ గా పనిచేశారు) గారి పేరిపెడితే 2లక్షలు ఇవ్వటాన్కి సంసిద్ధులైనారు. కాబట్టి వారిని ముఖ్యదాతలుగా కమిటి అధ్యక్షులను చేసి కళాశాలకు డా॥ వి.యస్.కృష్ణ కళాశాలగా నామకరణం చెయిడానికి నిర్ణయించారు. వారు నేరుగా ఒక లక్ష రూ॥ల చెక్కును ప్రభుత్వానికి పంపేరు. అయితే ఈ లోపుగా విశాఖలో వి.యస్.కృష్ణ గారి పేరుపేరే కళాశాల పెట్టాలని నిర్ణయించడంతో శ్రీ ప్రసాద్ గారు ఇక్కడ ఒకలక్ష రూ॥లు మాత్రమే ఇచ్చారు. అందుపై బోళ్ళ సత్యనారాయణగారు అధ్యక్షులైయ్యారు. శ్రీ కామేశ్వరరావు గారు, బోళ్ళ సత్యనారాయణ గారు, మంగెన వేణుగోపాలంగారు, సైనాల గణేశ్వరరావు గారు, తాలూకా అంతా తిరిగి 2లక్షలరూ॥ల విరాళాలు ప్రోగుచేశారు. పేదవారు కూడా త్యాగం చేస్తూ విరాళాలు ఇచ్చి ఈ యజ్ఞంలో పాల్గొన్నారు. ఆ రోజులలో లక్ష అంటే ఏ తెలియని పరిస్థితి ఈ యజ్ఞంలో పాల్గొననివారు, కలసిరానివారు నిజంగా దురదృష్ట వంతులు.

ఈ కళాశాల ఏర్పాటు చేసిన స్థలం రాజోలులోని ఆర్.యస్.131 గలది. దామువారని నరసాపురం వారిది. ఇది 11 ఎకరంల 19సెంట్లభూమి మూడువైపులా ఖచ్చితమైన ప్రభుత్వ డ్రైయిన్ హద్దులుగా కల్గిన నిర్దిష్టమైన స్థలం దీనిని. దీని ప్రక్కగల బిల్డింగ్‌సొసైటీ స్థలాన్ని దొరగారి తోటగా వ్యవహరిస్తారు. పూర్వం ఇంగ్లీషు దొర గారి దీని యజమాని అనీ, ఆయనకు ఇక్కడ పంచదార ఫ్యాక్టరీ ఉండేదని, ఆతర్వాత ఈ భూములను దామువారికి ఇచ్చివేసి ఇంగ్లండ్ వెళ్ళిపోయారని చెబుతారు. అందుకే ఈ ప్రాంతాన్ని దొరగారితోట





అని అంటారు. దాముహారి తాలూకు ఈ భూమి కళాశాలకు బాగుంటుందని నిర్ణయించారు. యజమాని 1967లో ఖమ్మంపట్టణంలో ఆర్.అండ్.బి. లో ఎగ్జిక్యూటీవ్ ఇంజనీర్‌గా పనిచేసేవారు. పొన్నాల హనమంతరావు ఖమ్మం వెళ్ళి ఆయనను 1968 ఫిబ్రవరిలో జరిగిన అంతర్వేదితీర్థం రోజున మంత్రి రామలింగరాజుగారు వద్దకు అంతర్వేది తీసుకువచ్చారు. తనకు గల భూమి హౌసింగ్‌కాలనీకి బిల్డింగ్ సొసైటీ వారు ఎక్వైర్ చేసారని ఇక మిగిలింది ఇదేనని చెప్పారు. అయితే ఇది విద్యకోసం దానం చేసినట్లు అవుతుందని కోరడంతో ఆయన ఎంతో ఉదారంగ ఎకరం 10వేలురూ॥లుకు ఇవ్వటాన్కి ఎంతో హుందాగా అంగీకరించారు. తరతరాల విద్యార్థుల వారికి ఋణపడి ఉంటారు. ఈ రోజు ఆ భూమి విలువ కోటి రూ॥లు.

ఈ విధంగా రాజోలు కళాశాల ఏర్పడటం సుగమం అయింది. కళాశాల స్థాపించిన తర్వాత నడపటం ఎలాగని భయపడే సమయంలో రామలింగరాజు గారు తణుకు, రాజోలు, పాలకొల్లు కళాశాలను ప్రభుత్వకళాశాలగా ఏర్పాటుచేయిడాన్కి ప్రభుత్వంలో చాలా సునాయాసంగా సాధించారు. తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రి, కాకినాడ తర్వాత మూడవ ప్రభుత్వ కళాశాల రాజోలు. 1969 కాకుండానే అనుకొన్న దానికంటే ముందుగానే 1968లో ప్రీ యూనివర్సిటీ కోర్సుతో 14-8-1968న కళాశాల బాలుర హైస్కూల్‌లోని భవనాలలో తాత్కాలికంగా ప్రారంభింపబడింది. అక్కడే రెండు తాటి ఆకులుపెడ్ వేసి తరగతులు నడిపేరు. అయితే 1969 నవంబర్ నెల 7వ తేదిన వచ్చిన పెద్దగాలి వానలో ఈ పెడ్ల కూలిపోగా సొంతస్థలంలో మళ్ళీ తాత్కాలిక షెడ్లు నిర్మించారు. 1970 సం॥ అక్టోబర్ నెలలో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డి, విద్యామంత్రి పి.వి.నరసింహారావు ఇంకా ఇతరమంత్రులు అప్పటి డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ శ్రీ ప్రతాపరెడ్డి వగైరాలతో కాలేజ ఆవరణలో పెద్ద సభ జరిగింది. కొన్ని భవనాలకు శంకుస్థాపన జరిగాయి. ఆ తరువాత ప్రభుత్వం వారు భవనాల నిమిత్తం కమిటీకి లక్షరూపాయిలు తిరిగి ఇవ్వగా ప్రస్తుతం ఉన్న వాయవ్యమూల షెడ్ల నిర్మించారు. కాలేజ అప్పటికి 1970 నుండి మారింది. దక్షిణ భాగంలో తాటాకుల షెడ్‌వేసి నడిపేవారు. 1974వ సం॥లో శ్రీ జలగం వెంగళరావు గారు ముఖ్యమంత్రి గా ఉన్నప్పుడు 40 లక్షలరూపాయిలతో శాశ్వత భవనాలు చేపట్టబడ్డాయి. ఒక్కొక్క భాగానికి 10లక్షలతో 4 భాగాలుగా నిర్మించాలని తలపెట్టారు. 1980 నాటికి కొత్త భవనాలు మొదటి భాగం పూర్తి అయింది. అయితే తరువాత మారిన ప్రభుత్వాలు ఈ స్కీము కొనసాగించలేదు. దక్షిణ భాగంలో వేసిన తాటాకుల షెడ్ల 1988 డిసెంబర్ 26న జరిగిన రంగా ఆందోళన విధ్వంసంతో తగలబెట్టబడ్డాయి. తరువాత వాటిని కూడా రేకులతో మార్చి నిర్మించారు. 1995వ సం॥లో

జూనియర్, డిగ్రీకళాశాలలు వేరుపడ్డాయి. డిగ్రీకాలేజ ఆఫీసు వగైరాలు పర్మినెంటు భవనంనందును, జూనియర్ కళాశాల ఆఫీసు వగైరాలు ఉత్తరంవైపు షెడ్లలోను నడుస్తున్నాయి . అవసరమైన స్థలం ఉన్నప్పటికీ ఈ కళాశాలను ఎవరూ పట్టించుకోకపోవడం దురదృష్టదాయకం. కళాశాల స్థాపించినది మొదలు పదిసంవత్సరాలు డివోటెడ్ ప్రిన్సిపల్స్, స్టాఫ్ పనిచేశారు. స్థానిక ప్రజలను ఆహ్వానించి తరుచు సమావేశాలు జరిపేవారు. విద్యార్థులు కూడాఎంతో ఉత్సాహంతో సాంస్కృతిక, కార్యక్రమాలు వగైరాలలో పాల్గొనేవారు. దురదృష్టవశాత్తు ఈ ఉత్సాహం ఇప్పుడు పూర్తిగా కొరవడింది. కాలేజిలో అదనపు భవనాలేమి ఏర్పడలేదు. సీట్లుగాని, గ్రూపులు గాని పెంచలేదు. అవసరమైనంత మంది అధ్యాపకులు ఉండుటలేదు. విశాలమైన కాలేజీ ఆవరణకు ప్రహరీగోడ లేక ఆక్రమణలకు గురి అవుతోంది.

ఇది 20శతాబ్దపు చివరి కళాశాల పరిస్థితి. ప్రక్కనే అనేక కళాశాలలు ఏర్పడటంతో కొంత గిరాకీ తగ్గినా సీట్ల కొరత కొనసాగుతోంది. గుబ్బల నరసింహస్వామి. ఆరుమిల్లి వీరభద్రరావు, ఆర్.వి. సత్యనారాయణ, కృష్ణారావు, చందు, రాయుడు వగైరాలు నాన్ టీచింగ్‌స్టాఫ్ గా చాలాకాలం పనిచేశారు. అట్లాగే శ్రీహరి. సుబ్రహ్మణ్యం, సాహెబ్, సత్యం, కృపావరం, రామలింగేశ్వరరావు చాలా ఎక్కువకాలం నాన్‌టీచింగ్‌స్టాఫ్ గా ఉన్నారు. ప్రస్తుతం మురళీకృష్ణగారు సూపరింటెండెంట్‌గా, నాగేశ్వరరావుగారు సీనియర్ అసిస్టెంట్‌గాను, బాలామణి లేడీస్ అటెండర్‌గాను పనిచేస్తున్నారు.

**మహిళాకళాశాల** : మహిళలకు ప్రత్యేకంగా 1997 సంలో ఒక జూనియర్‌కళాశాల ఏర్పడింది. శ్రీ పొన్నాడ హనుమంతరావు అధ్యక్షులు, శ్రీ యం.ఏ.వేమా యం.ఎల్.ఏ ఉపాధ్యక్షునిగా, శ్రీవీరానాగభూషణం గారు కార్యదర్శి కరస్పాండెంటుగా , శ్రీ మల్లపురావు కోశాధికారిగా ఇతర సభ్యులతో ఈ కళాశాల మంచి భవిష్యత్‌కు పునాదులువేసింది. మహిళలకు ప్రత్యేకంగా ఈ కళాశాల ఏర్పడటంతో బాలికలు స్వేచ్ఛగా చదువుపై దృష్టిసాగించటంతో మంచి ఫలితాలు సాధిస్తున్నారు. ఈ కళాశాలకు ఇంకా స్వంత స్థలము భవనాలు సేకరించవలసి ఉన్నది. ప్రస్తుతం ప్రైవేటు వసతిలో నడుస్తోంది. వై.గాంధీ బళ్ళ శ్రీనివాస్ గారలు ప్రిన్సిపల్స్‌గా వ్యవహరించారుప్రస్తుతం శ్రీ మారుతి ప్రిన్సిపల్‌గా ఉన్నారు.

**సాంకేతికవిద్య** : రాజోలులో మొదటినుంచి సాంకేతిక విద్య అభివృద్ధి పొందలేదు. అప్పట్లో హైస్కూలు విద్య తరువాత టైపు నేర్చుకోవడం ఉండేది. తాలూకాలో మొదటిగా శ్రీ పొన్నాడ సుబ్బారావు గారు 1950నుండి టైపుఇనిస్ట్యూట్ నడిపేవారు.





తరువాత సి.హెచ్.ధనరాజు కొంతకాలం నడిపారు. ఆ తర్వాత నామన వెంకటస్వామి గారి మరియు యస్.ఎస్.టైపుఇనిస్ట్యూట్‌లు ఏర్పడ్డాయి. శ్రీ బిక్కిన గోపాలకృష్ణగారు యం.ఎల్.ఏ. గా ఉండగా ఆయన రాజోలు టైపు లోయర్ గ్రేడ్ పరీక్షకేంద్రం, 1976లో సాధించారు. 1970 దశకంలో శ్రీ వెంకటరమణ ఐ.టి.ఐ (పారిశ్రామిక శిక్షణ కేంద్రం) కొద్దిరోజులు ప్రైవేటు రంగంలో నడిచింది.

యువ ప్రధాని రాజీవ్‌గాంధీ చొరవతో దేశంలో కంప్యూటర్ ప్రవేశించి 1990 తర్వాత కంప్యూటర్ విప్లవం ఏర్పడింది. రాజోలులో 1995లో బి.డి.పి.యస్., స్పిక్ అండ్ స్పేన్ 1997 లో యునైటెడ్ కంప్యూటర్ సెంటర్ మరియు యస్.ఎల్.ఎస్. కంప్యూటర్ సెంటర్లు ఏర్పడి కంప్యూటర్ విద్యబోధిస్తున్నాయి. 1990 లోనే ఒక కంప్యూటరు సంస్థ ఏర్పడింది కాని ఎక్కువ కాలం నడవలేదు.

## రాజోలు కళాశాలలో పనిచేసిన ప్రిన్సిపాల్స్ వివరంలు

1). పి.వి.చాకో (1968 నుంచి 1968), 2). ఆర్.కృష్ణమూర్తి (1968నుంచి1969), 3). మేజర్ ఏ.యస్.న్. మూర్తి (అక్టోబర్ 1969 నుంచి సెప్టెంబర్ 1970), 4). అన్నాప్రగడ లక్ష్మీనారాయణ (అక్టోబర్ 1970నుంచి ఆగష్టు 1975), 5).ఆర్. సూర్యనారాయణమూర్తి (సెప్టెంబర్ 1975 నుంచి అక్టోబర్ 1976), 6).బి.బి.ఆర్. కృష్ణమూర్తి (నవంబర్ 1976 నుంచి జనవరి 1977), 7). ఆర్.పుల్లారావు (జనవరి 1977 నుంచి సెప్టెంబర్ 1978), 8). బి.నారాయణరావు (డిసెంబర్ 1978నుంచి డిసెంబరు 1981), 9). జి.యం.ఏ.రావు (డిసెంబర్ 1981నుంచి ఫిబ్రవరి 1982), 10). పి.సూర్యనారాయణరావు (డిసెంబర్ 1982 నుంచి ఆగస్టు1985), 11). డా॥ టి. క్రిష్ణకుమార్ (ఆగష్టు 1985 నుంచి సెప్టెంబర్ 1988), 12).ఎస్.రాధాకృష్ణమూర్తి (సెప్టెంబర్ 1988 నుంచి సెప్టెంబర్ 1989), 13). ఏ. నరసింహమూర్తి (నవంబర్ 1989 నుంచి ఆగష్టు 1990), 14).కె. నాగేశ్వరరావు (ఆగష్టు 1990 నుంచి మే 1995), 15). ఐ.కామేశ్వరరావు (మే 1995 నుంచి నవంబర్ 1995), 16).డా॥ యస్.శ్రీనివాస్ (డిసెంబర్ 1995నుంచి మార్చి 1996), 17). యం. వెంకటరావు (మార్చి 1996 నుంచి జూన్ 1996), 18). యం.బి.రామక్రిష్ణంరాజు (జూన్ 1996 నుంచి మార్చి 2000), ప్రస్తుతం **టి. దుర్గాకుమారి** గారు ప్రిన్సిపాల్ గా ఉన్నారు.

# 6. వైద్యరంగం

రాజోలు వైద్యరంగానికి కూడా శతాబ్దపు ఘనచరిత్ర ఉన్నది. 1898 నాటికి రాజోలులో ఎల్.ఫ (లోకల్‌ఫండ్) డిస్పెన్సరీ ఉండేది. దీనికి ఒక కమిటి కూడ ఉండేది. ఈ కమిటీలో పాన్నాడ భానుమూర్తి గారు సభ్యులుగా ఉండేవారు. 20-6-1898, 5-12-1898 మరియు 12-1-1900 తేదీలలో కమిటీ సమావేశాలు జరిగాయి. అయితే 12-1-2000 న (సరిగా వంద సం॥లకు) ఆస్పత్రి కొత్తభవనాలు ముఖ్యమంత్రి గా॥ నారాచంద్రబాబునాయుడు గారిచే ప్రారంభించబడటం ఒక అనూహ్యమైన, కాకతాళీయకమైన పరిణామం. మొదట్లో ఈ ఆసుపత్రి ప్రైవేటు భవనంలో నడపబడి ఆ తరువాత శాశ్వత భవనాల కోసం స్థలం సేకరించబడింది. రీసర్వేనెంబరు 140/ఎ, 140/113 (ఆర్.యస్.నెం.51లో య1-50సెంట్లు , ఆర్.యస్.నెం. 52లోయ1-21 సెంట్లు) మొత్తం య 3-01 సెంట్లు ధరణి ప్రగడలింగమూర్తి గారి నుండి 1908లో నర్సాపురం సబ్‌కలెక్టర్ ఉత్తర్వు ద్వారా భూసేకరణ జరిగి భవన నిర్మాణం జరిగి 1911లో ప్రారంభింపబడింది. ఆ భవనమే ఈ మధ్యవరకు లక్షలాదిమంది రోగులకు సేవ చేసింది. ఎల్.ఎఫ్. డిస్పెన్సరీగా ఏర్పడిన ఈ ఆసుపత్రి తరువాత, ఎల్.ఎఫ్. ఆసుపత్రిగా, ప్రభుత్వ ఆసుపత్రిగా, 30పడకల ఆసుపత్రిగా ఆతరువాత విధాననిర్ణయమార్పుతో వైద్యవిధాన పరిషత్ ఆసుపత్రిగా, కమ్యూనిటి డవలప్‌మెంట్ ఆసుపత్రిగా మార్పుచెందుతూ వచ్చి నూతన భవనంలో వైద్యసేవలు కొనసాగిస్తోంది. ఈ ఆసుపత్రి 1940 వరకు ఎవరు డాక్టర్లుగా పనిచేసారో తెలియదుకాని 1940 దశకంలో డా॥బెహరాఎఱ్ఱంరాజుగారు ఆ తర్వాత డా॥ సి.పాపారావు గారు సివిలు అసిస్టెంట్ సర్జన్లుగా పనిచేశారు. 1939 నుంచి లేడీ డాక్టరు కూడా పనిచేసేరు. 1944 నవంబర్ 7వతేదిన యల్.ఎఫ్. బోర్డు బెహరా ఎఱ్ఱంరాజు గారిపై వీరభానుపురమందిరంలో ఎంక్వైరీ జరిగింది. ఆయనను బదిలీ చేయగా 5-1-1945 న ఆయనకు అచ్చటే వీడ్కోలు సభ జరిగింది. రాజోలు వాస్తవ్యులు డా॥ సున్నసోమరాజు డి.యం.అండ్ ఎస్., యుద్ధంలోకి వెళ్ళినప్పుడు డా॥ ఎఱ్ఱంరాజుగారు వారింట్లో 30-10-42న సోమరాజు గార్కి వీడ్కోలు తేనీటి విందు ఇచ్చారు. తర్వాత డా॥ సున్నసోమరాజు రాజోలు ప్రభుత్వ ఆసుపత్రి లో యం.బి.బి.ఎస డిగ్రీతో సివిల్ అసిస్టెంట్ సర్జన్ గా పనిచేసి ఇక్కడే రిటైర్ అయి ప్రైవేట్ ప్రాక్టీస్ చేస్తున్నారు.

మహాత్మాగాంధీ జన్మదినం అయిన అక్టోబరు 2న కుష్ఠురోగుల దినంగా కూడా పాటిస్తారు. 1980 అక్టోబర్ 2న రాజోలులో కుష్ఠురోగులు ఆసుపత్రి ప్రభుత్వవారి ఆధీనంలో ప్రారంభింపబడి కుష్ఠురోగులకు సేవలందిస్తోంది.





ఇక ప్రైవేటురంగంలో 1930కి ముందు కేవలం ఆయుర్వేదవైద్యులు మాత్రమే వైద్యచికిత్సలు చేసేవారు. ఆలమూరి కృష్ణమూర్తి గారు, మల్లాద రామమూర్తిశాస్త్రి గారు ఆయుర్వేద వైద్యంచేసేవారు. 1930సం॥లో డా॥ భారతం నరసింహం గారు ఎల్.ఎ.యం. డాక్టర్‌గా రాజోలు వచ్చి మొదట ఇంగ్లీషు వైద్యం ప్రారంభించారు. 1932 సం॥లో డా॥ అమంచి రామారావు గారు కోనసీమలోనే మొదటి యం.బి.బి.యస్. డాక్టర్‌గా వైద్యం ప్రారంభించారు. వీరితో పాటుగా అమలాపురంలో డా॥ పేరిశాస్త్రిగారు మొదటి యం.బి.బి.యస్. డాక్టర్ గా వైద్యం ప్రారంభించారు. ఆ రోజులలోనే భారతం నరసింహంగారు డాక్టర్ అమంచి రామారావు గారు చిన్నకార్లు మెయిన్టైన్‌చేసి ఇంటింటికి వెళ్ళి వైద్యం చేసేవారు. ఎ.రామారావు గారు నర్సాపురం కూడ వెళ్ళి వైద్యం చేసేవారు. వీరిద్దరువురు రాజోలు లో పురాతనమైన అల్లోపతి వైద్యులు గా ప్రసిద్ధిచెందారు. రామారావు గారి వద్ద ఎస్. రామశాస్త్రి గారు, భారతం నరసింహ గారి వద్ద కోడి చినమునేశ్వరరావుగారు చాలాకాలం కాంపౌండర్లుగా పనిచేశారు. ఆ తరువాత 1949 లో డా॥కొమ్ముల భాస్కరరాజారావు గారు నర్సింగుహోమ్ ప్రారంభించారు. భారతంనరశింహంగారు పంచాయితీ సభ్యుని ఎన్నికకు కూడా పోటీ చేశారు. డా॥ రామారావు గారు వైద్యం లోనేగాక ఇంజనీరింగులో కూడా మంచి ప్రతిభ కన్పించేవారు. ఈయన ఖాళీ సమయాలలో రేడియోలు అసెంబ్లీ చేసేవారు. కొత్త హైస్కూలు భవననిర్మాణ కమిటీకి అధ్యక్ష్యం వహించారు. డా॥ భారతం నరశింహంగారు 1974లోను, డా॥ అమంచిరామారావు గారు 1985లోను, డా॥ రాజారావు గారు 1987లోను గతించారు. డా॥ రాజారావు గారు మంచివిద్యావేత్త. ఈయన మంచి ఉపన్యాసాలు ఇచ్చేవారు. ఆధ్యాత్మికవేత్త కూడ. ఈయన కూడ ఆ రోజుల్లోనే చిన్నకారు మెయింటెన్‌చేసేవారు. ఈయన 1964లో పంచాయితీ సభ్యునిగా ఏకగ్రీవంగా ఎన్నుకొబడి ఒకే ఒక ఓటు తేడాతో సర్పంచి పదవి కోల్పోయారు. ఇక డా॥ టిక్కిన జానకి రామారావు యం.బి.బి.యస్, డి.ఓ గా 1953 నుంచికంటివైద్యంచేస్తూ కళాశాల స్థాపనకు ఎంతో ప్రముఖపాత్రవహించారు. సత్యసాయిసేవాసమితి ఆధ్వర్యంలో ఎన్నో సేవలు చేసి ప్రస్తుతం పుట్టపర్తిలో ఉంటున్నారు. ఇక ఆయుర్వేద వైద్యానికి వస్తే మల్లాదిరామ్మూర్తిశాస్త్రి గారు ఆ వైద్యంలో దిట్ట. ఆయన స్వాతంత్ర్యసమరయోధులు కూడా. ఆయన శిష్యులు డాక్టర్ పారుపూడి విశ్వేశ్వరరావు గారిని గూర్చి ఈతరం వారిలో చాలా మందికి తెలుసు. ఈయన ఆయుర్వేదవైద్యం గాక, హోమియోపతి,అల్లోపతివైద్యం కూడా చేసేవారు. ఈయనకు ఆరోజుల్లోనే ఏ.జె.77 అను పెద్ద మోటారుసైకిల్ ఉండేది. అదే మోటార్‌సైకిల్ పై పల్లెపల్లెకూ తిరిగి బీద గొప్ప తేడా లేకుండా అత్యవసరమయితే పేదవారి గుడిసెలలో రాత్రంతా ఉండి అత్యవసర

వైద్యంచేసేవారు. ఈయనకి ఎట్టి పెద్ద విద్యార్హతలు లేకపోయినప్పటికి తెల్లవారుజామున 3గం॥లకు లేచి, సంస్కృతం నేర్చుకొని ఆ భాషతో ఆయుర్వేద వైద్యం అంతా నేర్చుకొన్నారు. అంతేగాక బ్రిటిష్ మెడికల్ జర్నల్స్ తెప్పించి శ్రద్ధగా చదివి ఆధునిక వైద్యశాస్త్రమంతా ఒంటపట్టించుకొన్నారు. ఈయన స్త్రీలకు ఎట్టి స్కానింగ్ అక్కర్లేకుండానే నాడిచూసి రెండవ నెలలోనే గర్భిణియో కాదో చెప్పేవారు. ఈయన స్వాతంత్ర్యఉద్యమంలో కూడా పాల్గొన్నారు. గౌతమీ పుష్కరపాఠశాలకు 1964 నుండి 1970 వరకు మేనేజర్ గా పనిచేశారు. ఈయన ఆల్ఇండియా ఆయుర్వేదిక్ కౌన్సిల్సభ్యునిగా 1969లో అప్పటి కేంద్ర ఆరోగ్యశాఖ డిప్యూటిమంత్రి శ్రీ బి.యస్.మూర్తి గారి ప్రోత్సాహంతో నియమింపబడ్డారు. శ్రీ విశ్వేశ్వరరావు గారు 1994 లో గతించారు. ఈయనతో సమాంతరంగా ఆయుర్వేదంలో డా॥ఆలమూరి బాబురావు గారు, డా॥మైలవరపు సుబ్రమహ్మణ్యంగారు, డా॥ కాశీభట్ల లక్ష్మీనారాయణగారు, డా॥గొర్తి సుబ్రహ్మణ్యం గారు వైద్యసేవలు అందించారు. అట్లే డా॥ నేదునూరి గౌరీపతిరావు హోమియోపతి డాక్టర్‌గా 1940 ప్రాంతంలో రాజోలు లో ప్రాక్టీసు ప్రారంభించారు. ఈయన తియ్యని హోమియోమందులు కోసం పిల్లలు ఈయన వైద్యం కావాలనేవారు. ఈయన కూడా స్వాతంత్ర్యసమరయోధుడే ఈయన రాజకీయాల్లో కూడా పాల్గొనేవారు. చాలా స్పీడుగా అనర్గళంగా ఇంగ్లీసు మాట్లాడేవారు. 1959నుండి 1964వరకు రాజోలు పంచాయితీ ప్రెసిడెంట్‌గా పనిచేశారు. ఈయన కూడ ఆల్ఇండియాహోమియోపతి బోర్డులో సభ్యునిగా పనిచేశారు. ఈయన ఈ మధ్య 1997లో గతించారు. 1950 ప్రాంతంలో తల్లాప్రగడ సూర్యప్రకాశరావు అనే కస్తూరి చిన్నబ్బాయిగారు కూడ "హోమియో" ఉచిత హోమియో వైద్యశాల నిర్వహించారు.

ఇక 1955 ప్రాంతంలో శ్రీమతి గొబేటి పుష్పలత, శ్రీమతి బొండాడ స్వర్ణముఖి అను ఇరువురు జి.సి.ఐ.యం. లేడిడాక్టర్లు జాయింటుగా కొంతకాలం స్త్రీలకు వైద్యసేవలు అందించిసొంతకారుపై విజిట్స్ చేసేవారు. 1955 ప్రాంతంలో రాజోలు ప్రభుత్వ ఆసుపత్రిలో లేడీడాక్టర్‌గా పనిచేసిన డా॥ బోళ్ళ సీతారామమ్మ గారు ఆ ఉద్యోగానికి రాజీనామా చేసి 1960 దశకంలో రాజోలులో ప్రైవేట్ ప్రాక్టీస చేసి వైద్యసేవలు అందించారు. ఈమె రోజూ సొంతంగా కారు డ్రైవ్ చేసుకొని పెదపట్నంఅగ్రహారం నుండి వచ్చి సేవలు అందించేవారు. ఇంకా 1960 దశకం వచ్చేసరికి 1964లో డాక్టర్ అడ్డూరి మల్లిఖార్జునరావు గారు మొదటిసారిగా ఎక్స్‌రే ప్లాంట్ వగైరాలతో ప్రైవేట్ ప్రాక్టీస ప్రారంభించారు. ఈయన మంచి సర్జన్‌గా పేరుపొందారు. చాలా పెద్ద ఆపరేషన్‌లు సునాయాసంగా చేసేవారు. మంచి పేరు ప్రతిష్టలు సంపాదించికొని చాలా పిన్నవయస్సులో 1982లో గతించారు.





డా॥ఎ.వి. అప్పారావు గారు 1967లో తన తండ్రి డా॥ ఏ.రామారావుగారితో వైద్యం ప్రారంభించి పాపులర్ డాక్టర్‌గా వైద్యరంగంలో ఉచితరీతిని సేవలు చేస్తున్నారు. ఈయన క్రీడారంగం, సంగీతం, సాంస్కృతిక రంగాలలో దిట్ట. లలిత కళాసమితి కార్యదర్శిగా ఉన్నారు. రాజోలులో టి.టి.డి. కళ్యాణమండపం నిర్మాణానికి, ఆలయ పునరుద్ధరణ కార్యక్రమాలలోను ప్రముఖపాత్ర వహించారు. ఈయన ఆర్.యస్.యస్. కు జిల్లా ప్రచారక్ గా కూడ ఉన్నారు.

అట్లే డాక్టర్ సూర్యనారాయణమూర్తిగారు లక్కవరం ప్రాథమిక ఆరోగ్యకేంద్రంలో పనిచేస్తూ రాజీనామా చేసి 1967 లో రాజోలులో ప్రైవేట్ ప్రాక్టీసను ప్రారంభించారు. ఈయన లలితకళాసమితి కి అధ్యక్షులు కూడ. 1972లో డా॥ ఎ.రాజకుమారి తన వైద్యసేవలును ప్రారంభించారు. ఈమె స్త్రీ వైద్యంలో నైపుణ్యం చూపిస్తు ఎంతోమందికి ప్రసూతి చికిత్సలు చేస్తూ ఉన్నారు. ఈమె ఒక గొప్పసాహితీవేత్త, పోషకురాలు కూడ. అనేక నవలలు రచించారు. ప్రతీ సంవత్సరం తన తల్లితండ్రుల పేరిట డిసెంబరు 14, 15 తేదీలలో సాహితీఉత్సవాలు జరిపి ఇంతవరకు సుమారు100మంది వర్ధమాన గొప్పసాహితీవేత్తలను ఆ ఉత్సవాలకు రప్పించారు. ఈమె చాలాకాలం రాజోలు సాహితీ స్రవంతికి అధ్యక్షులుగా కూడ పనిచేశారు. ఇక డా॥ వి. శేషగిరిరావు గారు 1977లో రాజోలులో ప్రైవేట్ ప్రాక్టీస ప్రారంభించి మొదటి నుండి సర్జరీలో నేర్పు వహించి అనేక విదేశీ డిగ్రీలు కూడా పొందారు. అనస్తీషియాలో నూతన ఒరవడిలు సృష్టించి 1999లో భారతదేశపు ఉత్తమ పౌరుని అవార్డు కూడా పొందారు. ఈయన రాజోలులో హైస్కూల్లో చదివేటప్పుడే తన అన్నగారు రమణమూర్తి గారితో కలసి బుర్రకథ చెప్పేవారు. అట్లే డా॥ బి. బుల్లిరామయ్యగారు కొంతకాలం ప్రాక్టీసుచేశారు.

ఆతర్వాత పి.జి. డాక్టర్లయుగం ప్రారంభమయింది. డా॥ వి.ఏ. నరసింహరాజుగారు మొదటి యం.డి.గా రాజోలులో అశ్విని నర్సింగ్‌హోమ్ ఏర్పాటు చేశారు. అట్లే డాక్టర్ రమేష్ యం.డి. పిల్లల స్పెషలిస్టు గా ఆయన భార్య వరలక్ష్మిగైనకాలిజిస్ట్ గా 1985 లోనే ప్రైవేట్ ప్రాక్టీస ప్రారంభించారు. డా॥ రమేష్ గారు తెలుగుదేశం పార్టీ తరపున రాజోలు మండలపరిషత్ మొదటి అధ్యక్షునిగా 1986నుండి 1991 వరకు పనిచేశారు. శ్రీమతి వరలక్ష్మిగారు ప్రస్తుతం రాజోలు ప్రభుత్వఆసుపత్రిలో లేడీ డాక్టర్‌గా పనిచేస్తున్నారు.

ఇక డాక్టర్ కె.టి.రాజారావుగారి అల్లుడు డా॥ జి. గంగరాజుగారు యం.డి.(సైక్రియాట్రిక్) గా ఆయన భార్య శ్రీమతి అనంతలక్ష్మి సత్యవతి గైనకాలజిస్ట్ గా వైద్యసేవలు అందించి తర్వాత అమలాపురంనకు వైద్యసేవలు మార్చారు. శ్రీ గంగరాజు గారు రోటరీసభ్యునిగా, అధక్ష్యునిగా, వైద్యఆరోగ్యరంగాలలో సమాజసేవ కూడా చేశారు.

ఆతరువాత డా॥ కె. విజయకుమార్, డా॥ శ్రీమతి కమల సంజీవినినర్సింగ్‌హోమ్ అచ్చట నడుపుతూ వైద్యసేవలు చేస్తున్నారు. అట్లే డా॥ శ్రీ సి.సత్తిరాజు సూర్యనారాయణమూర్తిగారు కూడా 1993 నుండి కంటి చికిత్స మరియు ఇ.ఎన్.టి. లోను వైద్యసేవలు అందిస్తునారు. అట్లే రాష్ట్ర ప్రభుత్వ అదనపు వైద్యసేవ డైరెక్టర్‌గా పనిచేసిన డా॥ వి. చిట్టిశేషుగారు యం.డి. రిటైర్ అయిన తర్వాత స్వగ్రామం రాజోలులో 1995 నుండి సేవలందిస్తున్నారు. ఈమె **భాతిరోగాల నిపుణురాలు.**

రాజోలులో ఇండియన్ మెడికల్ అసోసియేషన్ శాఖ రాజోలు ప్రాంతంలో విలువైన సేవలు అందించడానికి ఎన్నో సమావేశాలు నిర్వహించి డాక్టర్ మణి, డాక్టర్ మిశ్రా, డాక్టర్ జయంతిరామారావు, మధుమేహ వ్యాధినిపుణులు డా॥ విశ్వనాథన్ వంటి ఎందరో ప్రముఖ వైద్యశాస్త్రజ్ఞులను ఆహ్వానించి వారి సందేశాలు ఏర్పాటు చేశారు. కొంతమంది వైద్యులు కలసి రోగుల అవసరాల నిమిత్తం సుమారు 20 సం॥రాల క్రితం డి.రాజోలు క్లినికల్ లేబరేటరీ ఏర్పాటు చేసి వైద్యపరీక్షలు చేస్తూ స్కానింగ్, ఎక్సరే వంటి అధునాతన సదుపాయాలు తో పాటు ఒక అంబులెన్స్‌కారు కూడా నడుపుతోంది. డబ్బు సంపాదించడం ధ్యేయం కాకుండా రాజోలు వైద్యులందరూ మానవతాదృష్టితో వైద్యం చేస్తూ చక్కటి సంస్కృతిని ఏర్పర్చటం ఇక్కడ ప్రజల అదృష్టం.

ఇంకా డాక్టర్ అరవ జానకీరామయ్యగారు డి.యం.హెచ్.ఎస్. డిగ్రీ పొంది హోమియోపతి వైద్యం చేస్తూ చక్కటి సేవలు అందిస్తూ దురదృష్టవశాత్తు 1992లో పిన్నవయస్సులోనే గతించారు. డా॥ భారతంబాల్జి, డా॥పారుపూడి సుబ్బారాయుడు కూడా హోమియో మరియు ఆయుర్వేదవైద్యంలో సేవలందిస్తున్నారు. ఇక పూర్వంనుంచి గొల్లమందల నరసింహమూర్తిగారు, బోళ్ళ సత్యనారాయణగారు దంతవైద్యంచేసేవారు. ప్రస్తుతం నరసింహమూర్తిగారి కుమారుడు డా॥ సుభాష్ దంతవైద్యం చేస్తున్నారు. అట్లే కనుమూరి కృష్ణంరాజుగారు 1950 ప్రాంతంనుంచి ఎముకలు వైద్యం చేసేవారు. ఎట్టి ఎక్సరేలు లేకుండా కట్టుకట్టి విరిగిన ఎముకలు అతికేవారు. ఎడ్లకు, ఆవులకు కూడా కట్లు కట్టేవారు. అందుకే వీరిని కట్లురాజుగారు అని వ్యవహరించేవారు. వీరి తదనంతరం వీరి కుమారుడు సత్యనారాయణరాజు గారు ఈ వైద్యం కొనసాగిస్తున్నారు.





# ఆయుర్వేద వైద్యుల సమావేశం

8-6-43 న రాజోలు బోర్డు హైస్కూలు ఆవరణలో ఆంధ్రరాష్ట్ర ఆయుర్వేద సమ్మేళనం జరిగింది. పినపాక శ్రీరామవెంకటసూర్యారావు గారు ఆహ్వానసంఘ అధ్యక్ష ఉపన్యాసం ఇచ్చారు. శతావధాని వేదుల తిరుమల రామానుజస్వామి అధ్యక్షత వహించారు. ఆయుర్వేద పండితులు కాశీకృష్ణమాచార్య, ఆచంట లక్ష్మీపతి వగైరాలు పాల్గొన్నారు. అంతకు ముందు వారిని ఇరవై ఎడ్లతో కట్టిన బండిలో ట్యాండు, సన్నాయిలతో వూరేగించారు. పన్నెండు గంటలకు ధన్వంతరి పూజ జరిగింది.

రాజోలు ప్రభుత్వ ఆసుపత్రిలో 1930 నుండి 1985 వరకు పనిచేసిన కొంత మంది వైద్యులు

| డాక్టర్లు | లేడిడాక్టర్లు |
|---|---|
| డా॥ శ్రీరామమూర్తి | -------- |
| డా॥ ఎర్రంరాజు | -------- |
| డా॥ అప్పలనర్సయ్యనాయుడు | --------- |
| డా॥ సి.పాపారావు | --------- |
| డా॥ రంగారావు | డా॥ జ.సీతారామమ్మ |
| డా॥ గోపాలకృష్ణమూర్తి | --------- |
| డా॥ వెంకటసుబయ్య | డా॥ విక్టోరియా |
| --------------- | డా॥ తరావేలు |
| డా॥ రహీమ్ | డా॥ లక్ష్మీరహీమ్ |
| డా॥ ఫ్రాన్సిస్ | డా॥ లక్ష్మీ ఫ్రాన్సిస్ |
| డా॥ హెచ్. ఎస్. గోపాలరావు | డా॥ సౌభాగ్యలక్ష్మి |
| డా॥ ఎస్.సోమరాజు | ----------- |
| డా॥ సి.సుదర్శనరావు | డా॥ అన్నపూర్ణ |
| డా॥ డి.వెంకటేష్ | డా॥ డి. శ్యామల |
| డా॥ లక్ష్మీపతి | ----------- |

1903-1904లలో మన్నెం పాతరాజు కాంపౌదర్‌గాను, చదలవాడ విశ్వనాథం అసిస్టెంట్ గాను పనిచేశారు. ప్రస్తుతం డా॥ డి.డి. ప్రసాద్ రావు డిప్యూటిసివిల్ సర్జన్‌గా, డా॥ శ్రీ కర్నల్‌రాజు, డా॥ జె.కె.విజయకుమార్, డా॥ ఎ. సూర్యనారాయణ, డా॥ సి. వరలక్ష్మి సివిల్‌అసిస్టెంట్ సర్జన్లుగా, డా॥ బి.ఎస్. భారతి దంతవైద్యులుగా ప్రభుత్వఆసుపత్రిలో పనిచేస్తున్నారు. బాళ్ల. ఆకులసుబ్బారావుగారు చాలాకాలం కాంపౌండర్లుగా ఉన్నారు.

# 7. పోలీసు-నేరాలు-శాంతిభద్రతలు

రాజోలుపట్టణం మొదటినుంచి శాంతిభద్రతలకు, ప్రశాంతజీవనానికి పేరు పొందింది. ఇక్కడ ఎన్నడూ కుల, మత ఘర్షణలు జరగలేదు. అన్ని మతాలవారు, కులాలవారు శాంతియుత సహజీవనం సాగిస్తారనడం గర్వించదగిన అంశం. రాజకీయఘర్షణలు కూడా లేవు. అయితే తాలూకా ఏర్పడినప్పుడే పోలీసువ్యవస్థ కూడా ఏర్పడింది. 1910-1911 ప్రాంతంలో అప్పటి ఒక సబ్‌ఇన్‌స్పెక్టర్ గుర్రంపై తిరిగి దర్యాప్తు చేసేవారు. అట్లే 1915-16 ప్రాంతంలో తటపర్తి జనార్ధనరావు గారు ఎస్.ఐ. గా పనిచేసేవారు. ఈయన బుడబుక్కల వారి వేషం వేసుకొని రహస్యంగా కేసులు దర్యాప్తు చేసేవారు. అట్లే 1950 ప్రాంతంలో కస్తూరి శివరాం అను ఎస్.ఐ.గారు మోటారుసైకిల్‌పైతిరిగి కేసులు పట్టేవారు.

1911 సం॥లోనే అరుమిల్లి నరసింహులు మరియు కోళ్ళఅయ్యన్న, గంగయ్య, పుల్లయ్య వగైరాల రీ.సర్వేనెంబరు142,143 తాలూకాకు భూములలో (ఆర్.ఎస్.నెంబర్ 54/2/24) య1-91సెంట్లు భూమి సేకరించి 24యిళ్ళ పోలీసులైను నిర్మించారు. పాతభవనాలు కూలగొట్టి 1991లో అప్పటి జిల్లా పోలీసుసూపరింటెండెంట్ శ్రీ గోపినాథరెడ్డి శంకుస్థాపన చేయగా 1994లో అప్పటి డి.ఐ.జి. భాస్కరరావుగారు క్రొత్తభవనాలను ప్రారంభించారు. అప్పటి శాసనసభ్యులు శ్రీ మంగిన గంగయ్య మంత్రులు, శ్రీ సంగీత వెంకటరెడ్డి, కుడిపూడి ప్రభాకరరావు గార్లు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

రాజోలు మొదటినుండి ఒక పోలీస్‌సర్కిల్ హెడ్‌క్వార్టర్స్ కూడా. ఈ మధ్య వరుకు రాజోలు,కొత్తపేట తాలూకాలకు రాజోలులో సి.ఐ. ఉండేవారు. కొద్ది సం॥రాల క్రితం రావులపాలెం వేరే సర్కిలుగా ఏర్పడింది. 25-10-1936 వీరభానుపురం వార్షికోత్సవంలో అప్పటి సి.ఐ. ఎస్.కామేశ్వరనాయుడు పాల్గొన్నారు.

**రాజోలులో పనిచేసిన కొంతమంది ఎస్.ఐ.ల వివరాలు :** తటపర్తి జనార్ధనరావు, కస్తూరి శివరాం, కె.కామేశ్వరరావు, బి.వెంకట్రావు, రాజబాబు, మీరాసాహెబు, కె.వి.వి. సత్యనారాయణ వగైరా..

**రాజోలులో పనిచేసిన కొంతమంది సి.ఐ.ల వివరాలు :** తిమ్మిరాజుశేషగిరిరావు గారు, ఎస్.కామేశ్వరరావు నాయుడు (1936), దప్పుల సుబ్బారావు, (1944-45), డి.సూర్యనారాయణ, సోములు, భూపాల్, కోటిపల్లి శ్రీనివాస్, పోతారెడ్డి, టి.ఎ.ఆర్. ప్రసాద్, డేవిడ్.రాజమోహనరెడ్డి, సి.హెచ్.కోటేశ్వరరావు, పి.వెంకటేశ్వర్లు, ప్రస్తుతం శ్రీ వెంకటేశ్వరరావుగారు ఉళలాబ్బపు మొదటి సి.ఐ.గా ఉన్నారు.

రాజోలు స్టేషనుకు 1977లో ఒక సెంట్రీ కానిస్టేబుల్ తన తుపాకితో మరియొక కానిస్టేబులును కాల్చిచంపాడు. అంతేగాని ఇక్కడ లాకప్‌డెత్‌లు లేవు. రాజోలులో శాంతిభద్రతలు





బాగానే ఉన్నా ప్రక్క గ్రామాలు కొమ్మంటిలో 1930-40 వ దశకాల్లో రాజకీయకక్షలు ఉండేవి. పెందుబలమైన వర్గాలు కొందరు రౌడీలను మెయిన్‌టైన్ చేసేవారని, పెద్దపులి చిన్నపులి అను పేరొందిన రౌడీలు ఉండేవారని చెబుతారు. ఈ రౌడీలు ఒకరినొకరు పొడుచుకోవడం, హత్యలు ఉండేవని చెబుతారు. మాజీమంత్రి రామలింగరాజు గారి తండ్రి రుద్రరాజు వెంకట్రామరాజుగార్ని 22-7-37 న సఖినేటిపల్లిలో హత్యచేశారు. కేసులు నడిచాయి. 1939 సం॥ నవంబరు నెలలో శివకోడులో ఎన్నికలు జరుగుతుండగా చింతలపల్లి పెదవెంకట సూర్యనారాయణరాజు గారిపై తుపాకితో దాడి జరపగా ఆయన కన్నుపోయింది. ఆ తర్వాత పెద్ద పెద్ద రౌడీలను ఉరితీయగా హత్యలు ఆగాయని చెబుతారు.

తిరిగి 1949 సం॥లో విశ్వేశ్వరాయపురంలో కమ్యూనిస్ట్ ఉద్యమంలో కొంతమందిని హత్యగావించిన సందర్భాలలో రాజోలులో పౌరులు పోలీస వారితో రాత్రి తెల్లవార్లూ పోరీలు కాసేవారు. అయితే ఎట్టి హింసాఘటనలు జరగలేదు. మొదటిసారిగా రాజోలులో 1953 సం॥ జూలైనెలలో ప్రశాంతి ఉయుంటల (అప్పటి రవిథియేటర్) ప్రక్కన గల సలాదిసత్యంగారిని, 15 సం॥ల కుమారుని, 14 సం॥ల కుమార్తెను డబ్బుకోసం ఎవరో హత్యచేశారు. ఈ హత్య చాలామందిని భయభ్రాంతులను చేసింది. రాజోలు అభివృద్ధికి గండికొట్టింది. హంతకుల ఆచూకీ తెలియకపోవడంతో ప్రత్యేక దర్యాప్తు కోసం ప్రభుత్వం అప్పట్లో ప్రముఖనేరపరిశోధకుడు రామచంద్రన్‌ని నియమించింది. ఈ హత్యకు అనుబంధంగా ఒక కానిస్టేబుల్ గ్రామనౌకరు కూడా అనుమానస్పద పరిస్థితిలో మరణించారు. మొత్తానికి కొంతమంది ప్రముఖులతో సహా కేసుపెట్టారు. రాజోలు సబ్‌మెజిస్ట్రేట్‌కోర్టులో ముందు విచారణ జరిగి సెషన్స్‌కు పంపబడింది. ఆ కేసు కొట్టివేయబడింది. 1953 జూలైలో ఈ హత్యజరిగిన ఒక నెలకు గోదవరికి విపరీతంగా వరదలు వచ్చాయి. ఆ తర్వాత రాజోలు తాలూకాలో బందిపోట్లు, దొంగతనాలు జరిగేవి. 40,50 మంది సైకిళ్ళుపై వచ్చి బెదిరించి దొంగతనాలు చేసేవారు. రాజోలులో అప్పటి వస్త్రవ్యాపారి కామన వనమరాజుగారి ఇంట్లో కూడా 40 మంది దుండగులు ముసుగులతో వచ్చి భయభ్రాంతులను చేసి దొంగతనం చేశారు. ఆనాడు జరిగిన సంఘటన ఆయన ఇప్పటికీ చెబుతుంటే మనల్ని భయభ్రాంతులను చేస్తుంది.వెంటనే పౌరులు స్పందించి సాయుధపోలీసులతో కలసి పట్టణమంతా పౌరులు పోరీలు కాసేవారు. తర్వాత ఈ నేరాలు సర్దుమణిగాయి. అదృష్టవశాత్తు ఆ తర్వాత శాంతిభద్రతలకు విఘాతం కల్గలేదు. కోళ్ళసత్యం (1969, ఆకుల సోమయ్య, 1970లోను వ్యక్తిగత కారణాలవల్ల హత్యగావింపబడి ముద్దాయిలకు శిక్షలు పడ్డాయి. ఈ కొద్ది సంఘటనలు మినహా రాజోలు పట్టణం ఎప్పుడూ శాంతియుత సహజీవనానికి ఆలవాలమైయుంది. కొబ్బరిచెట్లు నుండి కాయలు దొంగిలించే చిన్నచిన్న నేరాలు లోగడ జరిగినా, సుమారు 40 సం॥లనుండి కొబ్బరి పంట, వరిపంట పెరగటం ప్రతివారికి పనిదొరకడం గల్ఫ్ సబుర్లు రావడంతో రాజోలు తాలూకాలోని జీవనసరళి మారి నేరప్రవృత్తి తగ్గి ప్రశాంతతకు నిలయమయింది.

1964లో శివకోడులో లక్కింశెట్టి చిన్నయ్య గారి ఇంట్లో దొంగతనం జరిగినప్పుడు

పోలీసుకుక్కలను తీసుకువచ్చారు (ఆ సందర్భంలో అప్పటి సెకండ్‌క్లాస్ మెజిస్ట్రేట్ పాత్రో గారి సమక్షంలో రాజోలులో పోలీసుకుక్కల పరిశోధన ప్రదర్శనిచ్చారు. కుక్కను దూరంగా జైలు గదిలో ఉంచి నాజేబురుమాలు తీసుకొని అక్కడ దానికి వాసనచూపించారు. ఆ తర్వాత నన్ను మరి పదిమంది న్యాయవాదులు మరి ఇతరులతో కలసి పోలీసుస్టేషన్ అరుగుపై వరుసలో నిల్చోబెట్టి కుక్కను తీసుకువచ్చారు. అది అందరిని వాసన చూసుకొంటూ వచ్చి, నన్ను వాసన చూచి ఒక్కసారి మొరుగుతూ తన ముందు కాళ్ళతో నా మీదకు ఎగరడంతో ట్రైనీపోలీసులు దానిని పట్టుకొని వెనక్కు తీశారు. రుమాలు వాసనతో పసిగట్టింది. మనిషికి. మనిషికి ఉండే వాసన తేడాను పసిగట్టగల్గే శక్తిని మనమందరము చీదరించుకొనే కుక్కకు భగవంతుడు ఇచ్చాడు. సరియైన సమయంలో తీసుకొని వస్తే పోలీసుకుక్కలు దర్యాప్తుకు సహకరిస్తాయి అనడానికి పైన తెలిపిన స్థానిక ఉదాహరణ చాలు. - (రచయిత)

పూర్వం నేరాలు చేసి నేరస్థులు పరిగెత్తేవారు. వారిని పట్టుకోవడాన్ని పరిగెత్తడానికి వీలుగా పోలీసులే కాకుండా ఎస్.ఐ., సి.ఐ.లు కూడా తప్పనిసరిగా నిక్కర్లు (షార్ట్స్) ధరించేవారు. అయితే 1960 దశకంలో ఎస్.ఐ.లకు సి.ఐ.లకు ఫ్యాంట్స్ వచ్చాయి. ఆ తర్వాత 1979 ప్రాంతంలో పోలీసులకు కూడా ఫ్యాంట్స్ వచ్చాయి. 1988 లో పోలీసులకు ఎర్రటోపీలు పోయి నల్లటోపీలు వచ్చాయి.

అధునాతన పద్ధతులలో నేరాలు చేసేవారు, పెరిగినా పోలీసు వ్యవస్థకు ఇంకా ఆధునిక పరిశోధన సామాగ్రి వగైరాలు లేవు. పోలీసుల సంఖ్యకూడా అప్పటికి, ఇప్పటికి ఒకేలాగ ఉన్నది. కాని ఉన్నత అధికార యంత్రాంగం మాత్రం విపరీతంగా పెరిగిపోతోంది. పోలీసులకు ఫ్యాంట్లు వచ్చాక రాజోలులో "లూనా షోరూం" వారు పోలీసులకు లూనా మోటార్‌సైకిళ్ళు లోన్ పై ఇచ్చారు. (నేరస్థులను రిమి పట్టుకోవడానికి వీలుగా)

పోలీస్ జోక్యం అవసరం లేకుండా ఈ ప్రాంతం ప్రజలు అహింస, శాంతియుతంగా జీవించాలని, ఈ ప్రశాంతత పరిరక్షింపబడాలని ఆశిద్దాం.

**ప్రొహిబిషన్ అండ్ ఎక్సైజ్** : రాజోలులో చాలాకాలం నుండి ప్రొహిబిషన్ మరియు ఎక్సైజ్ శాఖలు పనిచేస్తున్నాయి. సారానిషేధం ఉన్నప్పుడు దీనిని ప్రొహిబిషను అని ఎత్తివేస్తే ఎక్సైజుశాఖగా పిలవబడుతుంది. రాజోలు ఈ శాఖలో ఎస్.ఐ. గాక సుమారు 30 సం॥ల క్రితం సర్కిలు ఏర్పడింది. అప్పటినుంచి రాజోలులో సి.ఐ. కూడా ఉంటున్నారు. మద్యానికి సంబంధించిన కేసులు పెట్టడం ఈ శాఖ చేసేపని.

**సెంట్రల్ ఎక్సైజ్** : యూనిఫారం ధరించి కేంద్రఎక్సైజు సుంకం వసూలు చేసేశాఖ కూడా ఇప్పటి పనిచేసింది. ప్రక్కనగల నాగుల్లంక, గన్నవరం వగైరా లంక భూములలో ఎక్కువగా పొగాకు పండించేవారు. అందుకు వీటిపై పన్ను వసూలు చేయడాన్కి ఈ శాఖ ఏర్పడింది. నిజామి అనే డి.యస్.పి., అలీబేగ్, శంకరరావు, గౌరీశంకర్, దేవళ్ళ మొదలైన ఎంతోమంది ఇన్‌స్పెక్టర్లు ఈ శాఖలో పనిచేసి మంచిక్రీడాకారులుగాను జార్జ్‌క్లబ్ ఏక్టివిటీస్ లోను పాల్గొనేవారు.





## 8. న్యాయవ్యవస్థ

రాజోలులోని న్యాయవ్యవస్థ కూడా పురాతనమైనదే. అంటే సుమారు 100 సం॥రాల చరిత్ర ఉన్నది. తాలూకాతో పాటు మేజిస్టీరియల్ వ్యవస్థ కూడా ఏర్పడింది. రాజోలులో క్రిమినల్ కేసులు విచారించడాన్కి 1905 ప్రాంతం నుండి ఒక సబ్‌మేజిస్ట్రేట్ ఉండేవారు 1911సం॥ ప్రాంతంలో అవసరమైతే ఈ సబ్‌మేజిస్ట్రేట్ ఇళ్ళకు వెళ్ళి సాక్ష్యాలు తీసుకొనేవారు. ఇక సివిల్ విషయాలకు వస్తే రాజోలు ప్రాంతంవారు నరసాపురం వెళ్ళేవారు. నరసాపురంలో మున్సిఫ్‌కోర్టు ఉండేది. పెద్దక్రిమినల్ కేసులకు కూడా నరసాపురం వెళ్ళేవారు. జిల్లాకోర్టు బందర్‌లో ఉండేది. ఆ తర్వాత గోదావరిజిల్లాల ఏర్పాటుతో రాజోలును అమలాపురం కోర్టులకు చేర్చారు.

అయితే 1916లో అమలాపురంలో రాజోలుకు ప్రత్యేకంగా సివిల్ కోర్టు ఏర్పడింది. దానిని "డిస్ట్రిక్‌మున్సిఫ్‌కోర్టుఆఫ్‌రాజోలుఎట్ అమలాపురం" అని వ్యవహరించేవారు.

చివరకు 1921లో ఆ కోర్టు రాజోలుకు తరలించబడి సివిల్‌వ్యాజ్యాల పరిష్కారాలకు నాంది ఏర్పడింది. ఈ కోర్టు అంతకముందు పాత తాలూకా ఆఫీసుభవనంలో ప్రారంభించారు. ఇది ఆర్.ఎస్.నెం.111/2లో సుమారు 2ఎకరంలో ఉన్నది. ఇవే ఇప్పటి కోర్టుభవనాలు, కొత్తపేట తాలూకా కూడా, అంటే బొబ్బర్లంక వరకు కూడా ఈ సివిలు కోర్టుకు రావాలి. సొమ్ముకు సంభందించిన దావాలు 300రూ॥ల వరకు, స్థిరాస్తికి సంభందించి 3000రూ॥లు వరకు మాత్రమే విచారణ ప్రారభంఅయింది. ఆ పై విలువ గల దావాలకు, అమలాపురం వెళ్ళవలసినదే. రాజోలులో 1921లో కోర్టు ప్రారంభించినప్పుడే రాజోలులో వాడ్రేవు రామమూర్తి గారు, వాడ్రేవు పాపయ్యగారు ప్లీడర్ల గా వృత్తి ప్రారంభించారు. తరువాత తల్లా ప్రగడ చలపతిరావు గారు, వలచోళ్ళ పద్మనాభంనాయుడుగారు (కేంద్రమాజీమంత్రి రంగయ్యనాయుడు గారి తండ్రి) కొద్దికాలం రాజోలులో ప్రాక్టీస్ చేశారు. తర్వాత ఎర్రంశెట్టి అయ్యప్పనాయుడు గారు, మైలవరపు పురుషోత్తంగారు, గోటేటి సత్యనారాయణగారు, చేబియ్యం బుచ్చిబ్బాయిగారు ప్రాక్టీస్ ప్రారంభించారు. ఆ తర్వాత ధరణీప్రగడ నారాయణమూర్తి గారు ప్రారంభించారు. కస్తూరి రామబ్రహ్మంగారు క్రిమినల్ కేసులు చేసేవారు. తర్వాత కొమ్ముల సత్యనారాయణగారు, దేశరాజు రామచంద్రరావుగారు, భమిడిపాటి సత్యనారాయణ గారు, వాడ్రేవుసుబ్బారావు గారు, అయ్యగారి నరసింహమూర్తిగారు, చేబ్రోలురెడ్డి దీక్షితులుగారు అకెళ్ళసుబ్రహ్మణ్యం గారలు న్యాయవాదులుగా వ్యవహరించేవారు. అప్పట్లో కేవలం డిగ్రీ పూర్తిచేసి ఫస్ట్‌గ్రేడ్ లా పరీక్ష పూర్తిచేస్తే మున్సిఫ్ కోర్టులో ప్రాక్టీసు చేయివచ్చు. లా డిగ్రీ చదివి పట్టాతీసుకొంటే

(సనద్)వకీలు అనేవారు. వారు జిల్లాకోర్టులో కూడా ప్రాక్టీసు చేయవచ్చు. ఇక లా డిగ్రీ పూర్తిచేసి హైకోర్టులో పట్టాపొందితే వార్ని అడ్వకేట్ అని వ్యవహరిస్తారు. వీరు హైకోర్టులో కూడా వాదించవచ్చు. ఆవిధంగా రాజోలులో కొమ్ముల సత్యనారాయణగారు, విన్నకోట బాపిరాజుగారు హైకోర్టులో పట్టాపొందిన మొదటి అడ్వకేట్‌లు అయ్యారు. కొద్దికాలం తర్వాత మైలవరపు శివరామశాస్త్రి గారు అడ్వకేట్ అయ్యారు. ఇక 40వ దశకం వచ్చేసరికి వాడ్రేవు సుబ్రహ్మణ్యం గారు, కొండేపూడి వియన్నగారు అడ్వకేట్లుగా వచ్చారు.

అప్పట్లో న్యాయవాదులు, వృత్తిలోనే కాకుండా స్వాతంత్ర్యపోరాటంలోను ప్రజాజీవితంలోనుకూడా చురుకుగా పాల్గొనేవారు. వాడ్రేవు రామమూర్తి గారు, భమిడిపాటి సత్యనారాయణగారు, దేశరాజు రామచంద్రరావు గారు స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్నారు. శ్రీ భమిడిపాటి సత్యనారాయణ గారు జైల్‌కు కూడా వెళ్ళేరు. ఈయన బందర్‌కు పాదయాత్ర చేశారు. ఇక వాడ్రేవు రామమూర్తి గారు కో-ఆపరేటివ్ రంగంలో ఎంతో సేవచేశారు. ఈయన రాజోలు భూమి తనఖా బ్యాంక్ స్థాపకులు. మొదటి అధ్యక్షులు కూడా. ఈయన బార్‌అసోసియేషన్ అధ్యక్షులుగా చాలా కాలం వ్యవహరించారు. ఈయన తన ఖరీదైన లైబ్రేరిని బార్‌అసోసియేషన్ కు ఉచితంగా ఇచ్చివేశారు. బార్ అసోసియేషన్ ఈయన షష్టిపూర్తి ఉత్సవాన్ని 3-8-1942 జరిపింది. ఆరోజు పార్టీ మరియు హరినాగభూషణంచే కచేరి ఏర్పాటుచేశారు. ఈయన విలాసపురుషుడు ప్రతిసంవత్సరంలో వేసవిలో ఊటివెళ్ళేవారు. టంగుటూరిప్రకాశం గారికి అత్యంత సన్నిహితులు. వాడ్రేవురామమూర్తి గారు ఊటీలో మరణిస్తే శ్రీ ప్రకాశంగారు కూడా అక్కడ అంత్యక్రియలకు (వాహకుడుగా) పాల్గొన్నారని చెబుతారు. ఈయన వద్ద జూనియర్‌గా పనిచేసిన దుర్గారామచంద్రరావుగారు అనేన్యాయవాది అప్పటి ఉమ్మడి మద్రాస్ రాష్ట్ర కేంద్ర సహకార తనఖాబ్యాంక్‌లో ఉద్యోగిగాచేరి తరువాత ఆంధ్రప్రదేశ్ కేంద్రభూమి తనఖా బ్యాంక్ కార్యదర్శిగా రిటైర్ అయ్యారు. ఇక ఎర్రంశెట్టి అయ్యప్పనాయుడు గారు చురుకుగా రాజకీయాలలో పాల్గొనేవారు. ఈయన 1928లగాయితు 1934 వరుకు రాజోలు పంచాయితీ ప్రెసిడెంట్ గా పనిచేశారు. ఈయన కుమారుడు హరినాధబాబు, మనవడు అయ్యప్పనాయుడు ప్రాక్టీసు చేస్తున్నారు. ఇక 1950 తర్వాత వెంపరాల వెంకటసూర్యకామేశ్వరరావు గారు, మామిళ్ళపల్లి రామశాస్త్రి గారు, జాలెంనరసింహమూర్తి గారు, భమిడిపాటి వెంకటరత్నం గారు అడ్వకేట్ల్ గా వచ్చారు. శ్రీ కామేశ్వరరావు గారు ఆయన 1983లో గతించేవరుకు లీడింగ్ లాయర్‌గా వ్యవహరించారు. ఈయన రాజకీయాలలో ప్రజాసేవలోను పాల్గొనేవారు. ఈయన కాలేజిరోజులనుంచి స్వాతంత్ర్యపోరాటకార్యక్రమాలలో పాల్గొనేవారు. ఈయన గొప్ప నటుడు కూడా.





చాణక్యనాటకంలో చాణక్యపాత్రలో దిట్ట ఏలూరు, బందర్ వంటి పట్టణాలలో న్యాయవాదిగా ఉండగానే ప్రదర్శనలు ఇచ్చి ఆ పాత్రకు ఆయనే సాటి అని నిరూపించుకొన్నారు. ఈయన రెండవ కుమార్తె డా॥ శేషగిరిరావు, కోడలు శారద న్యాయవాదిగా చేరారు. మూడవ కుమార్తె కామేశ్వరరావు గారు రాజోలులోను, నాల్గవకుమారుడు గోపాలకృష్ణ హైకోర్టులోను న్యాయవాదులుగా ఉన్నారు. శ్రీ మామిళ్ళపల్లి రామశాస్త్రి గారు బార్ అసోసియేషన్ కార్యదర్శిగా సుమారు పదిహేను సంవత్సరాలు పనిచేసి 1966లో కొత్తపేటకు మారారు. బార్‌అసోసియేషన్ క్లబ్‌స్థాపనకు, నిర్మాణానికి అత్యంత కృషిచేశారు. ఈయన బ్యాట్‌మెంటన్, టెన్నిస్ ఆటలు కూడా ఆడేవారు. శ్రీ అయ్యగారినరసింహమూర్తి గారు సుమారు 15 సం॥లు బార్ అసోసియేషన్ అధ్యక్షులుగా వ్యవహరిస్తూ 1966లో కొత్తపేటకు మారారు. ఈయనకు ఒకే ఒక కుమార్తె. అల్లుడు శ్రీ టి.హెచ్.బి.చలపతి రాజోలులో అడ్వకేట్‌గా ప్రాక్టీస్‌చేసి పంజాబ్, హార్యానా హైకోర్టు జడ్జిగా పనిచేశారు. నరసింహమూర్తిగారు చాలాకాలం రాజోలుశివాలయం,మరియు ఆంజనేయస్వామిఆలయాలకు ధర్మకర్తగా వ్యవహరించేవారు. ఈయన కూడా చిన్నతనంలో నాటకాలు వేసేవారు. ఇక జాలెంనరసింహమూర్తిగారు లీడింగ్ క్రిమినల్ లాయర్‌గా వ్యవహరిస్తూ వామపక్ష బావాలతో చురుకుగా రాజకీయాలలో కూడా పాల్గొనేవారు. ఈయన రాజోలు సబ్‌కోర్టుకు మొదటి పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా పనిచేసి ఆ తర్వాత 1973లో జిల్లా మున్సిఫ్ గా సెలక్ట్ అయి జిల్లా జడ్జిహోదాలో లేబర్ ట్రిబ్యునల్, సెంట్రల్‌అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ మెంబర్‌గా రిటైర్ అయి విశాఖలో సెటిల్ అయి అకాలమరణం పొందారు. ఈయన సౌమ్యుడు, మంచిస్నేహితుడు. రాజోలులో మొదటి హరిజనన్యాయవాది. అందరి న్యాయవాదులతో కుటుంబసభ్యుని వలె కల్సిపోయేవారు. ఈయన కుమారులు, కుమార్తెలు కుటుంబాలతో డాక్టర్లుగా మంచిస్థితిలో ఉన్నారు. ఈయన 1964 నుండి 70వరుకు రాజోలు గ్రామపంచాయితీ మెంబర్‌గా, 1966 నుండి 1973వరకు బార్‌అసోసియేషన్ కార్యదర్శిగా కూడా పనిచేశారు.

1904నుండి 1959వరుకు క్రిమినల్‌కోర్టు (సబ్‌మెజిస్ట్రేట్) రెవిన్యూలో భాగంగా ఉండేది. అంటే సబ్‌మెజిస్ట్రేట్ నుండి తహశీల్దార్ గా ప్రమోషన్ పై వెళ్ళేవారు. 1959లో రాజ్యాంగంలోని ఆదేశికసూత్రాలు ప్రకారం ప్రభుత్వశాఖలునుండి న్యాయశాఖను విడదీయాలనే ఆదేశంప్రకారం మేజిస్ట్రేట్ కోర్టులను రెవిన్యూనుండి వేరుచేశారు. అప్పటినుంచి రాజోలులో రెండువతరగతి జుడిషియల్ మేజిస్ట్రేట్‌కోర్టు ఏర్పడింది. సబ్‌మెజిస్ట్రేట్ కోర్టులాగ ఇదికూడా తాలూకా ఆఫీసులోని భవనాలలోని దక్షిణవైపు విభాగంలోనే పనిచేసింది. 1911లో శేషాద్రిశాస్త్రి గారు 1930లో మాలెశేషయ్యనాయుడు

గారు సబ్‌మెజిస్ట్రేట్‌గా పనిచేశారు. 1953లో ఈ క్రిమినల్ కోర్టులో శ్రీ వాడ్రేవుసుబ్రహ్మణ్యం గారు జాలెం నరసింహమూర్తిగారు కొండేపూడి వియన్నగారు కస్తూరి రామబ్రహ్మంగారు ప్రాక్టీసుచేసేవారు. ఇక 1960తర్వాత పితాని సత్యనారాయణగారు, పొన్నాడహనుమంతరావు గారు టి.హెచ్.బి. చలపతి గార్లు, ఎర్రంశెట్టిహరినాథబాబుగార్లు బారకు వచ్చారు. చలపతిగారు 1964లో హైదారాబాద్ హైకోర్టుకు వెళ్ళి అక్కడనుంచి 1973లో జిల్లాజడ్జిగా నేరుగా సెలెక్ట్ అయి ఇటీవలనే పంజాబ్, హర్యానా హైకోర్టుజడ్జిగా రిటైర్ అయ్యారు. పితాని సత్యనారాయణ గారు అమలాపురం మారి అక్కడనుంచి డిస్ట్రిక్ట్ మున్సిఫ్ గా సెలక్ట్ అయ్యారు. శ్రీ భమిడిపాటి వెంకటరత్నం గారు నగరం నియోజకవర్గంనుంచి 1962లో అప్పటి జనసంఘ పార్టీ తరపున పోటీచేశారు. ఈయన తర్వాత తన ప్రాక్టీసును కొత్తపేటకు మార్చి అచ్చటనుంచి కాకినాడకు మారేరు. భారతం రామనారాయణరావు గారు కొద్దికాలం ప్రాక్టీసు చేసి ఎల్..ఐ.సి. ఆఫీసర్ గా వెళ్ళారు. అట్లే మోరికి చెందిన ముప్పర్తి పద్మనాభం గారు కూడా ప్రాక్టీసు చేసి తరువాత జుడిషియల్ సెకండ్‌క్లాస్ మేజిస్ట్రేట్ గా సెలక్ట్ అయి జిల్లా జడ్జిగా రిటైర్ అయి ప్రస్తుతం మోరిలో ఉన్నారు.

ఇక ఆ తరం న్యాయవాదులు వాడ్రేవు పాపయ్యగారు, కొమ్ముల సత్యనారాయణ గారు, చిన్నకోటిబాపిరాజు గారు, దేశరాజు రామచంద్రరావు గారు తమ వృత్తిబావుటాలను ఎగరవేసి 1970-85వరకు కొనసాగేరు. వాడ్రేవు పాపయ్యగారు రాజోలులో కోర్టు పెట్టినప్పటినుండి 1977లో ఆయన స్వర్గస్తులు అయ్యేవరకు సుమారు 56సం॥ల అవిచ్ఛిన్నంగా వృత్తియే పరమావధిగా ఫస్ట్ గ్రేడ్ ప్లీడర్ గా ప్రాక్టీస్ చేశారు. వారి కుమారుడు శ్రీ వాడ్రేవు సుబ్రహ్మణ్యం గారు, మనుమలు వాడ్రేవు పాపయ్యపంతులు గారు, వృత్తిలో ప్రముఖన్యాయవాదిగా కొనసాగుతున్నారు. శ్రీ పాపయ్యగారు 1966 నుండి 1970వరకు కొత్తపేటలో కూడా ప్రాక్టీస్ చేశారు. 1969లో జరిగిన బార్ అసోసియేషన్ స్వర్ణోత్సాలలో వారికి, కొమ్ముల సత్యనారాయణగార్కి 50సం॥లు వృత్తి పూర్తిచేసినందుకు సత్కారం జరిగింది. పాపయ్యగారుమంచి క్రీడాకారుడు కూడా టెన్నీస్‌లో మంచిదిట్ట. ఇక కొమ్ములసత్యనారాయణ గారు గొప్పన్యాయవాది. ఈయన మంచి ఉపన్యాసకుడు,సంస్కృతపండితుడు, విద్యావేత్త. ఈయన చక్కని కథలతో కోర్టుహాలులో జడ్జీగారు బెంచికి వచ్చేముందు న్యాయవాదులందరికి మంచి కాలక్షేపం ఇచ్చేవారు. ఈయన 1985లో స్వర్గస్తులు అయ్యేవరకు గుఱ్ఱపుబండిని మెయిన్‌టైన్ చేసేవారు. ఈయన కొద్దికాలం బార్ అసోసియేషన్ అధ్యక్షుడిగా వ్యవహరించేవారు. ఈయన కోర్టులలో ఎసర్టీప్‌గాను, మంచిహుందాతనంతోను వ్యవహరించారు. ఈయన రెండవకుమారుడు డా॥ కె.టి.రాజారావు గారు. మూడవ కుమారుడు చక్రపాణి సబ్‌జడ్జిగా పనిచేసి రిటైర్





అయ్యారు. ఈ చక్రపాణిగారి కుమార్తె కొమ్ముల విజయలక్ష్మి రాజోలులో న్యాయవాదిగా చేరి ఆ తర్వాత ప్రస్తుతం కడియంశాసనసభ్యులు జక్కంపూడి రామమోహన్ రావు గారిని వివాహం చేసుకొని రాజమండ్రిలో ప్రాక్టీస చేస్తూ రాష్ట్రకాంగ్రెసజాయింట్ కార్యదర్శిగ్గాను ఇతరత్రాను రాజకీయాలో చురుకుగా పాల్గొంటూ ఉన్నారు.

ముందు వ్రాసినట్టిగా రాజోలు డిస్ట్రిక్ మున్సిఫ్ కోర్టులో కొత్తపేట తాలూకా చేరి ఉండేది. సివిల్‌వ్యాజ్యాల కొరకు బొబ్బర్లంక నుండి రాజోలు వచ్చేవారు. రాత్రి మకాం ఉండి హోటళ్ళలో భోజనం చేస్తూ కోర్టువ్యవహరాలు పూర్తిచేసేవారు. 1966లో అప్పటి న్యాయశాఖమంత్రి శ్రీ పి.వి.నరసింహరావుగారు తెలంగాణా ప్రాంతంతో సమానంగా ప్రతీ తాలూకాకు ఒక ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్, మున్సిఫ్ కూడా ఉండాలనే పోలసీ అమలుపర్చడంతో కొత్తపేట మున్సిఫ్-మెజిస్ట్రేట్ కోర్టు ఆతాలూకాకు వేరే ఏర్పడింది. రాజోలులో 2వతరగతి జుడిషియల్ మెజిస్ట్రేట్‌కోర్టు రద్దయింది. సివిలు, క్రిమినల్ కలిపి మున్సిఫ్-మేజిస్ట్రేట్ కోర్టు ఏర్పడింది. అది సివిలుకోర్టు భవనంలో ఏర్పడి తాలూకా ఆఫీసు మేజిస్ట్రేట్ కోర్టుభవనం ఖాళీఅయింది. 1966 తర్వాత అడబాలరామకృష్ణారావుగారు, శ్రీ మైలవరపుశీతారామయ్యగారు అంతకుముందు నున్నసత్యరామారావు గారు అడ్వకేట్సుగా చేరారు. అడబాల రామకృష్ణారావు గారు కొద్దికాలం పబ్లిక్‌ప్రాసిక్యూటర్ గా వ్యవహరించారు. ఈయన కూడా చురుకుగా రాజకీయాలలో పాల్గొన్నారు. నున్నసత్యరామారావు గారు రాష్ట్రఎక్సైజ్‌శాఖలలో అసిస్టెంట్‌సూపరింటెంటుగా సెలక్ట్ అయ్యి ఈ మధ్యనే డిప్యూటికమీషనరుగా రిటైరు అయ్యారు. ఇక పొన్నాడహనుమంతరావు రాజోలు పంచాయితీసభ్యుని గా (1964-70), ఉపసర్పంచిగా (1970-75) సర్పంచిగా (1975-88) పనిచేశారు. రాజోలు కళాశాలలో మల్కిపురం కళాశాలలోను వ్యాపారన్యాయశాస్త్ర పార్ట్‌టైమ్ టీచర్‌గా 1971 మరియు 1974 లనుండి పనిచేస్తున్నారు. 1985 లో రాజోలు అసెంబ్లీస్థానానికి కాంగ్రేసు అభ్యర్థిగా పోటీచేశారు. 1996 నుండి 1984 వరుకు బార్‌అసోసియేషన్ కార్యదర్శిగా, 1984 నుండి 1990 వరుకు తిరిగి 1992 నుండి 94 వరుకు మళ్ళీ 1999నుండి బార్‌అసోసియేషన్ అధ్యక్షులుగా వ్యవహరించారు. 1971లో లలితకళాసమితి స్థాపక కార్యదర్శి గా, అతర్వాత కోశాధికారిగా పనిచేస్తున్నారు. సాహితీస్రవంతి అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. 1974 నుండి 1980 వరుకు పబ్లిక్‌ప్రాసిక్యూటర్‌గా వ్యవహరించారు.

సివిలు వ్యవహారాలకు మున్సిఫ్‌కోర్టుకు మొదట్లో 5000 రూ॥లు అతర్వాత 10,000 రూ॥లు విలువగల వ్యాజ్యాలకు మాత్రమే అవకాశం ఉన్నది. ఆపైన కోనసీమ అంతటికి అమలాపురం లోని సబ్‌కోర్టుకు వెళ్ళవలసివచ్చేది. అట్లే హత్యకేసు తప్ప మిగతా అన్నిపెద్ద

క్రిమినల్‌కేసులు కూడ ఈ సబ్‌కోర్టులోనే జరపాలి. క్రిమినలుకు సంబంధించి అసిస్టెంటు సెషన్సు కోర్టు అని వ్యవహరిస్తారు. అమలాపురం సబ్‌కోర్టులో పనిభారం ఎక్కువ అవడంతో 1966లో అక్కడ అదనపు సబ్‌కోర్టుపెట్టాలనే ప్రతిపాదన వచ్చింది. ఈ విషయం అప్పటి వర్కురాజోలులో న్యాయవాదిగా ఉండి తర్వాత కొత్తపేటకు మారిన మామిళ్ళపల్లి రామశాస్త్రి గార్కి తెలిసి అక్కడ అదనపుసబ్‌కోర్టుపెట్టడానికి బదులు రాజోలు, కొత్తపేటలకు కలిపి రాజోలులో సబ్‌కోర్టుపెట్టడానికి ప్రయత్నిస్తే మంచిదని రాజోలుబార్‌అసోసియేషనకు సలహా యిచ్చి ఇందుకు ఒక విత్తనం నాటారు. ఇక అప్పటి నుంచి ప్రయత్నం ప్రారంభంఅయింది. 1967 గుడిమూల వాస్తవ్యులు రుద్రరాజురామలింగరాజుగారు రాష్ట్రప్రభుత్వంలో మంత్రిగా చేరడంతో ఈ సబ్‌కోర్టు ప్రతిపాదనకు మంచి ఊపువచ్చింది. అయితే ఈ ప్రతిపాదన గ్రహించిన అమలాపురం బార్‌వారు సహజంగా ఆటంకాలు కలిగించడం ప్రారంభించారు. ఎంతోమంది మంత్రులను రాజోలు రప్పించి సబ్‌కోర్టు అవశ్యకత గురించి రాజోలు బార్ వారు వివరించేవారు. అయితే అప్పటి న్యాయశాఖామంత్రి పి.వి. నరసింహరావును కూడా బార్‌అసోసియేషన్‌కు పిలిపించడం జరిగింది. ఆ సందర్భంలో ఆయనతో బార్ అసోసియేషన్ సీనియర్స్ అయిన వెంపరాల కామేశ్వరరావుగారు, విన్నకోటబాపిరాజు గార్లకు వాగ్వివాదము కూడా జరిగింది. దానితో ఈ ప్రయత్నానికి కొంత గండిపడింది. అయితే ప్రయత్నాల మాత్రం కొనసాగాయి కామేశ్వరరావు గారు, బాపిరాజుగారు, వాడ్రేవుసుబ్రహ్మణ్యం గారు, పొన్నాడ హనుమంతరావు ఈ సందర్భంలో అనేక సార్లు హైదరాబాదుకు తిరిగారు. చివరకు 1970వ సం॥లో అప్పటి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారు, హైదరాబాదు నగరంలోని ఒక నియోజకవర్గంలోని తెలంగాణా ప్రజాసమితి ఒక రాజకీయపార్టీ గా ఏర్పడి మొదటిసారిగా ప్రత్యేకతెలంగాణా సాధన ఆశయం కలిగి ఒక బై ఎలక్షను లో పోలాబిజీగా ఉన్న సందర్భంలో దేవాదాయశాఖామంత్రి రుద్రరాజురామలింగరాజుగారు వాడ్రేవుసుబ్రహ్మణ్యం గారు, పొన్నాడ హనుమంతరావు గారలను ముఖ్యమంత్రిగారింటికి తీసుకువెళ్ళి సబ్‌కోర్టు స్థాపన అవసరాన్ని నొక్కిచెప్పి అక్కడికక్కడే శాంక్షన్ చేయించారు. జూన్‌నెలలో జీ.ఓ. జారీచేశారు. వెంటనే అమలాపురం బార్‌అసోసియేషన్‌ను వారు రాజోలు సబ్‌కోర్టు స్థాపించడం చెల్లదని 1970 జూలైనెలలో హైకోర్టులో రిట్ దాఖలు చేశారు. రాజోలు సీనియరున్యాయవాదులు హైదరాబాదు వెళ్ళి అక్కడి న్యాయవాదులను నియమించి వాదనలు చేయించారు. చివరకు 1970 సెప్టెంబరులో అప్పటి హైకోర్టున్యాయమూర్తి గౌ॥ తోట లక్ష్మయ్యగారు సదరు రిట్‌ను కొట్టివేయడంతో రాజోలు సబ్‌కోర్టుకు స్థాపన సుగమం అయ్యింది. అంతకుముందు, ఆతరువాత నోటిఫికేషను జారీచేయడంతో ప్రభుత్వం, హైకోర్టు మధ్య కొన్ని పరిపాలనసంబంధమైన చిక్కులు ఏర్పడ్డాయి. శ్రీ వాడ్రేవు





సుబ్రహ్మణ్యం గారు, శ్రీ పొన్నాడహనుమంతరావుగారు, అక్కడే 18రోజులు మకాంచేసి సెక్రటేరియట్, హైకోర్టులకు మధ్యతిరిగి సమస్యలు తీర్చడానికిప్రయత్నించి సాధించారు. అప్పటి మంత్రిరామలింగరాజుగారు ప్రభుత్వ పరంగాను అప్పటి హైకోర్టుజడ్జి వల్లూరి పార్థసారథి గారు హైకోర్టుపరంగాను, ఈ పరిపాలనపరమైన చిక్కులుతీయడానికి ఎంతో సహకరించారు. స్వర్గీయ పార్థసారధి గారు రాజోల్కు అత్యంతసన్నిహితులు ఈయన రాజోలు గోదావరి అవతల పశ్చిమగోదావరి వల్లూరువాస్తవ్యులు. ఈయన రాజోలు హైస్కూలు విద్యార్థి అనికూడా చెబుతారు. ఈయన స్వర్గీయ వాడ్రేవుపాపయ్యగార్కి అత్యంతసన్నిహితులు. ఈయన సహకారం మరువరానిది. అట్లే రాజోలుకు చెందిన హైకోర్టు న్యాయవాదులు ప్రయాగనార్యారావుగారు, టి.హెచ్.బి. చలపతిగారు ఎంతో సహకరించారు.

చివరకు 1970 వ సం॥ అక్టోబరు 17వ తేదిన రాజోలులో సబ్‌కోర్టు ప్రారంభింపబడింది. 1966లో రద్దుచేయబడిన రెండవతరగతి మెజిస్ట్రేట్ కోర్టు లోగడ ఉండే తాలూకా ఆఫీసు దక్షిణభాగం లోని భవనంలో సబ్‌కోర్టు ప్రారంభింపబడింది. జిల్లాలో రాజమండ్రి, కాకినాడ, అమలాపురం తరువాత రాజోలులో సబ్‌కోర్టు నాల్గవది. సయ్యద్‌హస్సన్ అనే సబ్‌జడ్జి మొదటిజడ్జిగా వచ్చారు. ఆరోజు మధ్యాహ్నం 3గం॥లకు అప్పటి హైకోర్టున్యాయమూర్తి కె.మాధవరెడ్డిగారు ఈ సబ్‌కోర్టును జ్యోతివెలిగించి ప్రారంభించారు. అప్పటి మరోన్యాయమూర్తి వల్లూరి పార్థసారథిగారు కూడా పాల్గొన్నారు. వీరితోపాటు మంత్రి రుద్రరాజురామలింగరాజుగారు, అప్పటిజిల్లాన్యాయమూర్తి శ్రీరాములుగారు కూడా పాల్గొన్నారు. వీరిని బార్‌అసోసియేషనను నుంచి తాలూకా ఆఫీసులోని నూతన కోర్టుప్రారంభించే భవనం వరకు బ్యాండ్‌మేళంతో ఊరిగింపుగా తీసుకువచ్చారు. కోర్టు ప్రారంభమయిన తరువాత జరిగిన సభకు జిల్లాజడ్జి అధ్యక్షతవహించారు. ముఖ్య అతిథులుగా జస్టిస్ మాధవరెడ్డి, జస్టిస్ పార్థసారధి, మంత్రిరామలింగరాజు గారు పాల్గొన్నారు. అప్పటి న్యాయశాఖమంత్రి టి.వి. రాఘవులుగారు కూడ ఆహ్వానింపబడ్డారు కాని ఆయన ఆఖరిక్షణంలో రావడానికి కుదరలేదు. బార్‌అసోసియేషను తరపున అధ్యక్షులు శ్రీ వాడ్రేవు సుబ్రహ్మణ్యం స్వాగతం చెప్పారు. ఎంతోమంది అభినందించారు. అమలాపురం బార్ వారు సబ్‌కోర్టుపై రిట్ దాఖలు చేసినప్పటికీ అప్పటి ఆ బార్ అధ్యక్షులు నల్లారెడ్డినాయుడు గారు (మాజీ యం.పి) సభలో పాల్గొని ఎంతోహుందాతనంగా వారి బార్‌తరపున అభినందనలు తెలిపారు. కార్యదర్శి పొన్నాడహనుమంతరావు వందనసమర్పణ చేశారు. ఆ రాత్రి బాలుర హైస్కూలులో బార్ వారిచే పెద్దవిందు ఏర్పాటుచేయబడింది. అప్పుడే క్రొత్తగా న్యాయవాదిగా చేరిన శ్రీవాడ్రేవుపాపయ్యపంతులు గారు ఈ విందుకు అధ్వర్యం వహించి

చక్కని ఏర్పాట్లుచేశారు.

సబ్‌కోర్టు ప్రారంభం అయ్యాక అంతవరకు నర్సాపురం లో ప్రాక్టీసు చేస్తున్న రాజోలు వాస్తవ్యులు ధరణీప్రగడ శ్రీరామారావు గారు రాజోలుకు తన ప్రాక్టీసు మార్చారు. అమలాపురం నుంచి అక్కడి ప్రముఖ లాయరుపాలగుమ్మి సూర్యారావు గారి ప్రతినిధిగా శ్రీ వై.వి. రామకృష్ణకూడ ప్రాక్టీసు ప్రారంభించారు. శ్రీ రామారావు గారు కొంతకాలం గవర్నమెంటుప్లీడరుగా వ్యవహరించారు. శ్రీ వై.వి. రామకృష్ణగారు చాలాచురుకుగా వృత్తి చూస్తూ 1976లో మున్సిఫ్‌మేజస్ట్రేటుగా ఎంపికై అనేక పదవులు నిర్వహిస్తూ ప్రస్తుతం శ్రీకాకుళం జిల్లాజడ్జిగా వ్యవహరిస్తున్నారు. ఆయన క్రీడాకారుడు, కళాకారుడు కూడ. రాజోలులో బార్‌తరపున నాటకాలు కూడ వేసేవారు. ఇక సబ్‌కోర్టు లో సివిలుదావాలలో సీనియరు కామేశ్వరరావుగారు, విన్నకోటబాపిరాజుగారు, వాడ్రేవుసుబ్రహ్మణంగారు, లీడింగు ప్రాక్టీషనర్లుగా ఉన్నారు. విన్నకోటబాపిరాజుగారు 1937 నుంచి మొదటి అడ్వకేటుగా ప్రాక్టీసుచేస్తూ మహామేధావిగా పేరుగాంచారు. ఆయన న్యాయశాస్త్రంలో దిట్ట. మద్రాసు ఉమ్మడిరాష్ట్రంలో రెవిన్యూబిల్లులు, డ్రాఫ్టుకూడ తయారుచేసి అప్పటి రెవిన్యూమంత్రి కళావెంకట్రావుగార్కి సలహాయిచ్చేవారని చెబుతారు. ఆయన మద్రాసులో గాని, హైదరాబాదులో గాని హైకోర్టులో ప్రాక్టీసుచేస్తే సుప్రీంకోర్టుజడ్జిగా ఎదిగివుండేవారని వారితో పరిచయంఉన్న వారంతా చెబుతారు. 1981 జనవరిలో ఆయన సబ్‌కోర్టులో సాక్షిని క్రాస్‌ఎగ్జామిన్ చేస్తూ తన 70ఏట ఆ కోర్టులోనే గుండెపోటుతో అక్కడిక్కడే తుదిశ్వాసవిడిచారు. అంతకు కొద్దికాలం ముందరే ప్రాక్టీసులో చేరిన వారి కుమారుగు లక్ష్మిపతి ప్రస్తుతం ప్రాక్టీసు చేస్తూన్నారు. అల్లే వి.కామేశ్వరరావుగారు కూడా 1975నుండి చురుకుగా ప్రాక్టీసుచేస్తున్నారు.

ఇక 1980 తరువాత అనేకమంది యువన్యాయవ్యాదులు బార్‌లో చేరారు. శ్రీ చెల్లింగి త్రిమూర్తులు, శ్రీ దొమ్మేటి సత్యనారాయణ, శ్రీ పి.వి. కృష్ణంరాజు, గొల్లమందల రమేష్ గారులే కాకుండా తొలిమహిళాన్యాయవాదిలుగా శ్రీమతి జి.భవాని, శ్రీమతి వి. శారద ఆతరువాత కొమ్ముల విజయలక్ష్మి మరియు భారతలక్ష్మి వృత్తిచేబట్టారు. వీరిలో దొమ్మేటిసత్యనారాయణ, జి.రమేష్‌లు ఏ.పి.పి.లుగాను, భవాని మరియు భారతలక్ష్మిలు మున్సిఫ్‌మెజిస్ట్రేట్ గాను సెలక్టు అయి జుడిషియల్ సర్వీసులోచేరారు. అంతకుముందు 1970 దశకంలో ప్రాక్టీసు చేసిన టి. భాస్కరరావు కూడా జ్యుడిషయల్ సర్వీసులో చేరారు. వీరంతా ఇంకా సర్వీసులో ఉన్నారు. చెల్లింగి త్రిమూర్తులు 6 సం॥లు గవర్నమెంటు ప్లీడరుగా వ్యవహరించారు. శ్రీ పి.వి. కృష్ణంరాజుగారు గవర్నమెంటు ప్లీడరుగా మరియు ప్రముఖన్యాయవాదిగా ఉన్నారు.





ఇక 1987-88 తరువాత న్యాయవాదుల సంఖ్య రాజోలులో బాగానే పెరిగింది. 1980 వ సం॥లో రాజోలు సబ్‌కోర్టు పర్మినెంటు కావడంతో ప్రస్తుత స్వంతభవనాలకు మారింది. మున్సిఫ్‌కోర్టు తాలూకా ఆఫీసులోని భవనంలోకి మారింది. మున్సిఫ్ కోర్టులో పని ఒత్తిడి పెరగడంతో 1983 లో అదనపు జుడిషియల్ మెజిస్ట్రేట్‌కోర్టు ఏర్పడింది. కోర్టు కాంపౌండులోని పాతభవనాలలోనే ఈ కోర్టును అప్పటి హైకోర్టున్యాయమూర్తి వి.మాధవరావుగారు ప్రారంభించారు. శ్రీ వి. అప్పలనరశింహంగారు మొట్టమొదటి అదనపు మెజిస్ట్రేటుగా ఛార్జి తీసుకొన్నారు.

రాజోలుబార్‌అసోసియేషన్‌ను అనేకమంది న్యాయమూర్తులు, ప్రధానన్యాయమూర్తులు కూడ సందర్శించారు. 1964 లో జస్టిస్ చంద్రశేఖరశాస్త్రి, వల్లూరి వెంకటపార్థ రాజోలు బార్‌కు వచ్చారు. ఆ తరువాత 1979లో అప్పటి హైకోర్టు ప్రధానన్యాయమూర్తి అవులసాంబశివరావు గారు అంతర్వేది వచ్చినప్పుడుబార్ వారికి స్వాగతకార్యక్రమం అక్కడే ఏర్పర్చారు. ఆతరువాత హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఒబుల్‌రెడ్డి గోండయ్య గారు (1979), ప్రధానన్యాయమూర్తి పి.చెన్నకేశవరెడ్డి 1980లోను, ప్రధానన్యాయమూర్తి కె.మాధవరెడ్డి 1983లోను బార్‌అసోసియేషను సందర్శించారు. 1986లో కోదండరామయ్యగారు 1989లో అప్పటి హైకోర్టుజడ్జి మామిడన్న జగన్నాదరావు గారు, 1990లో జస్టిస్ శివరామన్ నాయర్, 1997లో జస్టిస్‌పర్వతరావు రాజోలుబార్‌అసోసియేషన్ సందర్శించారు. సుప్రీంకోర్టుజడ్జి రామస్వామి గారు కూడ 1990లో రాజోలు సందర్శించారు. రాజోలులో ప్రాక్టీసు చేసిన తల్లాప్రగడచలపతి గారికి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జడ్జి అయిన సందర్భంలో 1994లో రాజోలుబార్‌అసోసియేషను వారు సన్మానించారు.

ఇక 1990 నుండి రాజోలులో న్యాయవాదుల సంఖ్య గణనీయంగా పెరిగింది. ప్రస్తుతం సుమారు 75మంది న్యాయవాదులు ఉన్నారు. రిటైర్డ్ సబ్‌జడ్జి సి.హరనాథ్‌గారు కూడ బార్ సభ్యులు అయ్యారు. ఇక 1990నుండి 97నాటికి పి.సూర్యారావు, శ్రీమతి యం.వి. సూర్యకాంతం, యం.శ్రీనివాస్‌రావు, ఆర్.ఎస్.స్వామి, కుమారి ఎస్.విశాలక్ష్మి, శ్రీ యం.ఏ. వేమా, కె.సుధాకర్, ఏ.డి. ప్రభాకర్‌రావు, యం.సత్యనారాయణమూర్తి, యం.శీతారామమూర్తి, డి. శ్రీనివాస్, యం. రవిరామ్, యం.వి.ఎస్.కె.ఎల్.ఎస్. మూర్తి, ఆర్. రమాశంకరరావు, యం. భాగ్యలక్ష్మి, బి.కన్నయ్య, వై. రమేష్, వై.ఎస్.ఎస్.ఏ. నాయుడు, డి. రామమొహనరావు, రాజారత్నం, బి. సతీష్‌కుమర్, ఎన్. శ్రీనివాస్, ఎస్.వెంకటేశ్వర్లు, బి.ప్రకాశరావు, శ్రీ జె.వి. భాస్కరరావు, యం.సువర్ణరాజు, యం.శివరామకృష్ణ,

డి.నారాయణమూర్తి, కె.శేషగిరి రావు, ఏ.భాస్కరరావు, బి.సూరిబాబు, వి.యస్. మల్లపరావు, కె.బుచ్చిబాబు, పి.వి. రామకృష్ణ, శ్రీమతి పి. జలజ, బత్తులరాము, బి.ఎస్. కుమార్, కె.పాండురాజు, శ్రీమతి జ్యోతి, యం. సాయిబాబు, శ్రీమతి శేషారత్నం, బి.పెద్దరాజులు కూడా న్యాయవాదులుగా చేరారు. వీరిలో సువర్ణరాజు మున్సిఫ్ మేజిస్ట్రేట్‌గా సెలక్ట్‌అయ్యారు. శ్రీ రాజరత్నం, ఏ.పి.పిగా సెలక్ట్‌అయ్యారు. ఎస్.విశాలక్ష్మి గారు స్టేట్స్‌లో ప్రాక్టీస్‌చేస్తున్నారు. యం.వి. శివరామకృష్ణ రాజోలు రోటరీక్లబ్ అధ్యక్షులుగా, నారాయణమూర్తి మలికిపురం రోటరీఅధ్యక్షులుగా పనిచేశారు. మల్లపురావుగారు మహిళాజూనియర్ కాలేజిని నడపటంలో ప్రముఖపాత్ర వహిస్తున్నారు. ఇక శ్రీ యం.ఏ. వేమాగారు నగరం నియోజకవర్గంనుంచి బి.జె.పి. తరపున యం.ఎల్.ఏ గా 1999లో పోటీచేసి గెలుపొంది రాజోలు వాస్తవ్యులు బార్ సభ్యులుగానున్న మొదటిశాసనసభ్యులు అయ్యారు. వాడ్రేవు పాపయ్య పంతులుగారు, వి. కామేశ్వరరావు గారు, శ్రీమతి ప్రయాగ జలజ నోటరీలుగా వ్యవహరిస్తున్నారు.

**ఇకరాజోలులో పనిచేసిన కొంతమంది న్యాయాధికారుల వివరాలు**

**మున్సిఫ్ కోర్టు (1940 నుండి) : డిస్ట్రిక్టు మున్సిఫ్:** యల్లాప్రగడ సత్యనారాయణ (ఈయనసోదరుడు డా॥యల్లాప్రగడ సుబ్బారావు యునైటెడ్‌స్టేట్స్‌లో సెటిల్ అయి స్టెప్టోమైసిన్‌ను కనుగొన్నారు.)

రాఘవయ్యచౌదరి (1947 నుంచి 49), జి.ఎస్.శాస్త్రి (1950), సుబ్రహ్మణ్యచౌదరి (1951 నుంచి1953), సి.గురుమూర్తి (1953 నుంచి56), ఆంజనేయురాజు (1957), గోపాలచార్యులు (1957నుంచి59),హీరామాన్‌సింగ్ (19959-61) కమాలుద్దీన్ (1961నుంచి63), డి. రామలింగస్వామి (1963 నుంచి 66).

**మున్సిఫ్ మెజిస్రేట్లు :** వై. శ్రీహరిరావు (1966నుంచి68), మిర్జాగోసబేగ్ (1968 నుంచి69), బి.వి. నరశింహం (1969నుంచి70), టి. శ్రీధరఅయ్యర్ (1970 నుంచి74), పి. చిదంబరస్వామి (1974 నుంచి 77), ఏ. భవానిప్రసాద్ (1977 నుంచి 1979), రమణమూర్తి (1979), ఏ.శ్యామసుందర్ (1979నుంచి 80), జి.రామారావు (1981 నుంచి82) .

**ప్రిన్సిపల్ మున్సిఫ్స్:** జగన్నాధరావు (1982నుంచి83), బి. కృష్ణమూర్తి (1983నుంచి84) ఏ. అప్పలనరశింహం (1984నుంచి86), కేదారాచారి (1986నుంచి89), శ్రీనివాసులు (1989), జగన్మోహనరావు (1989నుంచి93), వెంకటేశ్వరరావు





(1993నుంచి96), సంగమేశ్వరరావు (1995నుంచి 96), వేణుగోపాలరావు (1996నుంచి99), నాగేంద్రరాజుంలు (1999).

**అడిషనల్ మున్సిఫ్ మేజిస్ట్రేట్‌లు :** 1). వి. అప్పలనరశింహం (1983నుంచి84), , 2). ప్రకాశరరావు (1984నుంచి87), 3). ప్రభాకరరావు (1987నుంచి 88), 4). వాసుదేవరావు (1989నుంచి92), 5).ప్రభాకరరావు (1992నుంచి94), 6). సువర్ణరాజు (1997నుంచి98), 8). శివకుమార్ (1999). 1959లో పరిపాలనశాఖనుండి న్యాయశాఖ విడదీసిన తరువాత 1). ప్రయాగ కృష్ణమూర్తి (1959నుంచి62), 2). బి. రామ్మూర్తి (62నుంచి63), ఆర్.ఎన్. శాస్త్రో (63నుంచి66) గారలు జుడిషియల్ సెకండుక్లాస్ మెజిస్ట్రేట్లుగా పనిచేశారు.

**సబ్‌జడ్జిలు :** 1). సయ్యద్ అహ్మద్‌హుస్సేన్ (17-10-70 నుంచి 30-4-71), 2). వై.వి. నరసింహరావు (1-5-71 నుంచి జూలై 72), 3). సి. ముధిరాజ్ (7-8-72 నుంచి 30-11-73), 4). ఆర్ జగన్నాధరావు (1-12-73 నుంచి ఏప్రిల్1976), 5). డి. రామలింగస్వామి (మే 76నుంచి డిసెంబర్1976), 6).యం.వృషేశ్వరరావు (25-12-76 సీతారామశాస్త్రి (మే 1980నుంచి మే 1982), 9). యం.ఎస్. రామారావు ( మే1982నుంచి మే 1985), 10). సి. వాసుదేవరావు (మే 1985 నుంచి మే 1986), 11). పాండురంగారావు ( మే 1986 నుంచి మార్చి 1989), 12). ఖాదర్ మొహిద్దీన్ (మార్చి 1989 నుంచి డిసెంబర్ 1989), 13). కె.కృష్ణారావు (డిసెంబర్ 1989 నుంచి 31-12-91), 14). జి. చినసాంబారయ్య (24-1-92 నుంచి మే 1995), 15). ఎస్. సన్యాసిరావు ( మే 1995నుంచి అగష్టు95), 16). పి. రమేష్‌బాబు (అగష్టు 95 నుంచి మే 98), 17). టి. ఆనంద్ (21-9-98 నుంచి 3-5-99), 18). ఎస్. రమేష్ (7-5-99).

**లా ఆఫీసర్స్ :** ఏ.పి.పి.లుగా (లోగడ పనిచేసిన కొందరు) 1). పాలెపు బ్రహ్మానందం (అమలాపురం నుంచి), 2). అసదుల్లా సయీద్, 3). హుస్సేన్, 4). మదార్సా 5). కె.వి. సత్యనారాయణ గారు, మరియు కె.వి. గోపాలరావు రాజోలు మొదటి ఏ.పి.పి. రాజమన్నార్.

**అడిషనల్ పి.పి.లు. :** 1). జాలెంనరశింహమూర్తి గారు (1972), 2). పొన్నాడ హనుమంతరావు (1974 నుంచి 80), 3). వాడ్రేవు సుబ్రహ్మణ్యం గారు (1980 నుంచి86), వై.హరినాధబాబుగారు (1987-90, 95-98), 4). ఏ. రామకృష్ణారావు (1990 నుంచి 94), 5). సూర్యారావు (1998).

**ప్రభుత్వ ప్లీడర్స్ కొంతమంది** : దేబియ్యం బుచ్చి అబ్బాయిశర్మగారు, భమిడిపాటి సత్యనారాయణ గారు, వి.వి.యస్ కామేశ్వరరావుగారు, వాడ్రేవు సుబ్రహ్మణ్యం గారు, వాడ్రేవు పాపాయ్య పంతులు గారు. ధరణీ ప్రగడశ్రీరామారావు గారు, వి.కామేశ్వరరావు, పి.వి. కృష్ణంరాజుగారు, సి.హెచ్. త్రిమూర్తులు గారు.

**నూతన న్యాయవాదుల** (1995తరువాత) : 1). ధర్మపాల్, 2). ఎడ్విన్‌మైకేల్, 3). హరిబాబు, 4). హిరాంసాగర్, 5). ఇందిరాప్రియదర్శిని, 6). మహాలక్ష్మి, 7). నాగరాజు, 8). పద్మారావు, 9). పాండురంగారావు, 10). పెద్దిరాజు, 11). రాజబాబు, 12). రాజశేఖర్, 13). రామ్‌కుమార్, 14). శంకర్ వగైరాలు.

## బార్ అసోసియేషను రిక్రియేషను క్లబ్

రాజోలు కోర్టులో 1928 నుండి న్యాయవాదులు, న్యాయాధికారులు టెన్నిస ఆడేవారు. ఆ కోర్టు ఆవరణలో సిమ్మెంటుకోర్టు ఉండేది. 1953లో సిమ్మెంటుకోర్టు తీసివేసి గ్రావెల్‌కోర్టువేశారు. ఆ తరువాత బార్‌అసోసియేషన ఆధ్వర్యంలో బార్ క్లబ్ ఏర్పడాలని నిర్ణయించారు. కోర్టు ఆవరణలో 21సెంట్లు భూమిని రెవిన్యూవారు బార్‌అసోసియేషనకు 99 సం॥లు కౌల్కు యిచ్చారు. అందులో కొంతమంది ప్రముఖులను జీవితకాలసభ్యులుగా చేర్చుకొని 1958లో అప్పటి రాష్ట్ర న్యాయశాఖమంత్రి గ్రంధి వెంకటరెడ్డి నాయుడు గారిచే ఈ క్లబ్ భవనాన్ని ప్రారంభించారు. ఈ క్లబ్ బార్‌వారి ఆధీనంలో ఉంటుంది. స్థానిక అధికారులు, జీవితసభ్యులు మాత్రమే సభ్యులు కాగలరు. బార్‌అసోసియేషను అధ్యక్షులు, కార్యదర్శిలే ఈక్లబ్‌కు కూడా ఆధిపత్యంవహిస్తారు. టెన్నిసు, టేబుల్‌టెన్నిస, చదరంగం, కార్డ్స్, షటిల్, మొ॥ ఏక్టవిటీస్ ఉండేవి. పెదపట్నం అగ్రహారం శాస్త్రుల్యు శ్రీ బోళ్ళ విశ్వనాధంగారు టి.టి.బల్లవిరాళంగా యిచ్చారు. అది ఇప్పటికీఉంది. అనేక నిర్ణయాలు ఇక్కడేచేయబడ్డాయి. గవర్నమెంటు హాస్పిటలు డాక్టర్లు, కొబ్బరిపరిశోధన కేంద్రఅధికారులు, సెంట్రల్‌ఎక్సైజ్ అధికారులు, బ్యాంక్‌ఉద్యోగులు, పంచాయితీసమితిఉద్యోగులు ఈక్లబ్ ఏక్టవిటీస్‌లో చురుకుగా పాల్గొనేవారు. ఈ క్లబ్‌స్థాపించడానికి అప్పటి డిస్ట్రిక్ట్‌మున్సిఫ జి.ఎల్.రెడ్డి, అప్పటిబార్‌కార్యదర్శి యం.రామశాస్త్రి ఈభవన నిర్మాణానికి ఎంతో కృషిచేశారు. టెన్నిసుకోర్టు చాలా సందడిగా ఉండేది. 1965లో అప్పటి డిస్ట్రిక్టుమున్సిఫ్ శ్రీ డి. రామలింగస్వామి, సెకండ్‌కాస్‌మెజిస్ట్రేట్, ఆర్.ఎన్. పాత్రోగారి చొరవతో టెన్నిసుకోర్టుకు ఫ్లడ్‌లైట్స్ వేయబడ్డాయి. ఇందుకుగాను రాజోలులో ఫిబ్రవరి 1965లోను కొత్తపేటలో మార్చిలోను సుబ్బలక్ష్మి సిస్టర్స్ వారిచే భరతనాట్యం ప్రదర్శన ద్వారాను, అమలాపురం శ్రీనివాస్ టాకీసులో సినిమా ప్రదర్శనల ద్వారాను ఆ





రోజుల్లో సుమారు 6000 రూ॥లు బెనిఫిట్ షోల్లో వసూలుచేసి 1965 సం॥ మే నెల 12వ తేదిన పాత్రోగారిచే ప్రారంభించబడ్డాయి. అప్పటి పూర్ణాపిక్చర్స్ అధినేత జి. కామరాజు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. జీవితసభ్యులైన వి. వేణుగోపాలరావు గారు, ఏడిద జోగిరావు ఇంకా ఎంతోమంది దీనికి సహకరించారు.

బార్‌అసోసియేషను ఆధ్వర్యంలో 1965లలో రాజోలులోను , కొత్తపేటలోను శ్రీ వి.వి.యస్. కామేశ్వరరావు గారు చాణుక్యగా నటించిన నాటకాన్ని ప్రదర్శించారు. బార్‌క్లబ్ ఆధ్వర్యంలో "పేటెంటు మందు" (1968) ప్రదర్శించారు. రాజోలు గ్రామపంచాయితీ ఏరియాలో సర్పంచ్ కోరికపై ప్రత్యేక ఎలిమెంట్రరీపాఠశాల భవనాల నిర్మాణం సహాయార్థం 1970లో చీకటివెలుగులు" అనే నాటకం ఉచిత ప్రదర్శన యిచ్చారు. 1971లో లలితకళాసమితి ఏర్పడినప్పుడు నవంబరు 20న "బొమ్మాబొరుసా" అను నాటకం ప్రదర్శించారు. 1972లో భారత స్వాతంత్ర్యరజితోత్సవాలు సందర్భంగా "భజంత్రీలు" అను నాటిక ప్రదర్శించారు. ఈనాటకాలలో పొన్నాడహనుమంతరావు, వై.వి. రామకృష్ణ, క్లబ్‌సభ్యులు ఎస్.వి.ఆర్.ఎల్. అయ్యంగారు, క్రిష్ణారావు, యం.యం. అవధాని, జి. రామకృష్ణరావు వగైరాలు నటించారు. సమితిలో అధికారి, క్లబ్‌సభ్యులు అయిన వై. మధుసూదనరావు ఈ నాటకాలకు దర్శకత్వం వహించారు. అప్పటి స్టేటుబ్యాంకుఏజంటు యం.ఇ.ఎస్.రాజ్‌పాయి కూడ ఈనాటకాలలోను, దర్శకత్వంలోను పాల్గొనేవారు.

రానురాను టెన్నిసు ఆటపూర్తిగా తగ్గిపోయింది. షటిల్ ఆట పుంజుకుంది.. టి.వి. ల ప్రభావంతో క్లబ్‌కు రావడం, అందరూకలవడం పద్ధతికూడ పూర్తిగా తగ్గిపోయింది.

1964లో జిల్లాన్యాయవాదుల ఫెడరేషను ఏర్పడింది. ప్రతిసంవత్సరం ఒక చోట సమావేశం జరిపేవారు. 1969 సం॥లో ఈ సమావేశాలు రాజోలులో ఏర్పాటుచేశారు. ఆ సందర్భంలో 1969 ఏప్రియల్ 11,12 తేదీలలో రాజోలులో రెండురోజులు సమావేశాలు జరిగాయి. ఈసమావేశాలకు అవసరమైన సొమ్ము అప్పటి నవయుగ ఫిల్మ్స్ అధినేత ధరణీప్రగడ విశ్వనాధశర్మగారు (శివకోడు) మూగమనసులు సినిమా ఉచితంగా యిస్తే వారం రోజులు దాని ప్రదర్శన ద్వారా రాబట్టడం జరిగింది

ఒక రోజు బార్‌అసోసియేషన స్వర్ణోత్సవాలు, రెండవరోజు బార్‌ఫెడరేషను సమావేశాలు జరిగాయి. అప్పటి మద్రాసు లా కాలేజి ప్రొఫెసరు బాలసుబ్రహ్మణ్యం, జస్టీస్ వల్లూరి పార్థసారధి, మంత్రి రామలింగరాజు, జిల్లాజడ్జీలు పాల్గొన్నారు. జిల్లాల్లో అన్ని ప్రాంతాలనుంచి సుమారు 200 మంది న్యాయవాదులకు హైస్కూలులోను యితర ప్రైవేటుఇళ్ళలో వసతి సౌకర్యం ఏర్పరచారు. వారికి అల్పాహారాలు 4పూటలు. భోజనాలు,కోర్టుప్రాంగణంలోనే ఏర్పాటు చేశారు. విలేజచావడిలో వంటలు చేయించి ప్రత్యేకంగా కోర్టుస్థలంలో పందిరివేసి భోజనాలు ఏర్పాటుచేశారు. భోజనాలకు

కుర్చీలు, టేబుల్స్ రాజమండ్రినుండి బస్సులలో టాపు మీద వేయించి తెచ్చారు. ఈ సభలు చాలా ఆహ్లాదంగా, ఘనంగా జరిగాయి. ముందురోజు రాత్రి బార్‌క్లబ్‌వారు "[illegible]" అనే నాటకం వేశారు. పొన్నాడ హనుమంతరావు, జె.ఎస్.శాస్త్రి, ఇంకా క్లబ్‌సభ్యులు సంజీవరావు, సింహాచలం, వగైరాలు పాల్గొన్నారు. మరునాడు జిల్లాఫెడరేషను సమావేశాలకు శ్రీ వి.వి.ఎస్. కామేశ్వరరావు గారు జిల్లాఅధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. సమావేశాలు నిర్వహించడంలో బార్ అధ్యక్షులు వాడ్రేవు సుబ్రహ్మణ్యం, కార్యదర్శులు పొన్నాడహనుమంతరావు, జాలెంనరశింహమూర్తిగారు చాలా శ్రమపడ్డారు. అప్పుడే టెన్నిసుకోర్టుకు దక్షిణాన ఏడిద జిజ్జిరావు గారు ఒక శాశ్వత సిమ్మెంటువేదికను కట్టించారు. ఆయన 1980లో చనిపోయిన తరువాత వారి దత్తత కుమారుడు దొరబాబు5000 రూ॥లు విరాళం యివ్వడంతో పైకప్పువేసి జిజ్జిరావుగారి పేరన కళామందిరం నిర్మించబడి 30-4-1983 న బార్‌క్లబ్ రజతోత్సవాల సందర్భంలో మంగెనసత్యనారాయణ గారిచే ప్రారంభించబడింది. ఈ ఉత్సవాలలో యం. రామశాస్త్రి, అప్పటి న్యాయాధికారులు ఎంతోమంది పాల్గొన్నారు. 1969 లో నిర్మించిన ఈ వేదిక ఎన్నోకార్యక్రమాలకు స్థానము అయింది. ఈ వేదిక పై నుంచే నీలంసంజీవరెడ్డిగారు 1979లోనుఆంధ్ర ఉద్యమంలో తెన్నేటి విశ్వనాథం, అప్పటి ఉద్యమనాయకుడు యం.వెంకయ్యనాయుడు వగైరాలు 1972లో రాజకీయప్రసంగాలు చేశారు. ఈ వేదికపై ఎన్నో రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య, విద్యా, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక కార్యక్రమాలు జరిగాయి. కొన్ని వివాహాలు కూడ జరిగాయి. మారుతున్న పరిస్థితులలో ఇప్పుడు ఈ కళామందిరం తన ఉనికిని కూడా కోల్పోయే ప్రమాదం ఏర్పడింది.

సుదీర్ఘచరిత్ర కలిగిన రాజోలుబార్‌అసోసియేషను 1991లో రిజిష్టరు కూడ చేయబడింది. ఈ బార్ అసోసియేషను మొదటినుంచి ఎప్పటికి సత్‌సంప్రదాయాలకు పేరుపొందింది. అంతరంగిక ఘర్షణలు గాని, న్యాయపీఠాలతో ఘర్షణలు గాని ఎన్నడూలేవు. అంతా కలసి మెలసి కుటుంబసభ్యులుగా వ్యవహరిస్తారు. అందరూ కలసి 1993లో కోనసీమ న్యాయశాఖ క్రీడలను నిర్వహించారు. ప్రతి విభాగాలలోను నైతికవిలువలు కోల్పోతున్న ఈ రోజులలో రాజోలుబార్‌అసోసియేషన్ ఎదురొడ్డి నిలుస్తోంది అనడంలో సందేహంలేదు. ఈ సంస్కృతి కలకాలం కొనసాగాలని కోరుకుందాం.

న్యాయవాదులకు 1986లోసంక్షేమనిధులు కూడ ఏర్పడ్డాయి.

న్యాయశాఖలో న్యాయవాదులు, న్యాయమూర్తులే కాకుండా న్యాయస్థానాల సిబ్బంది, ప్లీడరు గుమస్తాలు కూడా ముఖ్యపాత్ర వహిస్తారు. ఈ గ్రామస్థులు ఎంతోమంది ఈ న్యాయస్థానాలలో ఉద్యోగంచేసి రిటైరు అయ్యి ఇక్కడే ఉన్నారు. వారిలో శ్రీ సుబ్బారావు, శ్రీ వై. ఎస్.ఎస్. శాస్త్రి, ఎస్. మల్లిఖార్జునరావు మొదలైనవారు ప్రముఖులు శ్రీగంటిశర్మ, వాడ్రేవు గంగరాజు గార్లు, సబ్‌కోర్టుకు



మొదట మరియు రెండవ శిరస్తదార్లుగా పనిచేశారు. శ్రీ. ఎస్.సూర్యనారాయణమూర్తి శిరస్తదారుగా 1995నుంచి 98 గా పనిచేసి మళ్ళీ ఇప్పుడు చేస్తున్నారు. ఎ. సత్యనారాయణ, కె. శ్యామలదాసు, టి.హెచ్.ఎల్.ఎస్. శాస్త్రి, శ్రీ దొంగశ్రీరాములు, క్రిష్ణంరాజు వగైరాలు హెడ్‌గుమస్తాల గా పనిచేశారు. టి.నారాయణమూర్తి, ఇబ్రహీమ్, షేక్‌మస్తాన్, సి.హెచ్. సింహాచలం, హైదర్, హలీమ్, సుంకరవీరవెంకన్న, వెంకట్రామయ్య వగైరాలు ఆమీనులుగా, ప్రాసెసర్వర్లుగా పనిచేశారు. ప్రస్తుతం శ్రీ బొంతుభీమరాజు, సి.హెచ్. వీరయ్య, ఈలిశ్రీరామమూర్తి, కంబాల సత్యనారాయణ విదేశిరాజు వగైరాలు అటెండర్లుగా, ప్రాసెసర్వర్లుగా ఇచ్చట చాలాకాలం పనిచేశారు. పూర్వం కోర్టులకు సంబధించి నాల్గవతరగతి ఉద్యోగులందరు ప్రతిసంవత్సరం దసరాలకు 9రోజులు దేవినవరాత్రుల పూజలుచేసి విజయదశమి రాత్రి రోజున బేతాళుని, కనకదుర్గమ్మను, గడ్డితో తయారుచేసి అలంకరించిన ఒక పెద్ద ఏనుగు బొమ్మపై ఉంచి మేళతాళాలతో ఆర్భాటంగా తెల్లవార్లు ఊరేగించేవారు. కొంతకాలం తరువాత ఇది మానివేశారు. తరువాత 1977-78 సం॥లో అప్పటి డిస్ట్రిక్ట్‌మున్సిఫ్ జి. భవానిప్రసాద్ చొరవతో మళ్ళీ ఈకార్యక్రమాలు ప్రారంభించారు. కర్రతో శాశ్వతంగా ఒక ఏనుగు చేయించారు. ఈ మధ్య మళ్ళీకొద్ది సంవత్సరాలనుండి ఈఉత్సవాలు మరుగున పడ్డాయి.

ఇక ఈ న్యాయవ్యవస్థ ఉన్నప్పటినుంచి రాజోలులో ప్లీడరు గుమాస్తాలు కూడా ఉన్నారు. వీరు న్యాయవ్యవస్థకు తెరవెనుక పాత్రధారులు. నిత్యం కోర్టు వ్యవహారాలలో వీరి కృషి ఎంతో ఉంటుంది. లా డిగ్రీగాని, పట్టాగాని లేకపోయినా న్యాయవాదులతో సమానమైన విజ్ఞానము కలిగి ఉంటారు, ఉండాలి కూడ. కస్తూరి శివయ్య, తో బెల్లవీరభద్రయ్య, బందా సత్యనారాయణ, పప్పులనాయుడు, ఎలేశ్వరపు భీముడు, దేవరకొండ సత్యనారాయణ, యజ్జమల్లి సూర్యప్రకాశరావు, కాశిభట్ల విశ్వనాథం, తో పెల్లరాధాకృష్ణ వగైరాలు ఆలనాటి సీనియరు గుమస్తాలు. ఇక కొంపెల్ల సూర్యనారాయణ గారు ( ఈ మధ్య రిటైరు అయ్యారు), గుబ్బలధర్మారావుగారు, వాడ్రేవు వెంకటేశ్వరరావు, వీరాదార్యులు, చెల్లింగి పాండురాజు, ఆకుల సూర్యనారాయణ, ఎ. సత్యనారాయణలు ప్రముఖన్యాయవాద గుమాస్తాలు. ఇక ఎస్.వీరభద్రరావు, గంధం రామారావు గార్లు ఈమధ్య గతించారు. 1990 నుండి ప్లీడరు గుమస్తాలు కూడ ఒక సంఘం ఏర్పర్చుకొన్నారు. వీరికి కూడ 1991 నుండి సంక్షేమనిధులు ఏర్పడ్డాయి. అల్లే ఆలనాటి న్యాయవాదులు, న్యాయమూర్తులు, న్యాయస్థాన ఉద్యోగులు, మరియు ప్లీడరు గుమస్తాలతో కూడిన రాజోలులోని ఈ న్యాయవ్యవస్థ చాలా పురాతనమైన, అతిపెద్ద వ్యవస్థ. రాజోలులో సుమారు రెండు మూడువందలమంది ఈ శాఖకు సంబంధించిన వారున్నారు. స్టాంపువెండర్సుగా వడ్లాని నరశింహమూర్తి, ఆకుల రామ్మూర్తి వ్యవహరించారు.

ఈ పురాతన వ్యవస్థ 21 శతాబ్దంలో కూడ ఆదర్శవంతంగా కొనసాగాలని ఆశిద్దాం. ఈ ప్లీడరు గుమాస్తాలు,స్టాంపు వెండర్లు కలిసి ప్రతి సంవత్సరం వేసవిసెలవులకు ఆఖరి పనిరోజున వైశాఖపూజ చేస్తారు. పానకం విసనకర్రలు పంచుతారు. పూర్వమైతే రాత్రి హరికథ, భాగవతం వగైరా కాలక్షేపాలు కూడ ఏర్పర్చేవారు.

# 9. వ్యాపారం- వాణిజ్యం

పూర్వకాలంలో రాజోలుతాలూకాకు అంతకీ రాజోలు వ్యాపారకేంద్రంగా ఉండేది. మొదట్లో అంటే యించుమించు 1945వ సం॥నాటికి ఫ్యాన్సీ, బట్టలు, వ్యాపారాలు రాజోలులో మాత్రమే ఉండేవి. అక్కడ గాంధిబొమ్మ సెంటరు అంటే పంచాయితీ సత్రమువద్ద గల రావి చెట్టు వద్ద వ్యాపార కూడలి ఉండేది. గ్రంధినరశింహమూర్తి గారి ఫ్యాన్సిషాపు ఉండేది. స్కూలు పుస్తకాలు లగాయితు ఆరోజుల్లో ఉపయోగించే సబ్బులు, పౌడర్లు వగైరాలు అక్కడ మాత్రమే దొరికేవి. ఆ తరువాత చిన్నగ్రంధివారు కూడ ఫ్యాన్సీ సామానులు ప్రారంభించారు. ఆతరువాత శివకోడుకు చెందిన లక్కింశెట్టి సుబ్బారావు గారు,గెల్లిబాలకృష్ణ గార్లు కూడ ఫ్యాన్సీ వ్యాపారం చేశారు. గెల్లిబాలకృష్ణ గారి ఫ్యాన్సీ వ్యాపారంమొత్తం తాలూకా అంతకీ కేంద్రంగా యుండేది. ఆ తరువాత చాలాచాలా ఫ్యాన్సీవ్యాపారాలు ప్రారంభమైయ్యాయి. సాతులూరిసుబ్బారావు, బోళ్ళబ్రదర్స్, కాసువారు కూడా ఈ ఫాన్సీవ్యాపారం ప్రారంభించారు. సుతాపల్లి సూర్యనారాయణ గారు, సుతాపల్లి సుబ్బారావుగారు, గెల్లిశేషారావుగారు, రాజా సుబ్బారావుగారు, ఆ తరువాత గోకవరపు పల్లయ్య పెద్ద కిరాణా వ్యాపారాలు చేసేవారు. భారం సత్యనారాయణగారు, బోణం సుబ్బారావుగారు, భారం కృష్ణమూర్తి గారు మందుల వ్యాపారం చేసేవారు. ఇక బట్టల వ్యాపారాన్కి వస్తే ధరణీప్రగడ వెంకట్రామయ్యగారు,వెలుగొట్ల వనమయ్యగారు ఆతరువాత వెలుగొట్ల భద్రంగారు బట్టలు వ్యాపారం మొదట్లోను, ఆ తరువాత పిల్లా వెంకట సుబ్బారావు, అప్పన మాణిక్యాలరావు గారు 1970కి ముందు నడిపేవారు. బట్టల షాపులు అప్పట్లో శరత ఖాదినిలయం, ఖాదివస్త్రాలు అమ్మేవారు. అలాగే నందూరి కృష్ణమూర్తిగారు (నాయనప్ప గారు) కూడ ఖద్దరు వ్యాపారం చేసేవారు. ఆ తరువాత మోరివారి చేనేతబట్టలు కొట్టు, ఎ.పి.హెచ్.సి. వారి బట్టలు కొట్టులు ఖాద్రగ్రామోద్యోగ కమీషన్ వారి ఖద్దరు కొట్లు నడిచేవి. తరువాత కాలంలో కామన లక్ష్మణరావు గారి వీరభద్ర క్లాత్ స్టోరు, కామన వనమరాజు గారి షాపులు ఏర్పడ్డాయి. ఆ తరువాత జయప్రద, జయశ్రీ, సాయిచిత్ర బట్టలు షాపులు ఏర్పడ్డాయి. షేకసుబాన్ సాహెబుగారు సైకిలు విడిభాగాలు, మరియు మరమత్తులు షాపు చాలా పురాతనమైన పెద్ద వ్యాపారం. అప్పట్లో అంటే సుమారు 1935 నుండి తాలూకాలో సైకిల్‌గల వారంతా రాజోలులో ఈ షాపుకు వచ్చేవారు. ఈయన గొప్ప దేశభక్తుడు నెహ్రూ మరణించినప్పుడు రోడ్డు మీద విలపించారు. ఇక గాదె వెంకటసుబ్బారావు గారు ఆ తరువాత లక్కింశెట్టివారు ఇనుప షాపులు ప్రారంభించారు. వారి కుమారులు ఈ వ్యాపారాలు నడుపుతున్నారు.





1950కి ముందునుంచి సుతాపల్లి సుబ్బారావుగారు పెట్రోలు వ్యాపారం చేసేవారు. 1950లో ఈ పెట్రోలు గోడౌను అగ్ని ప్రమాదాన్కి లోనయి వారి గుమస్తా నేమాని విశ్వనాధం గార్కి గాయమై తీవ్రంగా ఒళ్ళుకాలి చాలాకాలానికి తేరుకొన్నారు. ఆ తరువాత 1951నుండి52లో బర్మాషెల్ కంపెని వారిచే రాజోలు, కొత్తపేట ప్రాంతాలకు మొదటిపెట్రోలు బంక్ ఏర్పడింది. ఆ తరువాత డా॥ బిక్కిన జానకిరామారావు గారి పెట్రోలుబంకు ఇండియన్‌ఆయిల్ కార్పొరేషన్ వచ్చింది. బర్మాషెల్ భారత్‌పెట్రోలియంగా మారింది.

జనాబ్ పీర్‌అహ్మద్ గారిజోళ్ళషాపు పురాతనమైనదిగా ఉండేది. తరువాత తీసివేశారు. యాళ్ళరామారావు గారు చాలాకాలం నుంచి జోళ్ళషాపు నడుపుతున్నారు. 1949 సం॥నకు ముందు అంటే రేడియాలు ప్రారంభించకముందు పెద్దవారి ఇళ్ళలో గ్రామఫోనులు ఉండేవి. గ్రామఫోనులు ఉన్నవార్కి, గ్రామఫోనులు రికార్డులు (హెచ్.యం.వి) వగైరా కంపెనీల వారివిఎక్కడో కొనితెచ్చుకొనేవారు. మొదటిసారిగా పాన్నాడ వీరభద్రరావుగారు (బాబులు) గారు 1948లో గ్రామఫోనులు, రికార్డులు వ్యాపారం ప్రారంభించారు. ఆ తరువాత బోళ్ళ బ్రదర్స్, లక్కంశెట్టి చిన్నయ్య గారు కొత్తగా కట్టిన మేడలో(పాన్నాడ వారి ఇళ్ళకు ఎదురుగా) గ్రామఫోన్లు,రికార్డులు , వ్యాపారం ప్రారంభించారు. ఇక 1950 నుండి రేడియో వ్యాపారాలు ప్రారంభంఅయ్యాయి. బ్యాటరీరేడియోలు అమ్మేవారు. బాబులుగారు, దేశరాజు సీతారామారావుగారు, బోళ్ళ బ్రదర్స్, మాచిరాజు సుబ్బారావుగారు, రేడియోలు, రేడియోగ్రాముల వ్యాపారం ప్రారంభించారు. తరువాత కాలంలో వెలగొట్ల వేణుగోపాలరావుగారు, సూర్యసత్యనారాయణగారు రేడియో వ్యాపారం చేసి టి.విలలోకి మారారు. పాతబస్టాండు వద్ద గల లేటు సున్నవెంకటస్వామిగారు రేడియోలు రిపేరు చేయిడంలో దిట్ట. డా॥ ఆమంచిరామారావు గారు కూడ రేడియోలు కట్టడం, రిపేరుచేయిడం హాబీగా చేసేవారు. స్వాతంత్ర్యం వచ్చేనాటికి రాజోలులో చింతాశివయ్య గారి కాఫీహోటలు వద్ద, తల్లాప్రగడ సూర్యప్రకాశరావు గారు (చిన్నబ్బాయి గారు), ఆమంచి రామారావు గారు మరియు పంచాయితీ పార్కులో మాత్రమే రేడియోలు ఉండేవి.

ఇక కాఫీభోజనహోటళ్ళు కు వస్తే వీటికి కూడ వంద సంవత్సరాల చరిత్ర ఉంది. చింతాగంగయ్య గారి హోటలు చాలా పురాతనమైనది. ఇక్కడ ఇడ్లీ, కాఫీ చాలా ఫేమస్. 1929లో గాంధీగారితో రాజోలు వచ్చిన ఆలీసోదరులు ఈ హోటళ్ళో వాయిలకు వాయిలు యిడ్లీలు తిన్నారని చెప్పుకొన్నారు. ఆ తరువాత గంగయ్యగారి కుమారులు చింతాశివయ్య గార్లు ఆతరువాత మరియొక కుమార్డు సత్యానందం ఈ హోటలు నడిపారు.

చింతాసత్యానందం గెడ్డంపెంచుకొని రీవిగా కౌంటరు దగ్గర కూర్చొంటే 1950లో పొన్నాడబాబులుగారు టాండన్ లాగాఉన్నావని అన్నారట. అప్పటినుంచి ఆయన టాండన్ అయ్యారు. ఈ టాండన్ గారి హోటలు **"టాండన్ హోటల్"** గా చాలా ప్రసిద్ధి చెందినది. ఇక్కడ ఇడ్లీలో వేసే శనగచెట్నీ చాలాపాపులర్, కాఫీ కూడా చాలా పాపులర్ అయింది. సుమారు 30 సంవత్సరాలు ఈ హోటల్లో కాఫీ త్రాగడం తాలూకాలోని చాలామందికి వ్యసనంగా మారింది కూడ. మెడికల్ రిప్రజెంటేవ్స్, ఇతర యాత్రికులు రాజమండ్రి, కాకినాడ వంటి ప్రాంతాలలో ఈ హోటల్ గురించి చెప్పుకోవడం చాలామంది విన్నారు. తరువాత టాండన్ కుమారులు చింతామల్లిఖార్జునుడు,సోదరులు నడిపారు. కాని వర్కర్స్ సమస్యలతో కొనసాగించలేకపోయారు. ఇక పూర్వం నుంచి ఆనందరావు (1930నుంచి) హోటలు కూడా ప్రసిద్ధి చెందింది. కోర్టుకు ఎదురుగా ఉండేది. రెవిన్యూ పనుల మీద కోర్టుపనుల మీద రాజోలు వచ్చినవారందరూ ఈ హోటల్లో భోజనంచేసేవారు. ఈ హోటల్‌ను తరువాత దేవళ్ళవీరన్న గారు నడిపారు. ఇక లాంచిల రేవువద్ద ఇవతల సెంటర్లో ప్రయాణీకులకోసం సుమారు 10కాఫీ హోటళ్ళు నడిచాయి. వాయుగుండ్ల గోవిందుగారు, అడ్డాలవీరన్న గారు, పచ్చిగోళ్ళవీర్రాజుగారు, సిరం బంగారయ్యగారు, తరువాత సిరం సత్యనారాయణగారు, రాజా చిన చెంచయ్యగారు, గుమ్మళ్ళ వనమయ్యగార్ల కాఫీహోటళ్ళు నడిపారు. ఇక రవిపిక్చరు ప్యాలెస్ ప్రారంభంఅయ్యాక అక్కడ గుమ్మళ్ళవారు కాఫీహోటళ్ళు నడిపారు. (ప్రస్తుతం యడ్లరామారావు గారి హోటల్) ఇక్కడకూడా కాఫీ అద్భుతంగా ఉండేది. సినిమాకు వచ్చేవారెవరూ ఈ కాఫీ తాగకుండా ఉండేవారు కాదు . 1970 వరుకు కూడ ఊళ్ళో జ్వరం వచ్చిన పిల్లలు సినిమాహాలు వద్ద కాఫీ తెప్పిస్తేనే తాగుతామని మారాంచేసేవారు. అట్లే రాజోలులో మాంసాహారభోజనశాల కూడా ప్రారంభమయింది. 1960 ప్రాంతంనుంచి ఇప్పటికీ అప్పలరాజు భోజనహోటల్‌గా నడుస్తోంది. అట్లే ఒరియాకు చెందిన దీనభందు శాఖాహార, భోజన హోటలు కూడా సుమారు 50 సం॥రాలు పై నుండి నడుస్తోంది. 1950నుంచి యామని విశ్వనాథం గారు సీతారామ కాఫీమీల్స్, పొన్నాడభాస్కరరామారావు గారు భారతకాఫీమీల్స్, నడిపేవారు. మాజీ సర్పంచి నున్ననాగేశ్వరరావు గారు కూడ కాఫీమిల్స్ నడిపేవారు.

ఇక తినుబండారాలకు ప్రసిద్ధి చింతా నిత్యానందంగారి తీపికొమ్ములు (కరఖజ్జంవంటిది). సైకిళ్ళపై చాలామంది ఇతర గ్రామాలకు వెళ్ళి అమ్మేవారు. అట్లే ఆంజనేయస్వామి ఆలయం వద్ద 1940 కి ముందు నుంచి ఉన్న పామర్తిశేషయ్య గారి మిఠాయిదుకాణం కూడ ప్రసిద్ధి చెందింది. ఇక్కడ అప్పటి కప్పుడు జిళ్ళు తయారుచేసి అమ్మేవారు. అలాగే పిల్లారాంరాం అనే ఆయన చెవుగోడీలు చేసి అమ్మేవారు. ఇవి చాలా





లావుగా చిన్నవిగా ఉండి చాలా రుచిగా ఉండేవి. ఇప్పటకీ రాజోలులో ఈ లావుచెవుగోడీలను రాంరాం చెవుగోడీలు అంటారు. అన్నపూర్ణ స్వీట్సువారు వీటిని తయారుచేస్తున్నారు.

రాజోలు లంకలో పండిన పుచ్చకాయలు, మొక్కజొన్నపొత్తులు కూడ సీజన్ తినుబండారులుగా ప్రసిద్ధి. తాలూకాలో చాలామంది ఆ సీజన్‌లో వీటిని కొని తీసుకొనివెళ్ళేవారు.

ఇక అరుమిల్లిశేషయ్యగారి డ్రింక్ మరియు కిళ్ళీషాపు. బజారుసెంటరులో సత్రవుషాపులో ఉండేది. కరెంటు రాకముందు నుంచి ఈయన ఐస్‌కలర్స్ అని అమ్మేవారు. ఇవి తాలూకాలో ఇక్కడే అమ్మేవారు. వేసవిలో ఈ షాపుకు వచ్చేవారు. కరెంటువచ్చిన తరువాత తాలూకాలో మొదటి ఐస్‌పార్లర్ అరుమిల్లిశేషయ్యగారు ప్రారంభించారు. 1955 ప్రాంతంలోనే యూనిఫారంవేసుకొన్న బేరర్లచేత సైకిళ్ళపై బట్టర్‌మిల్క్, బాదంగీర్, ఐస్‌క్రీం వంటి పానీయాలు సప్లైచేసేవారు. ఈ షాపులో కిళ్ళీ, షోడాకూడా చాలా పాపులర్. ఆతరువాత తోరం మునేశ్వరరావుగారి నూర్జహాన్ కిళ్ళీషాపు కూడ ప్రసిద్ధిచెందింది.

రానురాను ప్రజల నిత్యజీవితావసరాలు బాగా పెరిగిపోయి అటు మలికిపురం, ఇటు తాటిపాక వ్యాపారకేంద్రాలు కావడంతో రాజోలు వ్యాపారం రాజోలువారికే పరిమితమయింది. అయినా అన్ని రకాల వ్యాపారాలు ప్రారంభింపబడుతున్నాయి. వ్యాపార పోటిలో కొన్ని నిలబడుతున్నాయి. కొన్ని తట్టుకోలేక పోతున్నాయి.

మొదటినుంచి రాజోలులో వర్తకసంఘం లేదు. అయితే 1995లో రాజోలుఛాంబరు ఆఫ్ కామర్స్ ఏర్పడింది. దీనికి గాదివెంకటనాగసత్యనారాయణ గారు (బాల్జి) అధ్యక్షులుగా దొర్లపాపయాచారి కార్యదర్శిగాఉన్నారు. ఈ ఛాంబరు ఏర్పడ్డాక వ్యాపారసమస్యలు వగైరాలు పరిష్కరించుకోవడాన్కి అవకాశం ఏర్పడింది. రాజోలులో ఎన్నో కార్యక్రమలాను వీరు చేబడుతున్నారు.

వ్యాపారం అభివృద్ధిలో ఉన్న 1940నుంచి60సం॥ ప్రాంతాలలో గంటిపేరయ్యగారు, యామనివిశ్వనాథంగారు, గంటిసత్యంగారు, గంటి గణేశం గారు, గంటి శ్రీరామూర్తి గారు, ఆత్రేవు గుర్రాజు, గాదెటి సూర్యనారాయణ వగైరాలు వ్యాపారుస్థులకు అక్కౌంటెంట్లుగా వ్యవహరిస్తూ వ్యాపారస్థులకు వాణిజ్యపన్నుల శాఖవారికి మధ్య వారధిగా ఉండేవార్లు.

మొదట్లో రాజోలులో ధాన్యం మిల్లులు వ్యాపారపరంగాలేవు కాని 1957లో

లక్ష్మింశెట్టిచిన్నయ్యగారు పెద్ద బియ్యంమిల్లు ఏర్పర్చారు. తరువాత భారం సత్యనారాయణగారు, రాజాచెంచయ్యగారి, మిల్లులు ఆ తరువాత వెలిదిరామారావుగారు క్రిష్ణయ్య రైస్‌మిల్లు, రాజాసుబ్బారావుగారు పొదలాడలో పెద్దమిల్లు కట్టి రాజోలులోనే వ్యాపారం చేసేవారు.

పూర్వం కాలంనుంచి బిక్కినరశింహమూర్తిగారు, దారపురెడ్డి వెంకన్నగారు, దారపురెడ్డి వెంకట్రామయ్యగారు, కానుకొలను పుల్లయ్యగారు కొబ్బరికాయవ్యాపారం పెద్దఎత్తులో చేసేవారు.

ఇక ఈ ప్రాంతంలో వాణిజ్యపన్నులు వసూలుచేయడానికి ఎ.సి.టి.ఓ. కార్యాలయం 1948లో ఏర్పడింది. 1970 నాటికి డి.సి.టి.ఓ కార్యాలయం కూడ ఏర్పడింది. 1993లో సి.టి.ఒ. ఆఫీసు కూడ శాంక్షను అయింది. అయితే దీనిని అంబాజీపేటలో స్థాపించారు. వ్యాపారాలకు సంభందించిన సహాయలేబరు ఆఫీసు, కొలతలుతూనికలశాక అధికారులు కూడ 1980 దశకంలో ఏర్పడ్డాయి. గోటేటిసాయిబాబు న్యాయవాదిగా అమ్మకంపన్నుల కేసులు చేస్తుంటారు. అట్లే విన్నకోటశర్మగారు కూడ ఎకౌంటెంట్‌గా చాలాకాలం ఈ కేసులు చేస్తూయున్నారు.

**చేనేతకారులు** : రాజోలులో చాలాకాలం నుంచి చేనేతపనివారు కొండావారు మగ్గాలపై పనిచేసేవారు. అట్లేచాలామంది స్వర్ణకారులు కూడ పూర్వకాలంనుంచి ప్రసిద్ధిచెందారు. అట్టివారిలో చాలా పురాతనమైన స్వర్ణకారులు గానుగులపీరాచార్యులు. ఈయన బంగారం పనులు చేయటమేకాకుండా ఆయుర్వేదవైద్యం కూడ చేసేవారు.వీరి కుమార్డు మల్లయ్య గారు కూడ ఈ పనిచేసేవారు. ఇక రాజోలులో స్వర్ణకారుల పనికోసం చుట్టుప్రక్కల ఊళ్ళనుండి రాజోలు వస్తూ ఉంటారు. ఇటీవల స్వర్గస్థులైన దార్లసాంబమూర్తిగారు వెండి,బంగారం వస్తువుల వ్యాపారం చేయడమేకాకుండా మాష్టరు స్వర్ణకారునిగా కూడ ఉంటూ ప్రముఖంగా వ్యాపారం చేసేవారు. వీరి పెద్దకుమార్డు దార్ల పాపయాచారిగారు ఆ వ్యాపారాన్ని కొనసాగిస్తూ పలు సంస్థలతో సంభంధాలు కలిగిఉన్నారు. అట్లే రెండవ కుమార్డు కూడ ఈ వ్యాపారాన్ని కొనసాగిస్తున్నారు. చాలాకాలం చారిగారు, వాచీపంతులుగారు వాచీల రిపేరు చేసేవారు. ప్రసుత్తం నూరాగారు వాచీలరిపేరరుగా చాలాకాలం నుంచి ఉన్నారు. పూర్వం కందులపాటి సత్యంగారు మోటార్‌మెకానిక్‌గా చాలాకాలం ఉండేవారు. కోళ్ళవెంకట్రావు, బాబూరావు అడబాలభద్రంగారు, వెలుగోట్లసూర్యనారాయణ, కొమ్ముల సూర్యనారాయణ చాలాకాలం నుంచి మోటార్లురిపేరు పనిలో ఉన్నారు.

ఇక ఫొటోగ్రఫీకి వస్తే సి.కె.వి.గుప్తా గారు రాజోలులో 1932లో మొట్టమొదటి





ఫొటోగ్రాఫరు. ఈయన తండ్రి జగ్గారావు గారునర్సాపురంలో ఫొటోగ్రాఫరుగా ఉండేవారు. ఈయన తరువాత కుమార్డు ఈ వృత్తిని గుప్తాస్టూడియోగా కొనసాగిస్తున్నారు. అట్లే రాముఫొటోస్టూడియో, ఆర్.కె. ఫొటోస్టూడియోలు ఏర్పడ్డాయి. ఇక అదునికంగా బాబుస్టూడియో చాల ప్రఖ్యాతిగాంచింది. ఫొటోగ్రఫిలో అవార్డుకూడ పొందింది. ప్రతీ సంవత్సరంఫొటోగ్రాఫర్ల ఆసోసియేషను రాజోలులో సమావేశాలు జరుపుతుంది. వీరి సంఘాన్ని931/91 గా రిజిష్టరు చేశారు కూడ. రాజోలు వీరభానుపురమందిరంలో9-2-97న సమావేశం జరిగింది. జిల్లానాయకులు చాలమంది వచ్చారు.

ఇక వై. రాఘవులుగారు చాలాకాలం నుంచి మొదటిపెయింటరుగా ఉండేవారు. ఎన్నోబోర్డులు, పెయింటింగులు, రబ్బరుస్టాంపులు ఇప్పటికి తయారుచేస్తున్నారు.

రాజోలులో మొదటిసారిగా చింతారవికుమార్ జిరాక్స్ మెషిన్‌తో ఫొటోస్టాట్ వృత్తిప్రారంభించారు.

ఇక రాజస్థాన్ నుంచి వచ్చిన సేట్ లుంబాజీగారు మార్వాడీవడ్డీవ్యాపారం 1930 నుంచి చేసేవారు. ఆ తరువాత సేట్ చీకంచంద్, సేఠ్‌మునేలాల్ ఈయన కుమార్డు మోహన్‌లాల్ ఈ వ్యాపారాన్ని కొనసాగించారు. ప్రస్తుతం వారి స్థానీయులు ఈ వ్యాపారం కొనసాగిస్తున్నారు. పూర్వం వీరు వెండి, బంగారు వ్యాపారం కూడ చేసేవారు.

1974లో మొదటిసారిగా రాజోలుతాలూకాలో రాజస్థాన్ సేఠ్ మహావీర్ టెంట్‌హౌస్ ప్రారంభించారు. మొదటిసారిగా రాజోలులో 1984లో దంగేటిరామచంద్రరావుగారు గ్యాస్‌ఏజన్సీతో రాజోలు వచ్చారు. ఆయన తరువాత కుమారులు ఈ వ్యాపారం చేస్తున్నారు. 1986లో యాత్రికులకు విజయదుర్గాలాడ్జి, 1995లో విక్రమలాడ్జిలు ఏర్పడ్డాయి. తరువాత రవితేజ కూడ వచ్చింది.

**బ్యాంకులు** : వాణిజ్యరంగంలో బ్యాంకులు ప్రముఖపాత్ర వహిస్తాయి.. అయితే 1969లో బ్యాంకులు జాతీయంచేయబడటానికి ముందు బ్యాంకులు కేవలం పెద్దధనవంతులకు, పెద్దవ్యాపారస్థులకు మాత్రమే సంభందించియుండేవి. జాతీయకరణ తరువాత ప్రతిబ్యాంకువ్యవస్థ పల్లెపల్లెకు జేరి సామాన్యుడికి కూడ నిత్యావసరంగా ప్రముఖపాత్ర వహిస్తోంది. ఎన్నో ప్రైవేటుబ్యాంకులు ఉన్నప్పటికీ ప్రభుత్వ పరంగా కూడ ఒక బ్యాంకుపూర్వంనుంచి ఉండేది. అదే "ఇంపీరియల్ బ్యాంక్" రాజోలులో ఈ బ్యాంక్ 21-5-1945 న ప్రారంభింపబడింది. కె.సత్తిలింగం గారు ఛార్జితీసుకొన్నారు. స్వాతంత్ర్యం తరువాత ఈ ఇంపీరియల్ బ్యాంక్ స్టేటుబ్యాంకు ఆఫ్ ఇండియా గా మారింది. ఈ బ్యాంకు శాఖను రాజోలులో నాలుగురోడ్ల సెంటరులో మట్టపర్తి సీతారామయ్యగారు

బిల్డింగులో సే ఆఫీసుగా 1956లో ప్రారంభించారు. ఇది తరువాత బ్రాంచిగా మారి 1960 ప్రాంతంలో డా॥ అమంచిరామారావుగారి మేడలోకి మారి క్రమేణా అభివృద్ధి చెంది సుమారు 16 సం॥లు నుండి డా॥ చిక్కిన జానకిరామారావు గారింట్లో ఇప్పటికీ నడుస్తోంది. ఎంతోమంది ప్రముఖులు ఈ బ్యాంకు ఏజంట్లుగా ఆతరువాత బ్రాంచి మేనేజర్లు గా వ్యవహరించారు.

ఇక ప్రైవేటురంగానికి వస్తే రాజోలులో భారతలక్ష్మి బ్యాంకు 1949 నుంచే పనిచేసేంది. ప్రస్తుతపు డా॥మల్లిఖార్జునరావు గారి ఇంట్లో పనిచేసేది. తరువాత యిది పోస్టాఫీసు ప్రక్కన అరుమిల్లిమారెయ్యగారింటికి మారింది. ఆ తరువాత ఈ బ్యాంకు ఆంధ్రభ్యాంకులో విలీనం అయిపోయి అచ్చటకొన్నాళ్ళు,సత్తిరాజజువారి వీధికిఎదురుగా దేశరాజురామచంద్రరావు గారి మేడలో చాలాకాలం పనిచేసి ప్రస్తుతం ఉన్న భవనంలో సుమారు 20సం॥లు నుంచి పనిచేస్తోంది.

అల్లాగే రైతుల ప్రయోజనం నిమిత్తం రాజోలు లో స్టేటుభ్యాంకువారి వ్యవసాయ అభివృద్ధిశాఖ కూడ 1979లో అప్పటిజిల్లాకలెక్టరు నారాయణన్ గారిచే ప్రారంభింపబడింది. ప్రస్తుతం ఉన్న చిలకమ్మగారి భవనంలోనే యిప్పటికీ కొనసాగుతూ రైతులకు విశేషంగా సేవచేస్తోంది 1993లో రాజోలులో అప్పటి రీజనలుమేనేజరు ఎస్.విశ్వపతిగారిచే స్టేటుబ్యాంకు ఆఫ్ హైదరాబాదువారి బ్రాంచి కుడా ఏర్పడింది. పొన్నాడహనుమంతరావు, సర్పంచి జదువెంకట్రావు అప్పటి శాసనసభ్యులు మంగెన గంగయ్యగారు ఈ సభలో పాల్గొన్నారు. శ్రీ గాదిబాల్లిగారి భవనంలో ఇది కొనసాగితోంది.

**యస్.బి.ఐ. మేనేజర్లు కొంతమంది** : 1).కె.యస్.వి. సుబ్బారావు (1960-61-71-74), 2). యస్.గోవిందస్వామి (1961-64), 3). ఎస్.వి. రమణ (1964-66), 4). ఆర్.టి. హాకర్ (66-67), 5). ఎస్.రాజారావు (67-69), 6). యం.వి.యస్. రామ్‌పాయి (69-72), 7). వి.ఆర్. విశ్వనాథం (74-75), 8). పి.కె.టి. ఆచారి (75-76), 9). ఎ.బి.కె. మూర్తి (76-77), 10). వి.వి. సుబ్బారావు (77-78), 11). కె. మార్కండేయులు (78-81), 12). వై. శ్రీరామమూర్తి (81-84), 13). పి.యస్. మురళీధరరావు (84-86), 14). కె. సుబ్రహ్మణ్యం (81-89), 15). ఎ. సత్యనారాయణమూర్తి (89-90), 16). జి.వి. శేషాచార్యులు (90-92),17).టి.సూర్యనారాయణ (92-95), 18). టి.యస్. రామచంద్రమూర్తి (95-98), 19). టి.రామచంద్రరావు (98-2000), 20) సి.హెచ్.కోటేశ్వరరావు (12-5-2000-)

**యస్.బి.ఐ. (ఎ.డి.బి.) మేనేజర్లు కొంతమంది** : 1978-85........ , పి. కళ్యాణరావు (1985), జి. విశ్వనాథం (1986), కె.యం. గోపాలక్రిష్ణ (90-93), బి. వెంకటరత్నం







(93-95), టి.ఎస్ రామచంద్రమూర్తి (95-97), కె. సూర్యనారాయణ (97-99), ఎ. అప్పారావు (99-2000), కె.ఆర్.రాజేశ్వరరావు (2000.....).

యస్.బి.హెచ్. మేనేజర్సు 1 ఉదయభాస్కరరావు 2)బదిరీనాధ్ 3). సి. నాగేశ్వరరావుగారు 2000నుండి

**జీవితభీమా** : ఇన్సూరెన్సు కూడ వాణిజ్యంలో ఒకభాగమే 1904 నుంచి కూడ రాజోలులో ఇన్సూరెన్సు కార్యక్రమాలలో ఉండేది. అప్పట్లో జీవితభీమా కూడ ప్రైవేటురంగంలో ఉండేది. అయితే పాశర్లపూడి అవతల బోడసుకుర్రులో సుజనరంజని భీమాకంపెనీ ఉండేది. 7-12-1904న బోడసుకుర్రు ఇనమూర్తిగంగరాజుగారి అధ్వర్యంలో కంపెనీ సభ్యులు సమావేశం మధ్యాహ్నం 3-30కి జరిగింది. రాజోలుక పొన్నాడ బాపమూర్తిగారు వగైరాలు అందులో సభ్యులు. చందా నెలకు ఒక రూపాయి మాత్రమే పొన్నాడ లచ్చయ్యగారు ఏజెంటుగా ఉండేవారు. 1955లో జాతియంచేయడంతో ఎల్.ఐ.సి. ఏర్పడి అన్ని చోట్ల ఏజంట్లు ఏర్పడ్డారు. రాజోలులో కస్తూరిక్రిష్ణమూర్తి గారు, కస్తూరిరామచంద్రరావుగారు, గుబ్బలశ్రీరామ్మూర్తిగారు లోగడే ఏజంట్లుగా ఉండేవారు. రాజోలు మొదటిసారిగా 1960లో ఎల్.ఐ.సి. అసిస్టెంటు బ్రాంచిమేనేజర్ ఆఫీసు వచ్చింది. డి.సీతారామరాజుగారు మొదటి ఏ.బి.యం. అయ్యారు. ఆయన కారులో తిరుగుతూ ఇన్సూరెన్సు వ్యాపారం చేసేవారు. తరువాత డెవలప్మెంటు అధికారులు కూడ వచ్చారు. మోహనరావు గారని ఒక డెవలప్మెంటు ఆఫీసరు "**కోటీశ్వరుడు**" (కోటిరూపాయల పాలసీలు చేయించడం) అవడంలో ఆయనకు సన్మానం జరిగింది. ఆ సందర్భంలో సమావేశం లో పాల్గొన్న సర్పంచి పొన్నాడహనుమంతరావు, రాజోలు ప్రాంతంలో భీమావ్యాపారం బాగున్నందున ఇచ్చట బ్రాంచి ఆఫీసు ఏర్పరచాలని కోరారు. అప్పటినుంచి ప్రయత్నం ప్రారంభంఅయింది. చివరకు 20- 9-84న శ్రీ అరుమిల్లి మారెయ్యగారి భవనంలో కార్యాలయం ప్రారంభంఅయింది. సర్పంచి ఇతరులు పాల్గొన్నారు. తరువాత శివాలయం వీధిలో గాధిబాల్లి గారి భవనంలోకి మార్చబడింది. తరువాత 1998-99 లో నూతన భవనం స్వంతస్థలంలో నిర్మింపబడి 2000 సం॥లో ప్రారంభింపబడింది.

# 10. తంతి-తపాలా

రాజోలులోని తంతితపాలా వ్యవస్థ కూడ చాలా పురాతనమైనది 19వ శతాబ్దంలోనే రాజోలులో బ్రాంచి పోస్టాఫీసు ఉండేది. ది.15-2-1899న ఈ బ్రాంచిపోస్టాఫీసు రూ॥20ల జీతంతో హోదాపెంచబడింది. ఈ బ్రాంచిపోస్టాఫీసు సబ్‌పోస్టాఫీసుగా 26-4-1901 న పెంచబడింది. ఈ పోస్టాఫీసు పూర్వం రాజోలులోని కొత్తపేటలో ఉండేది. ఆ తరువాత ప్రస్తుత పోస్టాఫీసు వీధిలో ఉండే చిక్కాల సీతారామయ్యగారింటికి సుమారు 60సం॥లు క్రితం మార్చబడి 45సం॥లు క్రితం ప్రస్తుతమున్న శ్రీ అప్పనమాణిక్యాలరావుగారి బిల్డింగులోకి మార్చబడి అక్కడేకొనసాగుతోంది. అప్పటి నుంచి తంతిసౌకర్యం కూడ ఉన్నది. ఇది 1980లో హెడ్‌పోస్టాఫీసు అయింది. సబ్‌పోస్టుమాష్టర్ల స్థానంలో హెడ్‌పోస్టుమాష్టర్లు వచ్చారు. 1900 నాటికి ఎవరో చనిపోతే 3-11-1900 వ తేదిన పొన్నాడభానుమూర్తి గారు ఎవరికో టెలిగ్రాము ద్వారా తెలియజేసినట్లు ఉన్నది. అప్పటికే టెలిగ్రాములు ఇవ్వడం ఉన్నదని స్పష్టమవుతోంది. 10-6-1902 రిజిష్టరు ఉత్తరం పంపినట్లు కూడ ఉన్నది. పోస్టుఆఫీసులో పనిచేసేవారు కేంద్రప్రభుత్వ ఉద్యోగులు గా వారికి చాల గౌరవం ఉండేది. ఆ రోజుల్లో చాలా పవర్‌ఫుల్‌గా ఉండేవారు. పోస్టల్‌అధికారులుగా పనిచేసిన వారి వివరాలులేవు. అయితే మొదటి సబ్‌పోస్టుమాష్టారు భట్టిప్రోలు షణ్ముఖరావు. 1947 ఆ ప్రాంతంలో తురగా అరుణాచలం గారు రెండుజిల్లాలకు సూపరింటెండెంటుగా ఉండేవారని ఆయన 14-7-47న రాజోలు పోస్టాఫీసు తనిఖీ చేసినట్లు తెలుస్తోంది.

అప్పట్లో రవాణాకు సౌకర్యాలు లేనందున మనుష్యులే టపాను నెత్తిమీదపెట్టుకొని మోసేవారు. వీరిని రన్నర్సు అనేవారు. రాత్రి అనక పగలుఅనక నెత్తిమీద టపా, ఒక చేతిలో మువ్వలకర్ర, మరియొక చేతిలో లాంతరు పట్టుకొని పెద్దపెద్ద అంగలతో టపాతీసుకువచ్చేవారు. వీరిని ఎవరూ అడ్డుకొన్నా పెద్దనేరం. వీరిపై జనం భయభక్తులతో ఉండేవారు. ఆ తరువాత ప్రైవేటు బస్సులలోను ఆర్.టి.సి. బస్సులలోని టపా వచ్చేది. టపా వచ్చే బస్సులకు బోయినెట్ ఎర్రరంగులో ఉండేది.

ఇక రాజోలులో అసిస్టెంట్ సూపరిండెంట్ ఆఫ్ - పోస్ట్ ఆఫీసు కూడ 1980 నుంచి వచ్చారు.

1990లో టెలిగ్రాపు ఆఫీసును పోస్టాఫీసు నుంచి వేరుచేసి అంబేద్కర్‌భవనం ప్రక్కకు మార్చారు.

100 సం॥లు చరిత్ర కల్గిన ఈ పోస్టాఫీసుకు స్వంతభవనం లేకపోవడం విచారకరం. అయితే కేంద్రంలో నిదులు మంజూరుకావడంతో స్థలంకోసం చూస్తున్నారని చెబుతున్నారు.



# 11. విద్యుశ్చక్తి

రాజోలులో 1954 సం॥ము వరుకు కిరసనాయిలు దీపాలు మాత్రమే ఉండేవి. ధనవంతులు పెట్రొమాక్సు లైట్లు ఉపయోగించేవారు. రెండవ ప్రపంచయుద్ధంలో కిరసనాయిలు కొరత ఏర్పడింది. ఆముదం దీపాలు ఉపయోగించేవారు. పంచాయితీ వీధిలైట్లు కూడా కిరసనాయిలతో వెలిగించేవారు. ముఖ్యమైన కూడలిలో మాత్రము పెట్రొమాక్సులైట్లు వెలిగించేవారు. పంచాయితీబోర్డులైటరు ఒక నిచ్చెనతో సాయంకాలం బయలుదేరి అన్నిలైట్ల చిమ్నీలు తుడిచి లైట్లు వెలిగించేవాడు. చాలాకాలం ఈ పనిలో పంచాయితీలో మట్టా నర్సయ్య అనే లైటర్ ఈ పనిచేసేవాడు.

స్వాతంత్ర్యం తరువాత పంచవర్షప్రణాళికలు రావడంతో పల్లెప్రాంతాలకు విద్యుశ్చక్తి ఏర్పడింది. 1953లో మొదటిసారిగా కోనసీమలో అమలాపురాన్కి విద్యుశ్చక్తి వచ్చింది. ఆ తరువాత సం॥లో 1954 రెండవ ఊరు రాజోలు. అమలాపురంనుండి 33-11 కె.వి.లైను నడపబడింది. రాజోలులో ఆర్.టి.సి. ఎదురుగా శ్రీ చేబియ్యంవెంకట్రామయ్యగారి భూమి ఎక్వైర్ చేయబడి సబ్‌స్టేషన్ నిర్మింపబడింది. రాజోలులో మొదటిగా గణపతి గారనే ఆయన ఎలక్ట్రికల్ సూపర్‌వైజర్‌గా వచ్చేరు.

గవర్నమెంటు ఆసుపత్రి వద్ద మొదటి ట్రాన్స్‌ఫార్మరు ఏర్పర్చారు. 1954వ సం॥ ఏప్రియల్ నెల 4 వ తేదీన ఉగాది రోజున సాయంకాలం 7గం॥లకు బజారులో 6 విద్యుత్‌బల్బులు పెట్టి లైనుఛార్జ్ చేశారు. అప్పటి డిస్ట్రిక్ట్‌మున్సిఫ్ పి. గురుమూర్తి ఆసుపత్రి వద్ద గల ట్రాన్స్‌ఫార్మర్ వద్ద స్విచ్ ఆన్ చేశారు. వి.వి.ఎస్. కామేశ్వరరావు, యం.రామశాస్త్రి, శ్రీ వాడ్రేవు సుబ్రహ్మణ్యం గారు, మొదటి ఎలక్ట్రిల్‌సూపర్‌వైజర్ గణపతిగారు పాల్గొన్నారు. వీరంతా వెలిగిన లైట్లనుచూస్తు మెయిన్‌రోడ్డులో నడిచి వచ్చేరు. అప్పట్లో అయ్యగారి నరశింహమూర్తి గారిది ఒకటోనెంబరు సర్వీసు, డా॥ రామారావు గారిది రెండోనెంబరు సర్వీసు అయ్యాయి. అప్పటి నుంచి రాజోలులో విద్యుత్‌సరఫరా అభివృద్ధిచెంది అనేక ట్రాన్స్‌పార్మర్లు నిర్మించబడ్డాయి. గణపతిగారి తరువాత తురగాసూర్యారావు, జోగిశాస్త్రి, జి. నారాయణరావు, సీతారామయ్య తదితరులు సూపర్‌వైజర్లు గా పనిచేశారు.

మొదటిసారిగా రాజోలులో1993లో ఎలక్ట్రికల్‌అసిస్టెంట్‌డివిజనల్ ఇంజనీరు కార్యాలయం ఏర్పడి మొదటి ఏ.డి.ఇ.గా శ్రీ టి.వీర్లవెంకట్రావు గారు, రెండవ ఏ.డి.ఇ.గా బి. ప్రసాద్ గారు (ఆయన ప్రస్తుతం అమలాపురం డి.ఇ.గా పనిచేస్తున్నారు). ప్రస్తుతం ఏ.డి.ఇ.గా యం.వెంకట్రాయుడుగారు పనిచేస్తున్నారు. 1999లో రాజోలులో వేరే ఎలక్ట్రికల్‌రెవిన్యూ ఆఫీసు కూడ ఏర్పడింది.

శ్రీ సి.హెచ్. తాతారావు గారు ప్రస్తుతం రాజోలులో 3సం॥లు నుంచి ఎ.ఎ.ఇ. గా పనిచేస్తున్నారు.

# 12. సబ్‌రిజిస్ట్రారు కార్యాలయం

రాజోలు సబ్‌రిజిస్ట్రారు ఆఫీసుకూడా చాలాపురాతనమైనది. ఇప్పుడు ఉన్నచోటే సుమారు వందసం॥లు నుండి పనిచేస్తోంది. 1903లో పోచిరాజువెంకటచలపతిరావుగారు పంతులుగారు సబ్‌రిజిష్టర్ గా పనిచేశారు. అ తరువాత సబ్‌రిజిష్టర్ల వివరాలు తెలియవు. 1949లో మలికిపురం, మామిడికుదురు, సబ్‌రిజిష్ట్రారు కార్యాలయంలు ఏర్పడ్డాయి.

**1950 తరువాత కొంతమంది సబ్‌రిజిస్ట్రార్ల వివరాలు.**

కె. అబేల్ (1958-62), ఎస్. సత్యానందం (1962-64), వై. సత్యనారాయణమూర్తి (1964-65), టి. బంగారయ్య (1972-74), వై.వి. నర్సింహరావు (1974-77), యం.డి. నసీబ్‌ముల్లా (1977-80), వి.బి.వి. రమణమూర్తి (1980-83), ఎ. గోపాలకృష్ణమూర్తి (1983-86), అర్. గణపతిరావు (1986-88), పి. సేతురావు (1988-90), ఎస్. రామారావు (1990-93), యస్.కె. భాషా (1993-1994,95), బి. వెంకటేశ్వర్లు (1995 - 2000), ప్రస్తుతం జి. సత్యనారాయణగారు సబ్‌రిజిస్ట్రార్ గా పనిచేస్తున్నారు.

1998లో ఈ సబ్‌రిజిష్టర్ ఆఫీసులో కంప్యూటర్ ప్రవేశపెట్టబడింది. ఇక సబ్‌రిజిష్టర్‌కు అనుబంధంమైన దస్తావేజుల లేఖరులు కూడ చాలామంది ఉండేవారు. పొన్నాడవెంకటరత్నం గారు(వెంకప్ప), కాశీభట్ల రాజగోపాలం, పొన్నాడవెంకటరత్నంగారి అల్లుడు మంచిగంటిసత్యంగారు లేఖరి గా సుమారు 60సం॥లు పనిచేశారు. కాశీభట్లరాజగోపాలంగారుకూడా చాలాకాలం పనిచేశారు. అయన తరువాత అయన కుమారుడు రామకృష్ణపరమహంస ఇప్పుడు లేఖరిగా ఉన్నారు. ఈయన కుమారుడు గోపి కూడా లేఖరి. వీరితో పాటు కర్నాలు కూడా దస్తావేజులు వ్రాసేవారు. ఇక మంచిగంటిరామారావు కొంతకాలం లేఖరిగా ఉన్నారు. ఇప్పుడు వీరి కుమారుడు లేఖరిగా ఉన్నారు. తరువాత కాలంలో అరుమిల్లి గంగాధరం లేఖరిగా ఉన్నారు. వీరుగాక బయటనుంచి కాదంబరిసూర్యభాస్కరం, కాదంబరి నాగభూషణం, కాట్రేనిపాడు నుంచి అడబాల రాజు మరియు వీరి కుమారుడు లేఖరిగా ఉన్నారు.

పూర్వం తాటిపాకకు చెందిన యజ్ఞాప్రగడక్రిష్ణారావు గారు ఆ తరువాత పెంజర్లభసవరాజు గారు వగైరాలు లేఖరులు.

ఇక పూర్వం వద్దాని నరశింహమూర్తి గారు స్టాంపువెండరు గా ఉండేవారు. ప్రస్తుతం ఆకులరామమూర్తిగారు, చేగొండివెంకట్రావు వగైరాలు స్టాంపువెండర్లగా వ్యవహరిస్తున్నారు.

స్టాంపు వగైరాలు తీసుకోవడానికి ఖజానాదాచడానికి పూర్వం నుంచి రాజోలు సబ్‌ట్రెజరీకార్యాలయంకూడా, పోలీసుస్టేషను ప్రక్కగాఉంది. స్టేట్‌బ్యాంక్‌ఆఫ్ఇండియా రాకముందు ప్రభుత్వ ఖజానావ్యవహారలన్నీ ఈ కార్యాలయంలోనే సాగేవి. ఆ తరువాత ఖజానా ఎస్.బి.ఐ.కి మారింది. అయితే ప్రభుత్వం చెక్కులన్నీ సబ్‌ట్రెజరీ ద్వారానే నడుస్తాయి. ఎంతోమంది సబ్‌ట్రెజరి ఆఫీసర్లు ఈ కార్యాలయంలో పనిచేశారు.



# 13. వ్యవసాయము - నీటిపారుదల - పాడిపరిశ్రమ - పశువైద్యం

ముందువ్రాసినట్లు రాజోలుభూములు మంచి నల్లరేగడి కాబట్టి చాలా సారవంతమైనవి. వరి ముఖ్యమైన పంట 1853 సం॥లో ధవళేశ్వరం ఆనకట్ట, గన్నవరంఅక్విడక్ట్ నిర్మించినప్పటినుంచి నీటి సాగు ప్రారంభమయింది. రాజోలు ప్రక్కగానే గన్నవరం మెయిన్‌కాల్వ ప్రవహించి 5చిన్నకాల్వలు ద్వారా సాగుబడి అవ్వుతూంది. ఇచ్చట నీటిపారుదల గన్నవరంసబ్‌డివిజన్‌లో భాగంగా ఉంది. అయితేపూర్వం రాజోలులో ఇరిగేషన్‌కు సంభందించి డెల్టా సూపరింటెండెంట్లు ఉండేవారు. మొండెపులంక, శివకోడుల వద్ద లాకులు ఉండేవి. 1949లో పొదలాడలో కాల్వకు వేరేలాకు నిర్మించబడింది.

1898ప్రాంతంలో డిప్యూటితహశీల్దార్‌లను అగ్రికల్చర్‌డిప్యూటి తహశిల్దారుగా వ్యవహరించేవారు. అర్.సుబ్బారావుగారు, హుండిరామారావుగార్లు ఈ వ్యవసాయడిప్యూటి తహశీల్దార్లుగా పనిచేసేవారు. 1902లో పనిచేసిన ఒకడెల్టా సూపర్‌డెంట్ వైద్యసలహాలు కూడా ఇచ్చేవారు. 1903మే నెలలో కామర్షి వెంకటసుబ్బయ్య డెల్టాసూపరిండెంట్ గా పనిచేశారు.

అతరువాత ఈ డెల్టాసూపర్‌డెంటు స్థానే సెక్షన్‌ఆఫీసు ఏర్పడి ఓవర్సీర్లు, సెక్షన్‌ఆఫీసర్లు పి.డబ్ల్యు.డిలో భాగంగా పనిచేసేవారు. ఆ తరువాత పి.డబ్ల్యు.డి. నుండి నీటిపారుదలశాఖ వేరుబడింది. ప్రస్తుతం అడిషనల్‌అసిస్టెంట్‌ఇంజనీర్లు, జూనియర్ ఇంజనీర్లు ఈశాఖలో పనిచేస్తున్నారు. ఈ కార్యాలయం సంతమార్కెట్ ప్రక్కన ఉంది. అక్కడ కాటన్‌విగ్రహం స్థాపించబడింది.

ఈ డిపార్ట్‌మెంటువారి అధీనంలో శివకోడు సరిహద్దులో ఇన్స్‌పెక్షన్ బంగాళా కూడ ఉన్నది. అర్.అండ్.బి. గెస్టహౌస్‌రాకముందు కలెక్టర్లు, జడ్జీలు, మంత్రులు, ఇక్కడే మకాంవేసేవారు. 1929లో స్వాతంత్ర్యపోరాటంలో కళావెంకట్రావు గారిపై కేసు ఇక్కడే విచారించారు.

ఈ డిపార్ట్‌మెంటువారి అధీనంలో ఉండే దొరబోట్లు (House Boats) లలో అధికారులు కాలవ ద్వారా పర్యటనలకు వచ్చేవారు. ఈ నీటిపారుదలశాఖ, గన్నవరం సబ్‌డివిజన్‌లో, ధవళేశ్వరం సెంట్రల్‌డివిజన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరంవారి అధీనంలో ఉంటుంది.

అల్లే ధవళేశ్వరంసర్కిల్ గోదావరిగట్లకు సంబంధించి ఒక డివిజన్ ఉంది. ఈ డివిజన్‌ను హెడ్‌వర్క్సుడివిజన్ అని అంటారు. తూర్పు, పశ్చిమగోదావరిజిల్లాలోని గోదావరిగట్లను పరిరక్షించడం, పటిష్టపర్చడం ఈ శాఖబాధ్యత. దీనికి సంబంధించి కొన్ని సబ్‌డివిజన్‌లు ఉన్నాయి.అటువంటిదే వశిష్ఠ సబ్‌డివిజన్. దీనికి కేంద్రం రాజోలు. పూర్వంనుంచి ఇందుకు ఒక సబ్‌డివిజనులు ఆఫీసరు (అసిస్టెంట్ ఇంజినీరు) ఉంటారు. ఈయన క్రింద ఎడమగట్టుకు కుడి గట్టుకు వేరుగా సూపర్‌వైజర్లు ఉంటారు. రాజోలులో డిస్ట్రిక్ట్‌మున్సిఫ్ తరువాత పూర్వకాలంలో ఈయన ఒక్కరే గెజిటెడ్ ఆఫీసరు. సుమారు వంద సం॥లు నుండి ఇక్కడ ఈ ఆఫీసు ఉన్నది. దీనికి స్వంతభవనం లేదు. రాజోలు కోర్టు ఆవరణలో ఇప్పటికి ఉన్న రేకుషెడ్లలలో దీని కార్యాలయం ఉండేది. ఆ తరువాత కోర్టువచ్చాక ఈ అఫీసు చాలాకాలం ప్రైవేటుఇళ్ళలో లైబ్రేరి ఎదురుగాను, ఆ తరువాత పోలీసులైనుకు ఎదురుగాను ఉండేది. ఈ కార్యాలయం ఇక్కడ ఉండటంతో రాజోలు ఏటిగట్టుపరిరక్షింపబడుతోంది. దీనిని కన్సర్వేటివ్ డిపార్టుమెంటు అని కూడా అంటారు. రివరుకన్సర్వేటివ్ చట్టప్రకారం గోదావరిగట్టుకు మరియు గోదావరి మధ్య భూమిలో (దీనిని పడుగాయి అంటారు). ఈ డిపార్టుమెంటు అనుమతిలేనిదే ఇళ్ళు కట్టరాదు. చిన్నగోయి కూడ త్రవ్వరాదు. మట్టితీయరాదు. పూర్వం ఈ శాఖ చాల పవర్‌ఫుల్‌గా ఉండేది. రానురాను బలహీనమయింది.

వ్యవసాయానికి కావల్సిన డ్రైన్లు మరమత్తు చేయడాన్కి రాజోలులో 25 సం॥ల క్రితం డ్రైనేజ సబ్‌డివిజన్ ఏర్పడి ఒక డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజినీరు కూడ ఉన్నారు.

**వ్యవసాయం :** ఇక వ్యవసాయరంగంలో రైతులకు సలహాలు ఇవ్వడానికి 1959 ప్రాంతానికి. ముందే అగ్రికల్చర్‌డిమాన్‌స్ట్రేటర్లు ఉండేవారు. 1953లో పంచాయితీ సమితులు ఏర్పడినప్పుడు వీరిని సమితికి అనుసంధానంచేశారు. ఆ తరువాత వీరిని వ్యవసాయవిస్తరణాధికారిగా మారారు. 1990 ప్రాంతానికి అసిస్టెంట్‌డైరెక్టర్ వ్యవసాయశాఖ కార్యాలయం కూడా ఏర్పడింది. లోగడ జి. సింహాచలం, కె. సత్యనారాయణచౌదరి, రామదాసుగార్లు ఈ శాఖలో పనిచేశారు.

ఇక రాజోలు ప్రాంతంలో కొబ్బరి ఎక్కువగానే ఉండటం తెలిసినవిషయమే. అయితే 1947 సం॥లో ఉమ్మడి మద్రాసరాష్ట్రంలో కొద్దిరోజులు మంత్రిగాచేసిన తాటిపాకవాస్తవ్యులు బిక్కిన వీరాస్వామిగారు ( డా॥ వీరస్వామిగారి తాతగారు) కొబ్బరిచెట్లకు ఈ ప్రాంతంలో సైనోడెర్మ అనే తెగులు వస్తోందని ఇది క్యాన్సర్ వంటిదని ఇది అంటువ్యాధిగా చెట్లుతుపాకి కొన్నాళ్ళకు కోనసీమలో కొబ్బరిచెట్లు లేకుండా పోతాయని





హెచ్చరించారు. అందుపై అప్పటి ప్రభుత్వం స్పందించి ఈ తెగులుగురించి పరిశోధన చేయాలని నిర్ణయించారు. వీరాస్వామి గారు వ్యవసాయశాస్త్రం చదివిన వ్యక్తికావడం వల్ల ఈ ప్రమాదం గుర్తించారు. తాటిపాక వాస్తవ్యులు వీరాస్వామి గారిచే కనుగొనబడిందిగాన దీనికి "తాటిపాక తెగులు" అని పేరు పెట్టి రాజోలులో 1955సం॥లో ప్రభుత్వం వారు కొబ్బరిపరిశోధన కేంద్రం ఏర్పాటుచేశారు. ఇచ్చట మంచి సదుపాయాలతో పరిశోదనపరికరాలు ఏర్పడ్డాయి. లక్ష్మీనారాయణ, ఎస్.పండిట్, ఎ.పాపారావు వగైరాలు ఈ కేంద్రంలో ప్లాంట్‌పాథాలజిస్ట్ గా పనిచేశారు. వీరి పరిశోధన చాలా జయప్రదంగా కొనసాగింది. అప్పట్లో ఇది ప్రభుత్వశాఖ కావడంతో ఈ అధికారులు గెజిటెడ్‌అధికారులుగా ఉండేవారు. ముఖ్యంగా ఎ. పాపారావు ఇక్కడ పరిశోధనచేస్తూ తరువాత డాక్టరేట్ కూడా అయ్యారు. 1969 ప్రాంతంలో ఈ పరిశోధన కేంద్రాన్ని రాజేంద్రనగర్‌లో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి అనుబంధం చేశారు. అదే సమయంలో పురుగుల పరిశోధన కేంద్రం (Parasite Breeding station) కూడా సమాంతరంగా నడిచేది. శేషగిరిరావు అనే Entomologist ఇక్కడ పనిచేస్తూ అ రంగంలో చాలా సేవలు చేశారు. కొబ్బరిపరిశోధనకేంద్రంవ్యవసాయ విశ్వవిద్యాలయాన్కి అనుబంధం చేసేక 1971లో విశ్వవిద్యాలయం వారు రాజోలు బాలికల హైస్కూలు ఆవరణలో ఒక పెద్దక్షేత్ర సమావేశములు కూడ ఏర్పర్చారు. శాస్త్రవేత్తలు, అధికారులు వైస్‌చాన్సలర్ ఇంకా ఎంతోమంది పాల్గొన్నారు. సర్పంచ్ మున్నానాగేశ్వరరావుగారు, వి.వి.యస్. కామేశ్వరరావుగార్లు ఈ సమావేశంలో సమస్యలను విశ్వవిద్యాలయ దృష్టికి తెచ్చారు.

కొబ్బరిచెట్టుకు వందసంవత్సరంలు ఆయుర్దాయము ఉంటుంది. కాబట్టి తాటిపాక తెగులు గురించి పరిశోధనచేయాలంటే సుమారు 40, 50సంవత్సరాలు పట్టవచ్చునని శాస్త్రవేత్తలు చెప్పేవారు. అయితే అంతవరకు ఈ పరిశోధన కొనసాగింపగల్గే ఓపికలేక నో మరియే ఇతరకారణాలవలనో అప్పటి అసిస్టెంట్‌పాథాలజిస్ట్ గా రాజమన్నార్ ఉన్న సమయంలో ఈ పరిశోధన కేంద్రాన్ని రద్దుచేసి అంబాజీపేటలో కల కొబ్బరి పరిశోధనకేంద్రాన్కి 1985లో తరలించారు. స్థానికులు ముఖ్యంగా బైపు ఆచార్యులు గారు అని పిలవబడే స్వాతంత్ర్యసమరయోధుడు ఎస్.కె.వి.ఎల్.ఎన్. అయ్యంగారు వగైరాలు ఎన్నో విజ్ఞప్తి పత్రాలు ఇచ్చినప్పటికీ ప్రభుత్వంకాని, ప్రభుత్వప్రతినిధులుకాని, విశ్వవిద్యాలయంవారు కాని పట్టించుకోకపోవడంతో ఇక్కడ ఈ కేంద్రం రద్దయింది. అంబాజీపేటలో ఏమి పరిశోధనజరుగుతుందో గాని, తెగులుసోకిన చెట్లును నరికివేయండి, చెట్టుకు ఇంతడబ్బు ఇస్తామని మాత్రం ఒక సమావేశంలో సలహా ఇచ్చారు. రాజోలులో తాటిపాకతెగులు పరిశోదన మొదలయ్యి ఎత్తివేసేవరకు ఈ కార్యాలయంలో పనిచేసిన

## 14. టెలీకమ్యూనికేషన్లు

రాజోలు ప్రాంతానికి విద్యుచ్ఛక్తి రావడంతో టెలిఫోన్ సౌకర్యంకూడ ఏర్పడింది. 1956లో మొదటిసారిగా రాజాసుబ్బారావుగారు ఫోను నెం.23 తో ప్రారంభంఅయింది. అప్లై పోస్టాఫీసులోను, టెలిగ్రాఫఆఫీసులో మాత్రము ఫోన్లు ఉండేవి. 1980 సం॥ వచ్చేసరికి ఈ ఫోన్లు సుమారు 10,15కు మాత్రమే పెరిగాయి ఇక 1980లో టెలిఫోనుసౌకర్యం దేశం అంతా అభివృద్ధిచెందడంతో క్రమేపి రాజోలులో కూడ పెరిగింది.

రాజోలులో టెలిఫోన్ ఎక్స్చేంజి నాల్గురోడ్ల కూడలిలో గల మట్టపర్తి సీతారామయ్యగారు, ఆ తరువాత పాతబసుస్టాండ్ ప్రక్కన సున్నవారికొట్లలోను ఆ తరువాత నాలుగురోడ్లసెంటరులో ప్రస్తుతం డా॥సత్తిరాజుసూర్యనారాయణమూర్తి గారి ఆసుపత్రి గల భవనంలోను ఉండేది. ఆ తరువాత దొరగారితోటలోకి మారింది. 1992 వరకు ఇక్కడ జె.ఇ. టెలిఫోన్లు ఉండేవారు హనుమంతరావు, సుందరరావు, వగైరాలు జె.ఇ.లుగా పనిచేశారు. 1994లో ఎస్.టి.డి.సౌకర్యం ఏర్పడటంతో ఎస్.డి.ఓ.టి.నికూడా రాజోలులో ఏర్పరిచారు. కాలేజి ప్రక్కనగల బర్మారిపాత్రియేట్స్‌వారి స్థలాన్ని ఎక్వైర్ చేసి, అక్కడ సుమారు కోటిరూపాయలతో టెలిఫోన్ ఎక్స్చేంజి భవనం నిర్మింపబడి సుమారు 4సం॥లు క్రితంనుంచి పనిచేస్తున్నది. అక్కడ పెద్దటవర్ నిర్మాణం కూడా జరిగింది. ఉద్యోగులకు క్వార్టర్స్ కూడ నిర్మించారు.

ఈమధ్య ఆధునికటెక్నాలజీ కూడ ప్రవేశపెట్టి కొత్తగా డివిజనల్ ఇంజనీరు కార్యాలయం కూడా ఏర్పాటుయింది. ఈ ఆధునికటెక్నాలజీ రావడానికి లోకసభ స్పీకరు గౌరవనీయులైన బాలయోగి గారి కృషి ఎంతో ఉంది.కేంద్ర కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ గా॥ రాంవిలాస్ పాశ్వాన్ దీనిని ఈమధ్య ప్రారంభించారు.

రాజోలు కమ్యూనికేషన్ నెట్‌వర్క్ సిటీకేబుల్ వారు టి.వి. ప్రసారాల ద్వారా ప్రజలకు సేవచేస్తున్నారు.





## 15. స్వాతంత్ర్యపోరాటం

1857 "సిపాయిలతిరుగుబాటుతో భారతస్వాతంత్ర్యపోరాటం ప్రారంభమయింది. 1885లో భారతజాతీయకాంగ్రెసఏర్పడి స్వాతంత్ర్యసమరం ప్రారంభించింది. అయితే 1916 తరువాత గాంధీ మహాత్ముడు ఉద్యమంలో ప్రవేశించడంతో స్వాతంత్ర్యపోరాటం పల్లెపల్లెలకూ విస్తరించింది. ముఖ్యంగా తూర్పుగోదావరిజిల్లా ప్రముఖనాయకులకు ఆలవాలమయింది. అలాగే రాజోలు ప్రాంతంలో కూడా ఈ ఉద్యమానికి మంచి ఊపువచ్చింది. 1920 నుంచి 21 ప్రాంతంలో మహాత్మగాంధీ,"**Boycot of Councils, Boycot of Court, Boycot of Schools and Colleges**"అనిపిలుపునిచ్చారు. అదే సమయంలో రాజమండ్రిలో ఆర్ట్సుకాలెజిలో మొదట సం॥ ఎఫ్.ఏ. (ఇప్పటిఇంటర్) చదువుతూ ఉండే రాజోలుకాపురస్తులు పొన్నాడ శ్రీరామవెంకటసూర్యారావు గారు, ఆ పిలుపుననుసరించి కాలెజి చదువుకు స్వస్తిచెప్పి కాలేజీ వద్ద పికెటింగ్ జరిపేవారు. మహాత్మగాంధీ బెజవాడ ఏ.ఐ.సి.సి. మీటింగ్‌కు మెయిల్‌లో వెళుతూ రాత్రి రాజమండ్రి వచ్చి సభ చేశారు. ఆ సభలో సూర్యరావుగారు వాలంటీర్‌గా పనిచేశారు. అప్పటికి గాంధీగారు ఖద్దరటోపి ధరించేవారు. ల్లాల్చీ పంచె ధరించారట. అలీ సోదరులు అంగరక్షకులుగా ఇరుప్రక్కలా ఉండేవారు. బెజవాడ సమావేశానికి డా॥ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యంగారితో సూర్యారావుగారు హాజరయ్యారు. చాలా జనం వచ్చారు. అక్కడ మహాత్మగాంధీ ఒక సం॥లో కోటిరుపాయలు నిధిని వసూలు చేయాలని, కోటి మంది సభ్యులను చేర్చాలని పిలుపునిచ్చారు. 1920 సెప్టెంబర్‌లో సూర్యారావు గారు రాజోలు వచ్చి పాల్గొంటూ సహాయనిరాకరణ ఉద్యమంలో నిధివసూలు కూడాప్రారంభించారు. గ్రామ,ఫిర్కా, తాలూకా, జిల్లా సంఘాలు ఏర్పడ్డాయి. సూర్యారావుగారు వగైరా కార్యకర్తలు భజనలు చేస్తూ గ్రామాలలో ప్రచారం చేసేవారు. జిల్లాలో బులుసుసాంబమూర్తిగారు, డా॥ బ్రహ్మజోశ్యులసుబ్రహ్మణ్యం గారు నాయకత్వం వహించారు. వీరు రాజోలు వచ్చి సూర్యారావు గారి ఇంట్లో మకాంవేసి పర్యవేక్షణ చేసేవారు.

1921లో అహ్మదాబాద్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభకు పాశర్లపూడికాపురస్థులు కాంగ్రెస్ ప్రచారకుడుయిన యర్రమిల్లిసత్యనారాయణగారితో కలసి సూర్యారావుగారు వెళ్ళారు. 1922 ఫిబ్రవరిలో అంతర్వేది తీర్థంలో సూర్యారావుగారు వగైరాలు కాంగ్రెస్ ప్రచారం విరివిగా చేశారు. అక్కడ అంతస్థులలో పందిరిలు, ఢంకా నగారా ఏర్పాట్లుచేసి ప్రచారం చేశారు.

సూర్యారావుగారి ఇంటివెనుక దొడ్లో 1922లో ఒక పెద్ద డ్రామాపెండాల్‌క్రింద

పాకవేయించి రాట్నపరిశ్రమ, నేతమగ్గాలు ఏర్పాటుచేసి కార్యక్రమాలు చేసేవారు. 1923 అక్టోబరునెలలో తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెస్ మహాసభ కొండావెంకటప్పయ్య పంతులుగారి అధ్యక్షతన ఆ పెండాలలో జరిగింది. సూర్యారావుగారు వీరందరికి ఆతిథ్యం ఇచ్చారు. 1923 డిసెంబర్‌లో కాకినాడలో కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. దీనికి సూర్యారావు గారు, ఈయన తల్లి గౌరమ్మగారు కూడా హాజరైయ్యారు. 1924లో వచ్చిన గాలివానకు రాజోలులోని పెండాలు కూలిపోయింది. ఊరిలో చాలా పూరిఇళ్ళు కూలిపోయాంఱు. ఆ కూలి పోయిన షెడ్లతాలూకు వాసాలు వగైరాలు సూర్యారావుగారు ఉచితంగా ఇచ్చివేశారు. 1924నుండి సూర్యారావుగారు తాలూకా కాంగ్రెస్ కార్యదర్శిగాను కోశాధికారిగాను కూడా చాలాకాలం పనిచేశారు. జిల్లాకాంగ్రెస్ సభ్యునిగా కూడ కొంతకాలం ఉన్నారు. 1924లోను 1928లో రాజమండ్రితాలూకా బోర్డుకు రాజోలు ఫిర్కాకు కాంగ్రెస్‌అభ్యర్థిగా సూర్యారావుగారు పోటీ చేశారు. బెల్గాంలో జరిగిన కాంగ్రెస్ మహాసభకు కాశీభట్లసీతారామయ్యగారితోను 1928 డిసెంబర్‌లో కలకత్తాలో మోతీలాల్‌అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్‌సభలకు అరుమిల్లి పేరరాజుగారితోను సూర్యారావుగారు హాజరైనారు.

## మహాత్మగాంధీ రాజోలు పర్యటన

1928 సం॥లో జరిగిన తాలూకాబోర్డు ఎన్నికల్లో కాంగ్రెస్‌లో స్థానికంగా విభేదాలు ఏర్పడ్డాయి. ఈ విభేదాలు కొనసాగుతుండగా 1929 ఏప్రియల్‌నెలలో మహాత్మగాంధీ ఆంధ్రదేశపర్యటనకు వచ్చారు. ఈ విభేదాల వల్ల ఎవరూ గాంధీగారి రాజోలు పర్యటన గురించి పట్టించుకోలేదు. చివరకు డా॥ బ్రహ్మజోశ్యులసుబ్రహ్మణ్యంగారు, తెన్నేటి సత్యనారాయణగారు, కళా వెంకట్రావు గార్లు రాజోలువచ్చి అందరితోను సంప్రదించి సూర్యారావు గారింట్లో సమావేశపర్చారు. గాంధీజీరావడానికి 3వేలరూపాయలు నిధి వసూలుచేయాలని నిర్ణయించారు. రాజోలు ఫిర్కాలో సూర్యారావుగారు, నగరం ఫిర్కాలో తాటిపాకకు చెందిన చిక్కినవీరాస్వామిగారు వాడ్రేవురామమూర్తిగారు, అంతర్వేదిపాలెం ఫిర్కాకు మల్లాది రామమూర్తి శాస్త్రిగారు తిరిగి చందాలు వసూలుచేశారు. 5-5-1929వ తేదీన మహాత్మాగాంధీరావటానికి స్థిరపర్చారు. ఆ రోజురాత్రి 6గం॥లకు (ఆదివారం 5-5-29) మహాత్ముడు సపరివారంగా అమలాపురం నుంచి పాశర్లపూడిరేవు సాయంకాలం 6గం॥లకు దాటి ఇవతలకు వచ్చారు. సూర్యారావుగారు, చిక్కినవీరాస్వామిగారు వగైరాలు పాశర్లపూడిలో గాంధీమహాత్ముడుకు సపరివారంగా స్వాగతం పలికారు. చిక్కినవీరాస్వామిగారు గాంధీమహాత్మునితో కూడా ఉండి తోడ్కొనిరాగ సూర్యారావుగారు ముందు మరియొక కారులో స్వాగతం చెప్పడాన్కి ముందుగానే వారి ఇంటివద్దకు తిరిగి వచ్చారు. సూర్యారావుగారి ఇంటి గేట్ ముందు అప్పటికే పందిళ్ళు వేయించారు. సరిగ్గా





రాత్రి 8గం॥లకు గాంధీజీ రాజోలులో సూర్యారావుగారి గేటువద్దకు చేరారు. పొదలాడకుచెందిన పొన్నాడకృష్ణమూర్తిగారు లాంతరు పట్టుకొన్నారు. ప్రక్కన వ్యాపారంచేస్తూ కాపురంఉండే గ్రంధినరశింహమూర్తి గారి కుమార్తె మహాత్మగాంధీ కి దండవేసి హారతి ఇచ్చింది. తిన్నగా మహాత్మగాంధీ సూర్యారావుగారింటి పడమటవైపు కాశీస్థలంనకు చేరారు. అచ్చట 8.30ని॥లకు ప్రార్థన జరిగింది. మహాత్మునితో కస్తూరిబాయిగాంధీ, ఇమామ్‌సాహెబ్, గుమ్మడిదల సుబ్బాయమ్మ, మహాత్ముని కార్యదర్శి, కొండావెంకటప్పయ్యపంతులుగారు, తెన్నేటి సత్యనారాయణగారు వగైరాలు వచ్చారు. ప్రార్థన అయిన వెంటనే గాంధీ మౌనవ్రతం ప్రారంభించారు. వేసవికావడంతో అరుబయట ఆయన పరివారం పడుకొన్నారు. ఆయనకు మామూలు పట్టెమంచంనకు వెదురుబద్దలు కట్టి దోమతెరకూడా ఏర్పాటుచేశారుని ఆ రాత్రి ఒక్క దోమ కూడా లేదని చల్లని మలయమారుతం వీచిందని సూర్యారావుగారు తన డైరీలో వ్రాసేరు. ప్రక్కనేగల లోకలుఫండ్ సత్రంలో ఇతర బృందాన్కి బోజనాలు,బస ఏర్పాటుచేశారు. సూర్యారావుగారి భార్య పురిటినిమిత్తం కాకినాడలో ఉన్నందున తల్లి గౌరమ్మగారు ఆతిధ్య భాద్యత వహించారు. ఇల్లంతా గాంధీ పరివారానికి అప్పజెప్పి గౌరమ్మగారు వేరే వెనుకదొడ్లోను సూర్యారావుగారు ప్రక్కన కరణంగారి ఇంటి అరుగుపైన విశ్రమించారు. మహాత్ముడు మరునాడు ఉదయం (6-5-29సోమవారం) 8గం॥ల వరకు ఆ దొడ్డివైపున కూర్చుని పనిచేసుకొన్నారు. గాంధీగారికి ఆయన కూర్చొన్న పెరటి వెనుక మరియొక స్థలంలో కమోడ్‌ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడింది. 9గం॥లకు ఆయన స్నానాలగదిలో స్నానంచేసి 10గం॥లకు పెద్దయింటిలోని తూర్పుపెద్దగదిలోకి మకాంమార్చారు. ఆరోజుకూడా పగలంతా మౌనవ్రతం. అందుచే కస్తూరిబాగాంధీ బోజనం చేయలేదు. కేవలం పండ్లు, పెరుగు తీసుకొన్నారు. గాంధీమహాత్మునికి ఆమెయే స్వయంగా అహారం తయారుచేశారు. తోటకూరపచ్చిది బాగా నూరించి అందులో ఉప్పుకల్పి ఇవ్వగా గాంధీగారు అదే ఆహారంగా లోపలి గదిలో కూర్చుని తీసుకొన్నారు. గాంధీగారికి దక్షిణాఫ్రికాలో పరిచయంఅయిన ఇమామ్‌సాహెబ్ గారు ఉదయం బత్తాయిపండ్లు, బ్లాక్‌కాఫీ (పాలుపంచదార లేకుండా) తీసుకొన్నారు. గౌరమ్మగారు వంటచేస్తే కొండావెంకటప్పయ్యగారు భోజనం చేశారు.

గాంధీగారు, చల్లబడేవర్కు ఆ గదిలో కూర్చొని మౌనవ్రతం, ప్రార్థనలు జరిపేరు. ఆ రోజుగాంధీగార్కి మౌనవ్రతం కావడంతో అయనకు నిర్మలమైన వాతావరణం కోసం నిశ్శబ్ధత పాటించారు. ప్రక్కనే గోదావరిలో లాంచీలు కూతలువేయకుండా ఆపివేశారు. రోడ్డుమీద బండ్ల ట్రాఫిక్ అకులవారి వీధి (శివాలయం వీధి) గుండా డైవర్టచేశారు. సాయంకాలం అయ్యేసరికి గాంధీగారిని చూడటానికి చుట్టుప్రక్కల ప్రాంతాలనుంచి

సహితం విపరీతంగా జనసమూహం వచ్చారు. దొడ్లు, వీదులు జనసమూహంతో నిండిపోయాయి. చాలామంది స్త్రీలు గాంధీగారికికానుకలు సమర్పించారు. గాంధీగారు సాయంకాలం 4గం॥లకు భోజనంచేసారు. తిరిగి రాత్రి గడిపిన ప్రదేశాన్కి వెళ్ళి చీకటిపడేవరుకు ప్రార్ధనలు చేసారు. చీకటిపడేటప్పటికి గాంధీమహాత్ముడు తిరుగు ప్రయాణాన్కి సిద్ధమయ్యారు. సూర్యారావు గారి తల్లి వద్దకు వచ్చి గాంధీగారు సెలవు తీసుకొంటానని హిందీలో చెప్పగా కొండావెంకటప్పయ్యగారు తెలుగులో అనువదించి చెప్పారు. ఇచ్చట రెండు రోజులు ఉంటారని అనుకొంటున్నాను అప్పుడే వెళ్ళిపోతున్నారా? అని గౌరమ్మగారు గృహస్థమర్యాదతో తెలుగులో అన్నారు. వెంకటప్పయ్యగారు హిందీలో విషయం చెప్పేరు. దీనికి మహాత్ముడు హిందిలో "నాకు ఉండాలనే ఉంది ఈయనే తీసుకొని వెళ్ళుపోతున్నాడని" వెంకటప్పయ్యగారిని చూపించారు. తిరిగి తెలుగులో వెంకటప్పయ్యగారు ఆమెకు విషయం చెప్పగా అందరూ నవ్వుకొన్నారు. గౌరమ్మగారు ఆయనకు నమస్కరించగా గాంధీగారు వీధి గుమ్మంవద్దకు వచ్చి గడపదాటి మొదటిమెట్టు పై నిలబడగానే సూర్యారావుగారు సాష్టాంగపడి ఇంగ్లీషులో "లోట్లు ఉన్న క్షమించవలసినది" అన్నారు. వెంటనే గాంధీ "I feel most Comfortable here and all the arrangements are excellent I am specially pleased with the Commode "అన్నారు. (గాంధీగార్కి వెస్టైన్‌స్టైల్ కమోడ్ అలవాటని అప్పటి హైస్కూలు హెడ్‌మాష్టరు ద్వేదులశితారామయ్యగారు చెప్పగా, పి.డబ్ల్యు.డి. రెస్టహౌసలోను తాటిపాక మిషనరీవారి వద్ద ప్రయత్నంచగా దొరకలేదు. అటుపై అప్పటికప్పుడు ఒక ఎరేంజిమెంట్‌చేయబడింది.) గాంధీగారు గుమ్మంవద్దనుండి నడుస్తూ వీధి గేటువరుకు వెళ్ళేరు. అక్కడ గాంధీ కస్తూరిబాయి మొదలైనవారు కారు ఎక్కినారు. సూర్యారావుగారు కారుపుట్‌బోర్డుపై నిల్చొని విపరీతమైన జనాన్ని దారి ఇవ్వమని కోరుతూ కారు ప్రయాణంసాగించారు. కారు తిన్నగా మీటింగ్‌స్థలానికి చేరింది. రోడ్డుపై పంచాయితీ వారు గ్యాస్‌లైట్లు ఏర్పాటుచేశారు. కొత్తపేటలో అల్లూరి వెంకటసూర్యనారాయణరాజుగారి వేండ (ప్రస్తుతం ఆంధ్రాబ్యాంక్‌గలచోటు) వెనుకభాగాన గల కోడి మునేశ్వరరావుగారి ఊడ్పుదేలలో మీటింగ్ ఏర్పాటుచేయబడింది. గాంధీగారు ఉపన్యాసంకు పెద్దవేదిక ఏర్పాటుచేశారు. ఆ వేదికపై నుంచి గాంధీగారు ప్రసంగించగా మల్లాదిరామమూర్తిశాస్త్రి గారు తెలుగులోకి తర్జుమా చేశారు. అక్కడ కూడా కానుకలు సమర్పించారు. మీటింగ్ అయిన తర్వాత మళ్ళీ కారులో బయిలుదేరి గాంధీ పరివారం సూర్యారావుగారి ఇంటివరుకు వచ్చారు. పుట్‌బోర్డుపై నుండి సూర్యారావుగారు దిగి శెలవు పుచ్చుకొన్నారు. కారు తిన్నగా తాటిపాక మీదుగా గన్నవరంఅక్విడెక్ట్ తొట్టిలో నుండి (వేసవికి కాల్వకట్టి వేసినందున)గన్నవరం





పి.డబ్ల్యు.డి. రెస్టహౌసకు చేరి రాత్రి అక్కడ మకాంవేశారు. మరునాడు ఉదయం గాంధీగారు అక్విడెక్ట్‌పై షికారుచేసి బొబ్బర్లంక, రాజమండ్రి మీదుగా సీతానగరం చేరినారు.

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఒక గొప్పనాయకుడు రాజోలులో 24గం॥లు మకాంచేయడం అనూహ్యమైనది. ఇది రాజోలు గడ్డచేసుకొన్న పుణ్యం. ఇచ్చట ప్రజలలో స్వాతంత్రోద్యమం చైతన్యం చూసి మహాత్మాగాంధీ ఉప్పొంగి ఆ తరువాత స్వాతంత్ర్యసమరంలో భాగంగా ఉప్పుసత్యాగ్రహం వంటి ఒక ఉద్యమాన్ని ప్రకటించి దేశంలో 4ఊళ్ళను ఇందుకు ఎంపికచేశారని అందులో రాజోలును కూడా ఎంపికచేశారని ఆ తరువాత ఉద్యమం విరమించారని సూర్యారావుగారు చెప్పేవారు. ( ఆ ఉద్యమం పేరు జ్ఞాపకం లేదు) నిజంగా రాజోలులో ఆ ఉద్యమం జరిగి ఉంటే చరిత్రపుటాలలో రాజోలుకు చెరగని స్థానం సంపాదించేది.

1930లో ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొనటాన్కి సీతానగరం ఆశ్రమవాసులు జిల్లాపర్యటన చేస్తూ డా॥ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం గారు ( ఆశ్రమస్థాపకులు) నాయకత్వం క్రింద సుమారు వందమంది వాలంటీర్లు రాజోలు వచ్చారు. వారంతా సూర్యారావుగారి ఇంట్లో బోజనంచేశారు. అందుపై సూర్యారావుగారిపై Harbouring case నమోదుచేశారు. కాని కేసు నడవలేదు. ఆ తరువాత 1930 మేలేక జూన్‌నెలలో కళావెంకట్రావ్ మొదలగు వారిపై కేసు పెట్టి అమలాపురం ఆర్.డి.ఓ. గారు శివకోడు రెస్టహౌసలో కేసువిచారించి శిక్షవేశారు. ఆ రోజు సూర్యారావుగారి నాయకత్వంలో గ్రంధినరసింహంమూర్తి మొదలగు వారు అక్కడకు వెళ్ళారు. అక్కడనుండి వెంకట్రావ్ వగైరా శిక్షితులను సంతమార్కెట్‌లో ఉంచిన బస్సుదాకా కాల్వగట్టుపై నడిపించి తీసుకుచ్చారు. శిక్షితులను బస్సు ఎక్కించారు. చాలామంది జనం చేరారు. సూర్యారావు వగైరాలు బస్సుముందు గాంధీకి జై అంటూ నినాదాలు చేస్తూ నడిచారు. బస్సు బజారుగుండా కాల్వరోడ్డుదాకా వెళ్ళింది. (నాగమ్మగారి ఇల్లు) పోలీసు సబ్‌ఇన్స్‌పెక్టర్ గారు డ్రైవరుప్రక్కసీటులో పుట్‌బోర్డ్‌పై కాలు పెట్టుకొని కూర్చొన్నారు. బస్సుస్టార్ట్ అయింది. జనం తిరుగుతున్నారు. ఇంతలో ఎవరో కుర్రవాడు సబ్‌ఇన్స్‌పెక్టర్ కాలిమీద ఒక తన్ను తన్నాడు. (డా॥ నున్నసోమరాజుగారయి ఉంటారని వ్రాసిఉన్నది). వెంటనే ఎస్.ఐ.గారు వెనుకకు తిరిగేసరికి జానవెంకన్న, బ్రహ్మం, కనిపించారు. అప్పుడు ఏమిచేయలేక కారుపోనిచ్చారు. తిరిగి రాజోలు వచ్చి వారి ఇరువురితో పాటు గ్రంధినర్సింహమూర్తి, కోళ్ళరామన్న, వగైరాలపై న్యూసెన్స్ కేసు పెట్టారు. ఇది కేవలం కక్షగా పెట్టిన కేసు. కళావెంకట్రావ్ గారి అరెస్ట్ సందర్భంలో వచ్చింది కాబట్టి సూర్యారావుగారు, నున్నవసంతరావ్ గారితో చర్చించి ప్లీడర్‌లతో సంప్రదించి డిఫెన్స్ పెట్టించారు. చాలమంది ప్లీడర్లు డిఫెన్స్‌లో

పాల్గొన్నారు. ఈ డిఫెన్స్‌తో పోలీసులు ఖంగుతిన్నారు. అయినా ముద్దాయిలకు అప్పటి సబ్‌మెజిస్ట్రేట్ మాలేశేషయ్యనాయుడు గారు, శిక్షలు విధించారు. గ్రంధినరసింహమూర్తిగారికి 50 రూ॥లు జరిమానా, మిగతావార్కి జైలుశిక్ష వేశారు. వీరికి డిఫెన్స్ పెట్టినందుక్కు సూర్యారావుగారిపైన నున్న వసంతరావుగారిపైన అప్పటి సి.ఐ. తిమ్మరాజు శేషగిరిరావుగార్కి కోపంవచ్చింది. అందుపై విశ్వేశ్వరాయపురం నుంచి కొంతమంది సత్యాగ్రహులు వస్తే 'వారికి సూర్యారావుగారు భోజనం పెట్టేరని నున్న వసంతరావుగారు ఆశ్రయంమిచ్చారని కేసు పెట్టారు. అందుకు గాను సూర్యారావుగారిని 8-7-1930 న అరెస్ట్ చేశారు. బస్సుగేట్ వద్దనుంచి సి.ఐ. గారు వచ్చి సింహద్వారం వద్ద నిల్చున్నారు. చాలామంది జనం వచ్చారు. సూర్యారావుగారికి చాలామంది వచ్చి నమస్కరించపోయేసరికి సి.ఐ.అడ్డుపెట్టాడు. అందుపై సి.ఐ.ని **'Have you arrest me ?'**అని ప్రశ్నించారు. సి.ఐ.గారు 'yes' అన్నారు. అందుపై జనం జయజయ ధ్వనాలు చేశారు. సూర్యారావుగారిని అరెస్టచేసి బస్సులు ఎక్కించుకొని నున్నవసంతరావుగారిని ఎక్కించుకొని ఉదయం 9గం॥లకు అమలాపురం సబ్‌జైలుకు తీసుకువెళ్ళి అందులో ఉంచారు. అందరూ సీతానగరం వాలంటీర్లకు భోజనంపెట్టినందుకే కేసు పెట్టారని అనుకున్నారు. కాని అది మరియొక తప్పుడు కేసుగా పెట్టారు. రాజోలునుంచి ప్లీడరుగారు చేబియ్యంబుచ్చిబ్బాయిశర్మగారు, అల్లూరి పెద్దవెంకటసూర్యనారాయణరాజుగారు నాగుల్లంక నుండి ఆరుమిల్లివెంకటరత్నం గారు, అరుమిల్లి సుబ్బారావుగారు, జయంతిగురుమూర్తిగారు వగైరాలు వచ్చారు. తరువాత కేసు విచారణచేసి కేసుకొట్టేశారు.

ఆ తరువాత సూర్యారావుగారింట్లో ఖాదిపరిశ్రమాలయం స్థాపించారు. 4-12-32 మధ్యాహ్నం ఒంటిగంటకు ఖాదీవిక్రయం ప్రారంభించబడింది. 10-1-34న ఈ ఖాదీ యావత్తు తాలూకా కాంగ్రెసు కార్యదర్శి బులుసుసీతరామశాస్త్రిగారికి అప్పజెప్పారు. 21-3-34న సూర్యారావుగారు ఆయనకు కాంగ్రెసు కార్యదర్శి ఛార్జీ కూడా అప్పగించారు.

ఇక 1930నుండి ఆరుమిల్లివెంకటరత్నంగారు, అరుమిల్లిసుబ్బారావుగారు, బిక్కినవీరాస్వామిగారు, ముప్పర్తి వెంకటరత్నం గారు, వాద్రేవు రామమూర్తిగారు, ఎర్రంశెట్టి అయ్యప్పనాయుడు గారు, గొబేటి సత్యనారాయణగారు, చేబోలురెడ్డిదీక్షితులు గారు, దేశరాజురామచంద్రరావుగారు( వీరు అయిదుగురు ప్లీడర్లు) మల్లాదిరామమూర్తిశాస్త్రి గారు, కస్తూరివెంకటేశ్వర్లు గారు, ఎర్రాప్రగడ బాపిరాజుగారు, రుద్రరాజువెంకటరామరాజుగారు, కాచీభట్లజగన్నాథం వగైరాలు ఎంతోమంది స్వాతంత్ర్యఉద్యమంలో రాజోలులో పాల్గొన్నారు. వీరంతా కలసి 23-12-35న కాంగ్రెస్సు స్వర్ణోత్సవాలు జరపటం గురించి ఒక కమిటీ ఏర్పడింది. దానికి కస్తూరి వెంకటేశ్వర్లుగారు కన్వీనరుగా వ్యవహరించారు.





28-12-35 లగాయితు 31-12-35 వరుకు నాల్గురోజులు స్వర్ణోత్సవాలు కొత్తపేట వాద్రేవురామమూర్తి గారి ఖాళీస్థలంలో జంగాయి ప్రమిదలతో నూనె దీపాలుపెట్టారు. 2-1-36న బహుమతిప్రదానం 3-1-36న పేదలకు అన్నదానం జరిగింది. సూర్యారావుగారి ఇంటి ఎదురుగాగల స్థలంలో పెద్దరావిచెట్టు ఉండేది. అక్కడే స్వాతంత్ర్యసమర పోరాటం సమావేశాలు జరిగాయి. ప్రస్తుతం లైబ్రేరీ ఉండేచోట ఖాళీస్థలం ఉండేది. అందులో గుట్టలుగుట్టలుగా విదేశీ వస్త్రాలు శ్రీసూర్యారావుగారిఆధ్వర్యంలోతగలబెట్టబడ్డాయి. ప్రముఖ మహిళాస్వాతంత్ర్యసమరయోధురాలు దువ్వూరి సుబ్బమ్మ గారు తరచు రాజోలు వచ్చి ఉద్యమంలో పాల్గొనేవారట. భర్తను భరించేవారు "ఖద్దరు చీర బరువు బరించలరా" అని స్త్రీలను ఉత్తేజపర్చి ఖాదీవస్త్రాలు ధరింపజేసి ఉద్యమాన్ని నడిపేవారట. ఈమె రాజమండ్రిలో నడిపే స్కూలుకోసం 1930 అక్టోబరు2,3తారీఖుల్లో మానేపల్లి, రాజోలు వచ్చి చందాలువసూలుచేసేరట.

2-1-38న మోరిలో తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెస్ మహాసభకు శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు అధ్యక్షత వహించారు. ఇక క్విట్‌ఇండియాఉద్యమం వచ్చేసరికి నున్ననారాయణరావుగారు అకుల బులిస్వామి వగైరాలు ఉద్యమాలు నిర్వహించారు. కాంగ్రెస్‌వారి సత్యాగ్రహం అణచటాన్కి అప్పట్లో సుబ్బారావు అనే సర్కిలుఇన్స్‌పెక్టర్‌ను నియమించారు. ఎక్కడ కాంగ్రెస్ సమావేశం జరిగినా ఈ సుబ్బారావు దండోరా వార్ని తీసుకొనివచ్చి డప్పులవాయింపచేసి మీటింగ్‌ను డిస్టర్బు చేసేవారట. అందుకే ఈయనను డప్పులసుబ్బారావని వ్యవహరిస్తారు. కొత్తపేట దగ్గర రైటింగ్‌కేసు వాడపల్లి సమయంలో కూడ ఈయన రాజోలు సి.ఐ.గా ఉన్నారని చెబుతారు.

కడలికి చెందిన కాశీభట్ల జగన్నాథంగారు వందేమాతరం గాంధీకి జై అంటూంటే ఆయనకు కడలిరోడ్డుపై పడవేసి ఈయన బూటుకాళ్ళతో మోహం మీద త్రొక్కి నోట్లో సారాపోయించాడట. అట్లాగే ఈయన సోదరులు కాశీభట్లహనుమంతురావు (తరువాత రాజోలు హైస్కూలులో డ్రాయింగుటీచరుగా పనిచేశారు.) గారిని అంతర్వేది సముద్రం వద్దకు తీసుకువెళ్ళి సముద్రంలో ముంచటం లాఠీతో కొట్టడం ఆయన గాంధీకి జై అంటూండటం, మళ్ళీ ముంచడం కొట్టడం ఇలా స్పృహతప్పేదాకా చేసి సముద్రం ఒడ్డున వదిలేసి వచ్చేశారని చెబుతారు.

ఖాదీపరిశ్రమతోపాటుగా కుటీరపరిశ్రమగా అభివృద్ధి చేయడాన్కి దంపుడుబియ్యం వాడకాన్ని ప్రచారం చేయడానికి వెన్నేటిసత్యనారాయణగారు ది. 8-8-39 న వచ్చిన రాజోలు వీరభానుపురమందిరంలో అమలాపురం ఆర్.డి.ఓ. అధ్యక్షతన సమావేశం జరిగింది. ఇందుకు సూర్యారావుగారు కార్యదర్శిగా ఒక కమిటీ ఏర్పడింది.

1940-41లో వ్యక్తి సత్యాగ్రహం జరిగింది. 1-1-40న తాటిపాకలో చిక్కనవీరాస్వామిగారు సత్యాగ్రహం చేసి యుద్ధానికి మద్దతు ఇవ్వవద్దని ప్రజలకు ఉద్బోధించినందున ఆయనను అరెస్టు చేసి ఒక సం॥ జైలు రూ॥1000 జరిమానా గావించారు. ది.6-1-41న యఱ్ఱాప్రగడ బాపిరాజుగారు రాజోలు ఎల్.ఎఫ్. సత్రంవద్ద వ్యక్తిసత్యాగ్రహం చేయడంతో ఆయనను వెంటనే అరెస్టుచేసి పోలీసుస్టేషనుకు తీసుకువెళ్ళి అక్కడనుండి అమలాపురం సబ్‌డివిజనలు ఆఫీసరు వద్ద హాజరుపర్చగా ఆయన బాపిరాజుగార్కి 1సం॥ము జైలుశిక్ష 1000రూ॥లు జరిమానా విధించారు. అల్లాగే 20-11-41న ఉదయం 9గం॥లకు శివకోడులో నున్నానారాయణరావుగారు సత్యాగ్రహంచేస్తే ఆయనకు 6మాసములు జైలు రూ॥800లు జరిమానా విధించారు. ది.8-1-41న మోరిలో ముప్పర్తి వెంకటరత్నంగారు సత్యాగ్రహం చేస్తే ఆయనకు 6మాసాలు జైలు రూ॥1000 జరిమానా విధించారు.

9-8-42న క్విట్ఇండియా ఉద్యమం జరిగినప్పుడు నాయకులను బొంబాయిలో అరెస్ట్ చేశారని ప్రజలకు ఆలస్యంగా తెలిశాక 14-8-1942న రాజోలులో పెద్దబంద్ జరిగింది. పేపర్లురాలేదు. రవాణాస్థంభించింది. హైస్కూలు విద్యార్థులు క్లాసులు బహిష్కరించారు. 25-8-42న యఱ్ఱాప్రగడబాపిరాజుగారిని రాజోలులో డిఫెన్సు ఆఫ్ఇండియా రూల్స్ క్రింద నిర్బంధలోకి తీసుకొన్నారు.

ఎంతోమంది త్యాగమూర్తులు మహాత్మాగాంధీ నాయకత్వంలో స్వాతంత్ర్యఉద్యమంలో పాల్గొని దేశానికి స్వాతంత్ర్యం తెచ్చారు. చంద్రుడికో నూలు పోగు లా ఎవరికీ తీసిపోకుండా రాజోలు ప్రాంతంలో ఎక్కువగా ఈ ఉద్యమం నడిచింది. మహాత్మాగాంధి కూడ రాజోలు రావడం దీనికి తార్కాణం. చివరకు 15-8-47న స్వాతంత్ర్యంవచ్చింది. 14-8-47, 15-8-47 అర్ధరాత్రి భారతప్రధాని బ్రిటిషుయూనియన్ జాక్‌జెండాను దింపి భారత జాతీయ త్రివర్ణపతాకాన్ని ఎగురవేశారు. ప్రపంచమంతా నిద్దిరుస్తుంటే భారతజాతిమేల్కోందని జవహర్‌లాల్‌నెహ్రూ జాతికి సందేశాన్ని యిచ్చారు.

15-8-47 ఉదయం నుండి రాజోలు ప్రజలలో స్వాతంత్ర్య ఉత్సవాన్ని ఎంతోఘనంగా పంచాయితీప్రెసిడెంట్ పొన్నాడసూర్యారావుగారి ఆధ్వర్యంలో జరుపుకొన్నారు. తాలూకాఆఫీసులో తహశీల్దారు, పంచాయితీ, భూమి తనఖాబ్యాంకు మరియు బోర్డుహైస్కూలువద్ద, గౌతమీపుష్కరపాఠశాల వద్ద పంచాయితీ ప్రెసిడెంటు పొన్నాడ శ్రీరామవెంకటసూర్యారావు గారు స్వేచ్ఛాభారతదేశపు మొదటి త్రివర్ణపతాకములను ఎగురవేశారు. పంచాయితీకార్యాలయంవద్ద (మెయిన్‌రోడ్డు) స్కూలు విద్యార్థులకు పరుగుపందాలు నిర్వహించారు. బహుమతి ప్రధానంచేశారు. వీధి వీధంతా, ఇళ్ళల్లో పండుగ వాతావరణం శివకోడు ఆలయంనుండి పెద్దసింహ వాహనాన్ని అంతకుముందు తీసుకువచ్చి దానిపై భారతమాత ఫొటోపెట్టి భాజాబజంత్రీలతో శంఖానాదాలతో





సూర్యారావుగారింటి వద్దనుండి సాయంకాలం 3గం॥లకు బయలుదేరి ఊరంతా పెద్ద ఊరేగింపు జరిగింది. ఎక్కడ నుంచో శంఖంవూదేవారిని ముందే రప్పించి వార్కి 4రోజులు ముందునుంచి ట్రైనింగు ఇచ్చి ఊరేగింపులో శంఖానాదాలు చేయించారు. పొన్నాడరామంగార్ని, వీరభద్రరావుగార్ని (బాబులుగారు) యూనిఫారం వేయించి గుర్రాలపై ముందర నడిపారు. (అప్పటి ఆరేళ్ళు నిండిన నేను కూడా ఎర్రటోపి, తెల్లచొక్కా, ఎర్రనిక్కరు మరియొక ట్రైకలర్ క్రాస్‌బ్యాండ్‌తో ఊరేగింపులో పాల్గొన్నట్లు గుర్తు నాకు ఉన్నది.) పంచాయితీవారు రాత్రి బజారు అంతా వెదురుకర్రలతో స్టాండులు ఏర్పాటు చేసి మట్టితో ప్రమిదలు చేయించి రెండువేళ్ళంగుళాలు పొడుగున రోడ్డుకిరువైపులా నూనెదీపాలు వెలిగించారు. పార్కువద్ద రాత్రి రంగురంగుల బాణాసంచా సుమారు 2గం॥లు కాల్చారు. వేలాదిజనం ఈ ఉత్సవాల్లో పాల్గొన్నారు.

అహింసాసిద్ధాంతాలతో "సత్యాగ్రహం" అనే పదాన్ని సృష్టించి యావత్‌ప్రపంచాన్ని కుదిపివేసిన స్వాతంత్ర్యరథసారధి మహాత్మగాంధీ ఆ స్వాతంత్ర్యవాయువులు కనీసం ఒక సంవత్సరం పైనా పీల్చుకోకుండానే 30-1-1948న గాడ్సే కిరాతకుని తుపాకీకి ఆయన ఆఖరిఊపిరి అనంతవాయువులలో లీనమయింది. దేశంతో పాటు రాజోలులో కూడ ఆవార్త దావాలనంలా వ్యాపించింది. అప్పటికి రాజోలులో చింతాశివయ్యగారి హోటలువద్ద, గోదావరిగట్టు పైగల పార్కులోను ఒకరిద్దరి ఇళ్ళవద్ద మాత్రమే రేడియోలు ఉన్నాయి. ఈ ఘోరవార్త వింటూ పార్కులోను చింతాశివయ్యగారి హోటలు వద్ద కన్నీళ్ళతో జనం ఆ సాయంత్రం నుండి రేడియోలు వింటూ ఆ రాత్రంతా ఎవరు పచ్చిమంచినీళ్ళు కూడ ముట్టకుండా మెలుకువగానే ఉన్నారు.

1950వ సం॥ జనవరి 26న కొత్తరాజ్యాంగం అమలులోకి వచ్చి భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించి డా॥రాజేంద్రప్రసాద్ మొదటి రాష్ట్రపతి అయ్యారు. ఈ ఉత్సవం కూడ రాజోలులో పంచాయితీప్రెసిడెంటు పొన్నాడసూర్యారావుగారి ఆధ్వర్యంలో జరిగింది. ఆరోజు కూడ పతాకావిష్కరణం తరువాత సాయంకాలం పెద్దఊరేగింపు జరిగింది. పాతబస్‌స్టాండ్ వద్ద గల రామాలయం రథాన్నికి కాషాయ, తెలుపు, ఆకుపచ్చరంగులువేసి అలంకరించి భారతమాతఫొటోతో పెద్ద ప్రజాస్వామ్యదేశ ప్రగతిరథం సూచికగా ఊరేగించారు. (నేను మరియు నా స్నేహితుడు భారతమాత ఫొటోకు నెమలి విసినకర్రలతో ఇరువైపులా విసురుతూ నిల్చొన్నాము)

1952లో రావిచెట్టు సెంటరులో సుతాపల్లివారు గాంధీ విగ్రహాన్ని నెలకొల్పారు. తరువాత 1984లో ఇందిరాగాంధీవిగ్రహాన్ని అక్కడ నెలకొల్పేరు. 14-11-89న నెహ్రూగారి విగ్రహాన్ని పాతబస్టాండ్‌లో నెలకొల్పేరు.

స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడం ఎంతకష్టం అయిందో దానిని పరిరక్షించుకోవడం కూడ అంతేకష్టం. ప్రజాస్వామ్యానికి పునాదులు వేసిన భారతదేశాన్ని చూసి ఓర్వలేని చైనా, పాకిస్థానలు దురాక్రమణలు మొదలుపెట్టాయి. 1962లో చైనాదాడి జరిగనప్పుడు ప్రజలను చైతన్యపర్చడానికి

రక్షణనిధి వసూలు చేయడానికి అప్పటి రాష్ట్రఆర్థికమంత్రి కాసుబ్రహ్మానందరెడ్డి రాజోలు వచ్చారు. పొన్నాడవారి ఇళ్ళముందు ఖాళీస్థలంలో మీటింగుజరిగింది. చాలామంది నగలు, నగదు కూడ యిచ్చారు. (నేను నాచేతి ఉంగరాన్ని యిచ్చాను) ఆ తరువాత అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి కూడ 1963 జనవరిలో రాజోలు బాలుర హైస్కూలులో జరిగిన మీటింగులో రక్షణ నిధికోసం విజ్ఞప్తి చేశారు. ప్రజలు, సంస్థలు విరాళాలు ప్రకటించారు. అల్లాగే 1965లో పాకిస్థాన్ దాడిచేసినప్పుడు కూడ రాజోలు ప్రజలు రక్షణనిధియిచ్చారు. పాకిస్థాన్ దాడిని తిప్పికొట్టి అప్పటి ప్రధానమంత్రి లాల్‌బహదూర్‌శాస్త్రి విజయోత్సాహంతో విజయభేరి మ్రోగిస్తూ జై జవాన్, జై కిసాన్ అంటూ 10 డిసెంబరు 1965న రాజమండ్రి వచ్చినప్పుడు రాజోలునుంచి ఎంతోమంది ప్రత్యేక బస్సులలో వెళ్ళి వారిని సందర్శించారు. సరిగ్గానెలకు జనవరి 10- 1966న ఆయన టాష్కెంటులో మరణించడం ఇక్కడి ప్రజలు తట్టుకోలేకపోయారు.

ఇక ఈ మధ్య జరిగిన కార్గిల్ యుద్ధంలో కూడ రాజోలు వీరుని పాత్ర ఉన్నదని కొంచెం ఆలస్యంగా తెలిసింది. రాజోలులో 15-8-70న వస్త్రవ్యాపారి పిల్లావెంకటసుబ్బారావు దంపతులకు జన్మించిన సార్జంట్ రవిప్రసాద్ ఆతరువాత "AIRFORCE లో చేరి 28-5-99న హెలికాప్టరులో పాకిస్థాన్‌పై దాడికి వెళ్ళి వారు దానిని కూల్చివేయగా వీరమరణం పొందాడు. ఆ విషయం తెలుసుకొన్న రాజోలు పెద్దలు రాజమండ్రి వద్ద లాలాచెరువు వద్ద నివాసం ఉంటున్న అతని భార్య కుటుంబసభ్యులను కలుసుకొని సంతాపం తెలియజేసి అతని స్మృతి చిహ్నంగా రాజోలులో ఒక స్థూపాన్ని నిర్మించి ఆయన జన్మదినమైన 15-8-99న ప్రారంభించారు. అతను పుట్టిన యింటికి (డా॥అప్పారావుగారిఇంటి ప్రక్కన) దగ్గరలో గాదెబాబ్జీగారు దానమిచ్చిన స్థలంలో దీనిని నిర్మించారు. అతను పుట్టిన యిల్లుగల రోడ్డుకు పంచాయితీవారు ఆ రోజునే పిల్లా రవిప్రసాద్ మార్గ్‌గా పేరుపెట్టారు. ఈ రోడ్డును, స్థూపాన్ని రాజోలు బి.సావరం వాస్తవ్యులయిన కల్నల్ టిక్కిశెట్టి కాశీ ప్రారంభించారు. ఆ సాయంకాలం జరిగిన సభలో అమలాపురం డి.యస్.పి. శ్రీనివాస్, రవిప్రసాద్ భార్య వీరపత్ని అనురాధ ఇంకా ఎంతోమంది పాల్గొన్నారు. రాజోలు నుంచి చాలామంది సైన్యంలో కూడ పనిచేశారు. కోటి అంజనరావు, పరమేశు వగైరాలు మాజీసైనికులు వీరి సంఘానికి టైప్‌ఆచార్యులు అనబడే ఎస్.కె.వి.ఆర్. ఎల్. అయ్యంగారి అధ్యక్షులు ఈయన స్వాతంత్ర్యపోరాటంలోను హరిజనసేవకునిగా ప్రముఖపాత్ర వహించారు.

దేశభక్తి కలవారందరికి పైసంగతులు పళ్ళపులకరించి గగుర్పాటు చెందేలా చేస్తాయి. దురదృష్టవశాత్తు యువతలో జాతీయతాభావంకాని, దేశభక్తికాని కొరవడింది. కనీసం ఇటువంటి స్థూపాలు, చరిత్ర వారికి స్ఫూర్తిని కల్గిస్తాయిని ఆశిద్దాం. జై హింద్ జై భారత్.

**భూదానోద్యమం** : వినోబాభావేగారు సర్వోదయంలో భాగంగా వారి దేశంతటా ప్రారంభించిన భూదానోద్యమంలో భాగంగా ఆయన రాజోలు 1956వ సం॥లో వచ్చారు రాజుగారి మేడవద్ద సభ జరిగింది. ఎంతోమంది భూదానాన్ని ప్రకటించారు.





# 16. పంచాయితీ-స్థానికసంస్థలు

అప్పటి రాజోలు తాలూకాలోనే మొదటి పురాతన పంచాయితి రాజోలులో 1922లో ఏర్పడింది. దీనిని రాజోలుపంచాయితీ యూనియన్ అనేవారు. శివకోడు కూడ ఇందులో కలసి ఉండేది. అప్పట్లో ఆ గ్రామంలో భూమి కలిగిఉండి భూమి పన్ను చెల్లించేవారు మాత్రమే ఓటర్లు గా ఉండేవారు. రాజోలు పంచాయితీ యూనియన్‌కు మొదటి అధిపతి రాజోలుకుచెందిన నున్నానారాయణస్వామిగారు. పంచాయితీ అధిపతిని ప్రెసిడెంటు అని వ్యవహరించేవారు. ఆయన 16-10-22నుండి 4-7-25వరుకు ప్రెసిడెంట్‌గా వ్యవహరించారు. తరువాత శివకోడుకు చెందిన మల్లిపూడిరంగప్రసాదరావుగారు 5-7-25నుండి 1-3-28వర్కు ప్రసిండెంటు. ఆ తరువాత వకీలు యజ్ఞంశెట్టి అయ్యప్పనాయుడుగారు 26-3-28 లగాయితు 3-10-34 వరుకు ప్రశిడెంటుగా వ్యవహరించారు. సభ్యులనుండి ప్రెశిడెంటు ఎన్నుకోబడేవారు. మధ్యంతర మెంబరు ఎన్నికలో పొన్నాడసూర్యారావు గారు మెంబరుగా ఎన్నుకోబడ్డారు. అంతకుముందు జరిగిన ప్రెశిడెంటు ఎన్నికలో చింతలపల్లికి చెందిన అల్లూరివెంకటసూర్యనారాయణరాజుగార్కి, అయ్యప్పనాయుడు గారికి మెంబర్లనుండి పోటీజరుగగా అయ్యప్పనాయుడుగార్కి 5ఓట్లు, రాజుగార్కి 4ఓట్లు వచ్చాయి. అయితే తరువాత జరిగిన ఎన్నికలో సూర్యనారాయణరాజుగార్కి 8ఓట్లు, పొన్నాడసూర్యరావు గార్కి 4ఓట్లు రాగా, రాజుగారు పంచాయితీప్రెసిడెంటు అయ్యారు. సూర్యారావుగారు మెంబరుగా రాజీనామా చేశారు. రాజుగారు 14-11-34నుండి 26-11-36 వరుకు ప్రెశిడెంటుగా చేశారు. ఆ తరువాత జరిగిన పంచాయితీ ఎన్నికలలో 29-10-36 న సూర్యారావుగారు రాజుగారి అభ్యర్థి అయిన లాడిస్వామిపై మెంబరుగా గెలిచారు. ఆ తరువాత 19-12-36న జరిగిన పంచాయితీ ప్రెశిడెంట్ ఎన్నికలలో కూనవరంకు చెందిన అల్లూరి కృష్ణంరాజుగారు 6-5ఓట్లతో అల్లూరిసూర్యానారాయణరాజుగారి పై గెలుపొందారు. డా॥ భారతంనరశింహం గారు వైస్‌ప్రెశిడెంట్ అయ్యారు. ఈ పంచాయితీ మొదటి సమావేశం 4-1-37న జరిగింది. అప్పుడు మరణించిన స్వాతంత్ర్యసమరవీరుడు డా॥ బ్రహ్మజోస్యులసుబ్రహ్మణ్యంగారు మృతికి సూర్యారావుగారు సంతాపం తీర్మానం ప్రవేశపెట్టారు, ఆ తరువాత 8-1-37న రాజోలు నుంచి శివకోడుపంచాయితీ విడదీయడాన్కి, అప్పుడే రాజమండ్రి జిల్లాబోర్డుకు ప్రెశిడెంటుగా ఎన్నికయిన నడింపల్లి సుబ్బరాజుగార్కి వినతిపత్రం సమర్పించుటకు తీర్మానించారు. 24-11-37న పంచాయితి సభ్యులు నున్నవసంతరావుగారు భారతనరశింహగారి పై ఉపయోగించిన పరుషపదజాలంపై ప్రెశిడెంటుగార్కి

సూర్యారావుగార్కి ఫిర్యాదు చేయబడింది.

30-11-37 ఉదయం జరిగిన పంచాయితీ అర్జంటు సమావేశంలో అప్పటి మద్రాస్‌రాష్ట్ర స్థానిక స్వపరిపాలన మంత్రి బెజవాడగోపాలరెడ్డి గార్కి ఇవ్వవల్సిన వినతిపత్రం నమూనాను సూర్యారావుగారు తయారుచేయగా పంచాయితీ ఆమోదించారు. అదే ఉదయం 11గం॥లకు ఉమ్మడి మద్రాసురాష్ట్ర స్థానికస్వపరిపాలన మంత్రి బెజవాడగోపాలరెడ్డిగారు, ఉయన పార్లమెంటరీకార్యదర్శి భక్తవత్సలంమొదలియార్, కళావెంకట్రావ్‌గారు, నడింపల్లి సుబ్బరాజుగారు, మల్లిపూడి పళ్ళంరాజుగారు పంచాయితీకి వచ్చారు. 11గం॥లకు వారు నాగుల్లంక వెళ్ళారు.

19-8-38న అప్పటి జిల్లాపంచాయితీ ఆఫీసరు పంచాయితీని సందర్శించారు.

15-10-38న సూర్యారావుగారు దారపురెడ్డి వెంకన్నగారు పంచాయితీ ఇంటిపన్నుల సాధారణ రివిజన్ చేశారు.

5-12-38న పంచాయితీ బోర్డు ఆఫీసు ఆవరణలో మద్రాసురాష్ట్ర రెవిన్యూమంత్రి టంగుటూరిప్రకాశపంతులు గారు ఉపన్యాసం ఇచ్చారు. జిల్లా కలెక్టరు కళావెంకట్రావు గారు కూడా పాల్గొన్నారు.

1939మే నెలలో రాజోలు పంచాయితీనుండి శివకోడును విడదీశారు. ఇందుకు సంభందించి 19-05-39న ఆదేశాలు వచ్చాయి.

రాజోలుపంచాయితీకి వేరుగా నవంబరు1939లో ఎన్నికలు నోటిఫైచేశారు. 18-12-39న పంచాయితీఎన్నికలు జరిగాయి. 19న కౌంటింగ్ జరిగింది. పొన్నాడశ్రీరామవెంకటసూర్యారావు గారు, దారపురెడ్డివెంకన్న గారు, మైలవరపు సుబ్రహ్మణ్యంగారు,తెన్నేటినారాయణస్వామిగారు, పొన్నాద బుచ్చిరామయ్య గారు, జనాబ్ పీర్‌సాహెబ్, చేబియ్యంబుచ్చిఅబ్బాయి శర్మగారు, చెల్లుబోయిన పెంటయ్యగారు, నున్నరాఘవులు వగైరాలు సభ్యులుగా ఎన్నికైయ్యారు. పొన్నాడసూర్యారావుగార్ని 1-1-40నుండి తాత్కాలిక ప్రెసిడెంట్‌గా నియమిస్తూ జిల్లాబోర్డునుండి ఉత్వర్వులు వచ్చాయి. 1-1-40న సూర్యారావు గారు అప్పటికి వైస్‌ప్రెసిడెంట్ అయిన భారతంనరశింహంగారి వద్ద నుండి ఛార్జీ తీసుకొన్నారు. ఆ తరువాత అంటే 5-1-1940న అప్పటి తహశిల్దారు రామమొహనరావునాయ్డు గారు ఎలక్షన్ మీటింగ్ ఏర్పాటుచేసి నిర్వహించారు. సదరు ఎన్నికలలో పొన్నాడ శ్రీరామవెంకటసూర్యారావు గారు ప్రెసిడెంట్‌గాను, దారపురెడ్డి వెంకన్నగారు, వైస్‌ప్రెసిడెంట్ గాను ఏకగ్రీవంగా ఎన్నికైయ్యారు. 19-1-40న పంచాయితీబోర్డు మొదటి మీటింగ్ జరిగింది. రాధాకృష్ణ ప్రెస్ వారు కొన్నిపద్యాలు అచ్చువేసి చదివారు. ఈ పంచాయితీ ఎన్నికలపై రాజోలు డిస్ట్రిక్ట్





మున్సిఫ్‌కోర్టులో ఎన్నికల పిటిషన్ 27-1-40న దాఖలయింది. ఈ పిటిషన్ 31-3-42న కొట్టివేశారు. 10-7-1940వ తేదిన పంచాయితీబోర్డు ఆవరణలో బులుసుసాంబమూర్తి, మల్లిపూడిపల్లంరాజు, యం.రంగయ్యనాయుడు, యం.తిరుమలరావుగారి గౌరవార్థం తేనేటివిందు, ఆ తరువాత బహిరంగసభ జరిగింది. శ్రీ సూర్యారావుగారు ప్రెసిడెంటుగా ఈ పంచాయితీ 2-4-1953 వరుకు చాలా ఎక్కువకాలం జరిగింది. ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు జరిగాయి. 30-1-1941న గోదావరి గట్టుపై రేడియోతో కూడిన పార్కుకు శంకుస్థాపన జరిగింది. 16-10-41న అక్కడి పార్కుప్రారంభింపబడింది. రేడియా ప్రారంభింపబడింది. అప్పటి పశిష్ట సబ్‌డివిజన్ అసిస్టెంట్ ఇంజనీరు **G.M.Gones** దీనిని ప్రారంభించారు. ఆరాత్రి బాణాసంచాలు, హరికథ, డ్రామా జరిగాయి. 1941 మార్చి-ఏప్రియల్ నెలలో రోడ్డు తడిపే బండిని ఆర్డరు చేసి ప్రారంభించారు. పెద్ద ట్యాంక్ తో ఒక గొట్టాన్ని చిల్లులతో గల ఆ బండిలో నీళ్ళు పోసి వేసవిలో ప్రతిరోజు రోడ్లన్నీ తడిపేవారు.7-12-41న చేపలు మార్కెట్టుకు ప్రారంభం జరిగింది. అప్పటి సంత మార్కెట్ (ప్రస్తుతం పంచాయితీ ఆఫీసు వద్ద )23-4-42 మాయి తవ్వబడింది. అది ఇప్పటికీ ఉన్నది. 1942 ఏప్రియిల్, మే నెలలో కోడివారివీధి వద్ద, పాతబస్టాండ్‌వద్ద, పెద్దవంతెనకు ఇరువైపులా, సంతమార్కెట్‌వద్ద కోళ్ళవారివీధి వద్ద పెద్దకాల్వకు పావంచాలు నిర్మించబడ్డాయి. వీటికి పిచ్చిగ కోటయ్య కాంట్రాక్టరు, ఈ పావంచాలు ఇప్పటికీ అలాగే ఉన్నాయి. 24-7-43 వరుకు పంచాయితీ ఆఫీసు డా॥ చిక్కాన సీతారామయ్యగారి ఇంట్లో ఉండేది. ఇది 24-7-43న బజారులో ధరణీప్రగడ రంగారావు గారి ఇంట్లోకి (మొన్నటి వరుకు దీనబందు హోటలు) మారింది. 1960 వరకు అక్కడే ఉన్నది. పూర్వం వనుమలమ్మ గుడి వద్ద వారపు సంత జరిగేది. కాని ఇది ప్రస్తుతం పంచాయితీ ఆఫీసు ఉన్నచోటకి మారింది. కాని 7-8-43న ఈ వారపుసంత మార్కెట్ మళ్ళీ వనుములమ్మగుడి వద్దకు మార్చేరు. ఇప్పటికీ అక్కడే జరుగుతుంది. 5-11-43న లోకల్‌ఫండ్ అడిటర్ గోదావరి బంగారయ్య పంచాయితీని ఆడిట్‌చేసి పంచాయితీ నడుస్తున్న తీరును ఎంతో ప్రశంసించాం.

రాజోలు పంచాయితీకి మొట్టమొదటి EXECUTIVE OFFICERను1944 మే నెలలో నియమించారు. 14-5-1944న రాజోలుపంచాయితీ మొదటి ఎగ్జిక్యూటీవ్ ఆఫీసర్ కోటమాధవశాస్త్రిగారు చార్జీ తీసుకొన్నారు. అతరువాత 25-6-45న రాజోలు పంచాయితీ సభ్యత్వానికి ఏర్పడిన ఖాళీలలో గ్రంధినర్సింహమూర్తి గారు, చిక్కాననరశింహమూర్తిగారు, భారం సత్యనారాయణగారు, దారపురెడ్డి వెంకట్రామయ్యగారు, బత్తుల సుబ్బయ్య సభ్యులుగా ఏకగ్రీవంగా ఎన్నికైయ్యారు. 1946 నుంచి 47లో మైలవరపుసుబ్రహ్మణ్యంగారి

ఇంటివద్ద కొత్తపేట మెయిన్‌రోడ్డు అంతమై ఉండేది. 1946లో భూమిని సేకరించి బి.సావరం రోడ్డుకు కలిపారు. ఇప్పుడు అది రింగురోడ్డు అయింది. అలాగే పాత పశువుల ఆసుపత్రి వద్దనుండి ప్రస్తుతం పంచాయితీ ఆఫీసువరకు గల రోడ్డు ఏర్పాటు చేయడానికి స్థలం సేకరింపబడి రోడ్డువేయబడింది. వీధిలలో కిరసనాయిలు దీపాలు వెలిగించేవారు. ముఖ్యమైన కూడలిలో గ్యాస్‌లైట్లు కూడా ఉండేవి. 1952లో స్మశానంలో ఒక షెడ్డు నిర్మించబడింది. అక్కడ మరియు నున్నవారి బార్వుల వద్ద వంతెన నిర్మాణానికి ఏర్పాట్లు జరిగాయి. ఇంతలో మద్రాసువిలేజ పంచాయితీచట్టం 1952 ప్రకారం పంచాయితీ ఎన్నికలను 1953లో నిర్వహించారు. ఆ ఎన్నికలు ప్రజలునుండి నేరుగా ప్రెసిడెంటును ఎన్నుకొనే పద్ధతి ప్రవేశపెట్టారు. రహస్యబ్యాలెట్‌లో మేజరుపంచాయితీలకు ఎన్నికలు జరిగేవి. మిగతా పంచాయితీలకు చేతులు ఎత్తడం ద్వారా ఎన్నికలు జరిగేవి. 1953లో జరిగిన రాజోలు గ్రామపంచాయితీ ఎన్నికలలో ప్రెసిడెంటు అభ్యర్థిగా పొన్నాడసూర్యారావుగారి మద్దతుతో అప్పటి వరకు వైస్‌ప్రెసిడెంట్ అయిన దారపురెడ్డివెంకన్నగారు, నున్నవసంతరావు గారు, తల్లాప్రగడసూర్యప్రకాశరావు అనే కస్తూరిచిన్నబ్బాయి గారు పోటీపడగా మొదటిసారిగా కస్తూరిసత్యవతమ్మగారనే మహిళ కూడా పోటీచేశారు. నేరుగా జరిగిన ఎన్నికలలో నున్నవసంతరావుగారు ఎన్నికైయ్యారు. ఈయన 1956 వరకు ప్రెసిడెంటుగా ఉన్నారు. ప్రెసిడెంటు కాలపరిమితి అప్పుడు 3సం॥లు మాత్రమే అయితే తిరిగి 1956లో మెంబర్లు ద్వారా ప్రెసిడెంట్ ఎన్నిక ప్రవేశపెట్టారు. అప్పుడు సుతాపల్లి సూర్యనారాయణమూర్తి గారు ప్రెసిడెంట్ గా ఎన్నికైయ్యారు. ఈయన టైంలో పాతబస్టాండ్ నుండి పోస్టాఫీస్ వీధి వరకు మరియు సత్రంనకు ఎదురుగా ఉన్న సందులో పాత పశువుల ఆసుపత్రి వరకు సిమ్మెంట్‌రోడ్లు నిర్మించారు. తిరిగి 1959లో జరిగిన ఎన్నికలలో మెంబర్లునుండి జరిగిన ఎన్నికలో డా॥ నేదునూరి గౌరీపతిరావుగార్కి కస్తూరుచిన్నబ్బాయిగారికి జరిగిన పోటీలో గౌరీపతిరావుగారు 6-4తేడాలో గెలపొందారు. ఈయన1964 వరకుప్రెసిడెంట్‌గా బిక్కిన నారాయణగారు వైస్‌ప్రెసిడెంట్ గా,వ్యవహరించారు. 1960-61లో ప్రస్తుతం ఉన్న గ్రామపంచాయితీభవనం నిర్మించారు. తిరిగి 1964 ఆంధ్రప్రదేశ్ గ్రామపంచాయితీ చట్ట ప్రకారం 1964లో సభ్యుల నుండి ఎన్నికజరిగింది. మొదటిసారిగా ఈ ఎన్నికలలో విద్యావంతులయిన డాక్టర్స్, ప్లీడర్లు పాల్గొన్నారు. డా॥ రాజారావుగారు, ప్లీడర్లు పొన్నాడహనుమంతరావు, జాలెం నరసింహమూర్తి వగైరాలు ఎన్నుకోబడ్డారు. అయ్యగారి నరసింహమూర్తి గారు కొద్ది తేడాలో ఓడిపోయారు. జాలెం నరసింహమూర్తిగారు హరిజన న్యాయవాదిగా రాజోలులో మెజార్టీ బ్రాహ్మణులు గల వార్డులో ఒక బ్రాహ్మణ అభ్యర్థిపై అప్పట్లో విజయం సాధించటం విశేషం. రాజోలు ప్రజల గొప్పతనాన్కి నిదర్శనం. ఆరోజునే జరిగిన సర్పంచి పదవికి (1964నుంచి ప్రెసిడెంట్ సర్పంచ్ అని పేరును చట్టంలో కల్పించారు.) దారపురెడ్డి వెంకట్రామయ్యగార్కి, కె.టి. రాజారావుగార్కి మధ్యపోటీ జరుగగా 7-6ఓట్లతో దారపురెడ్డి వెంకట్రామయ్యగారు సర్పంచ్‌గా ఎన్నికయ్యారు.1964నుంచి 1970వరకు ఈ పంచాయితీ సమావేశాలు ఖచ్చితంగా అసెంబ్లీను పోలిఉండేవి.సంతమార్కెట్లో షెడ్ల నిర్మాణం, సత్రం రిపేర్లు, దొరగారితోట్లో





రోడ్లు ఏర్పాడ్డాయి. తరువాత 1970లో జరిగిన పంచాయితీ ఎన్నికలలో శ్రీ నున్ననాగేశ్వరరావుగారు సర్పంచ్‌గా, పొన్నాడహనుమంతరావు ఉపసర్పంచ్‌గా ఎన్నికైయ్యారు. 1975 నవంబరులో జరిగిన విశ్వాసరాహిత్యతీర్మానం వలన సర్పంచి నున్ననాగేశ్వరరావుగారు తప్పుకోగా 1975డిసెంబర్ 24న ఉపసర్పంచి పొన్నాడహనుమంతరావు సర్పంచి ఇన్‌చార్జిగా ఛార్జి తీసుకొన్నారు. 1981వరకు ఉన్నారు. 1976 జనవరి31 న పార్కు పునర్నిర్మాణము చేయబడి తిరిగి రేడియో ప్రారంభించబడింది.గోదావరి గట్టుపై ప్యాసింజర్ షెడ్డ, స్నానాలరేవు నిర్మింపబడింది. హరిజనవాడకు విద్యుత్ దీపాలు ఏర్పాటు అయ్యాయి. తిరిగి 1981లో సర్పంచ్ నేరుగా ఎన్నుకొనుటకు చట్టం మార్చారు. 1981 మే నెల 27వ తేదిని జరిగిన ఎన్నికలలో పొన్నాడహనుమంతరావు, నున్న నాగేశ్వరరావు, జడ్డు వెంకట్రావు, దారపురెడ్డి వెంకట్రామయ్య, నున్నవసంతరావు వగైరాలు పోటీచేయగా పొన్నాడహనుమంతరావు ఎన్నుకోబడ్డారు. గటిగంటి కృష్ణగారు ఉపసర్పంచ్‌గాఎన్నుకోబడ్డారు. 1953వ సం॥ పొన్నాడశ్రీరామవెంకటసూర్యారావుగారు తన స్వంతభూములు నుండి సుందరమ్మ చెర్వుగట్టునుండి మట్టపర్తి కాల్వగట్టు వరకు సొంతంగా మట్టిరోడ్డు వేశారు. సుమారు 1/2 కిలోమీటరు గల ఈ రోడ్డును ఇరువైపులా చెట్లను మినహాయించుకొని మధ్యభాగాన్ని పంచాయితీకి హనుమంతరావుగారు రోడ్డు నిమిత్తం ఇచ్చేశారు. 1982 వ సం॥లో మొదటిసారిగా రాజోలులో 15మెర్క్యురీలైట్లు 4సోడియంవేపర్‌లైట్లు ఏర్పాటుచేయబడ్డాయి. 1985లో మొదటిసారిగా రాజోలు పంచాయితీ తాలూకు కొన్నిముఖ్యమైన రోడ్లు తారురోడ్లు వేయబడ్డాయి. పార్కులో టి.వి. ఏర్పాటుచేయబడింది పల్లిపాలెల వద్ద వంతెన నిర్మింపబడింది. వాడ్రేవుసుబ్రహ్మణ్యంగారు దానం ఇచ్చినస్థలంలో మహిళామండలిభవనం నిర్మింపబడింది. ప్రోబ్లమ్‌విలేజగాను, మండలకేంద్రంగాను రక్షితమంచినీటి పథకం మంజూరు చేయబడింది. తిరిగి 1998 ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికలలో శ్రీ గటిగంటి కృష్ణగార్కి, శ్రీ జడ్డువెంకట్రావు గార్కి పోటీజరుగగా జడ్డువెంకట్రావుగారు సర్పంచిగా ఎన్నుకోబడ్డారు. దార్లపాపయ్యావారి గారు ఉపసర్పంచి గా ఎన్నుకోబడ్డారు. రక్షితమంచినీటి పథకానికి ప్రారంభం జరిగి 1992లో పూర్తికాగా 1992లో కేంద్రమంత్రి రంగయ్యనాయుడు గారు ప్రారంభించారు. జవహర్‌రోజగార్ పథకాలలో డ్రైన్లునిర్మించబడ్డాయి. పల్లిపాలెం మరియు మట్టావారి గ్రూపులలో విద్యుత్‌లైట్లుఏర్పాటుచేయబడ్డాయి. 1995లో జరిగిన ఎన్నికలలో వెంకట్రావు గార్కి, శ్రీ గటిగంటి కృష్ణగార్కి పోటీ జరగగా గటిగంటి కృష్ణగారు సర్పంచిగా ఎన్నుకోబడ్డారు. డి.సత్యనారాయణ ఉపసర్పంచి అయ్యారు. పంచాయితీఆఫీసు భవనం మరమత్తులు చేయబడి పంచాయితీ ఆఫీసురోడ్డు బాలికల హైస్కూలు వెనుక రోడ్డు, విలేజిచావడిరోడ్డు, పాతపశువులాసుపత్రి రోడ్డు, సిమ్మెంటురోడ్డు వేయబడ్డాయి. శతాబ్దం ఆఖరికి గటిగంటి కృష్ణగారు సర్పంచ్‌గా ఉన్నారు.

రాజోలు పంచాయితీ ముఖ్యమైన ఆదాయం ఇంటిపన్ను, వినోదపుపన్ను, వృత్తిపన్ను మాత్రమే అయితే పంచాయితీసిబ్బంది పూర్వం నుంచి ఎక్కువకావటంతో ఇంచుమించు 70శాతం జీతాలకు

సరిపోయేది. అయితే 1981లో అప్పటి ముఖ్యమంత్రి అంజయ్య పంచాయితీరాజ్‌శాఖా మంత్రి పరకాలశేషావతారం గారు పంచాయితీ ఉద్యోగుల జీతాలు ప్రభుత్వం భరించడానికి నిర్ణయంతీసుకోవడంతో పంచాయితీలు పరిస్థితి కొంతమెరుగయ్యింది. అయితే తరువాత ఎన్.టి.ఆర్. ప్రభుత్వం వారు వినోదపుపన్ను, వృత్తిపన్ను పంచాయితీల నుండి తప్పించడంతో మళ్ళీ పరిస్థితి దిగజారింది. అయితే రాజీవ్‌గాంధీ ప్రవేశపెట్టిన జవహర్‌రోజ్‌గార్ పథకంతో న్యూఢిల్లీ నుండి నేరుగా పంచాయితీల నిధులు రావడంతో మళ్ళీ పంచాయితీల పరిస్థితి మెరుగుపడింది. ప్రస్తుతం ఆ నిధులు కూడ పంచాయితీకి నేరుగా రావడం లేదు. మంచినీరు, రోడ్లు, విద్యుత్, మురుగునీరు సదుపాయం వంటి కనీస పౌర వసతులు కల్పించడాన్కి రాజోలువంటి మేజరుపంచాయితీలకు కష్టమే.

**రాజోలు పంచాయితీ మొదటినుండి మేజరుపంచాయితీ ఈ క్రిందివారు కార్యనిర్వాహఅధికారిలుగా పనిచేశారు.**

1). కోటమాధవశాస్త్రి (1944నుంచి47), 2). అల్లాడి వెంకటసుబ్బారావు (47నుంచి49), 3). ఐ.ఎస్. సుందరరావు (49నుంచి51), 4). వెంకటపతిరాజు (51నుంచి53), 5). పి.వి. సుబ్బారావు, 6). బి. పట్టాభిరామయ్య, 7). కె. చక్రవర్తి, 8). కె.వెంకటప్పరెడ్డి, 9). పి. జనార్ధనరెడ్డి, 10). సయ్యద్ రహీంమొహిద్దీన్, 11). ఎస్.ఆర్.జి.టి. భూపతిరాజు, 12). కె.కొండలరావు, 13). యం. శ్రీరామ్మూర్తి, 14).కె.నారాయణ, 15). వి.నరసింహమూర్తి, 16). జి.రామకృష్ణరావు, 17). నల్లం రామచంద్రరావు, 18). కె. నారాయణ, 19). యం. రాజారావు, 20). జి. జోసెఫ్, 21). యస్. ప్రభాకర్‌రావు, 22). జి. నాగేశ్వరరావు, 23). టి.యస్. కొండలరావు, 24). కె. సూర్యారావు, 25). పి. కృష్ణమూర్తిరాజు, 26). కె. సత్యనారాయణమూర్తి, 27). జి. హనుమంతరావు, 28). ఎ. విశ్వేశ్వరావు, 29). పి.వి.వి. సత్యనారాయణ, 30). ఎ.వీరవెంకటరమణ.

రాజోలు పంచాయితీలో శానిటరీ ఇన్స్‌పెక్టర్ పోస్టుకూడా ఉన్నది. అప్పారావు, మస్తాన్ వగైరాలు ఈ పదవి చేశారు. అల్లే ఆఫీసు సిబ్బందిగా పాలికిముత్యాలరావు, నేదునూరి నరసింహరావు వగైరాలు, బిల్లు కలెక్టర్లు గా కోడివెంకటేశ్వరరావు, అరుమిల్లి రామచంద్రరావులు చాలాకాలం నుంచి పనిచేస్తున్నారు. జి. బాగయ్యగారు సుమారు 50 సం॥లు శానిటరీమేస్త్రిగా పనిచేశారు. చెల్లింగివెంకటరెడ్డి, పీరాస్వామి, కదలినరశింహమూర్తి, అటెండర్లుగా ఉండేవారు. ప్రసుతం యం. శ్రీరామమూర్తి, మారెయ్య ఇంకా పనిచేస్తున్నారు. ప్రజారోగ్య సిబ్బందిలో కె. ఆదినారాయణ, అర్జునరావు, ఎర్రమ్మ సత్యవతి, భూపెమ్మ వగైరాలు చాలాకాలం నుంచి పనిచేస్తున్నారు. పూర్వకాలంలో ర్యాలి బంగార్రాజు, వదలివెంకటశాస్త్రి, పాపారావు వగైరాలు ఆఫీసు సిబ్బందిగా ఉండేవారు. మట్టా నర్సయ్య చాలాకాలం లైటర్‌గా పనిచేశారు.





**స్థానికసంస్థలు :** 1922లో పంచాయితీలతో పాటు తాలూకా, జిల్లాబోర్డులవంటి స్థానిక సంస్థలు కూడా ఏర్పడ్డాయి. రాజోలు, అమలాపురం మరియు రాజమండ్రి తాలూకా కలిపి రాజమండ్రితాలూకాబోర్డు ఏర్పడింది. ఈ తాలూకాలు ఫిర్కాలుగా విభజింపబడేవి. రాజోలు తాలూకాలోని 8ఫిర్కాల ఉండేవి. 1924 లో రాజమండ్రి తాలూకా బోర్డుకు జరిగిన మొట్టమొదటి ఎన్నికలలో రాజోలు ఫిర్కానుండి కాంగ్రెస్ తరుపున పొన్నాడ శ్రీరామవెంకటసూర్యారావు గారు నిలబడగా ఈయనపై కాట్రేనిపాడుకు చెందిన పైడిపర్తి నారాయణమూర్తిగారు పోటీచేయగా ఈయన 9ఓట్లతో గెలిచారు. తిరిగి 1928లో జరిగిన తాలూకాబోర్డుకు కాంగ్రెస్ తరపున చింతలపల్లికి చెందిన అల్లూరి చిన్నసూర్యనారాయణరాజు గార్కి పొన్నాడశ్రీరామవెంకటసూర్యారావు గార్కి రాజోలు ఫిర్కాలో పోటీ జరగగా అల్లూరి చినసూర్యనారాయణరాజు గారు 10ఓట్లుతో గెలిచారు. 1932లో వేరే రాజోలు తాలూకాబోర్డు ఏర్పడింది. 17-9-32న సభ్యుల ఎన్నిక జరిగింది. 17-12-1932న జరిగిన ప్రెసిడెంటు ఎన్నికల్లో ప్రెసిడెంట్ చింతలపల్లికి చెందిన అల్లూరి పెదవెంకట సూర్యనారాయణ రాజుగారు కాంగ్రెస్ అభ్యర్ధి పెన్మెత్స సత్యనారాయణరాజు పై కొద్ది మెజార్టీతో గెలుపొందారు.

ఆ తరువాత 1937లో కొత్తగా రాజోలు, అమలాపురం, రాజమండ్రి తాలూకాకు కలిపి ఏర్పడిన రాజమండ్రి జిల్లాబోర్డుకు ఎన్నికలు జరిగాయి. ఈ జిల్లాబోర్డుకు జరిగిన ప్రెసిడెంట్ ఎన్నికలలో కోడూరుపాడుకు చెందిన నడింపల్లి సుబ్బరాజుగారు, మగటపల్లికి చెందిన సూరిశెట్టి స్వామినాయుడు గారిపై ఒక ఓటు మెజార్టీతో గెలిచారు. 31-10-39న జరిగిన జిల్లాబోర్డుకు రాజోలు ఫిర్కానుండి జరిగిన ఎన్నికలలో అల్లూరి పెదవెంకటసూర్యనారాయణరాజు గార్కి కస్తూరివెంకటేశ్వర్లు( కాంగ్రెస )తరపు పోటీ జరుగగా రాజుగారు 150ఓట్లుతో గెలుపొందారు. రాజోలు తాలూకాలోని 8 ఫిర్కాలలో 6సీట్లు కాంగ్రెస్‌కు 2ఇతరులకు దక్కాయి. శ్రీ సూర్యనారాయణరాజు గారు రాజోలు ప్రాంతంలో వంతెనలు, రోడ్లు ఎక్కువ నిర్మాణాలు చేయించారు. పొదలాడ వద్ద లాకు కట్టించారు. తిరిగి 9-9-49న జరిగిన జిల్లాబోర్డు ఎన్నికలలో రాజోలు నుంచి శివకోడుకు చెందిన సున్నినారాయణరావుగారు కాంగ్రెస్ అభ్యర్థిగా ఎ.వి.యస్. నారాయణరాజు గారిపై గెలుపొందారు. ఇంచుమించు 1959వరకు ఈ జిల్లాబోర్డులు కొనసాగేయి. తూర్పుగోదావరిజిల్లాకు మారిన నర్సన్నగారు ప్రెసిడెంట్‌గా ఉండేవారు.

1959లో కేంద్రకమ్యూనిటి అభివృద్ధి మంత్రి ఎస్.కె.దే హయాంలో మూడెంచెల పంచాయితీరాజ్‌వ్యవస్థ ఏర్పడింది. పంచాయితీలు, తాలూకాబోర్డుల స్థానంలో

పంచాయితీసమితులు, జిల్లాబోర్డుస్థానంలో జిల్లాపరిషత్‌లు ఏర్పడ్డాయి. 1959లో రాజోలు ప్రయోగాత్మక బ్లాకు ఏర్పడింది. ప్రస్తుతం గ్రంథాలయం ఉన్న లక్ష్మింశెట్టి చిన్నయ్యగారి భవనంలో ఈ కార్యాలయం ఏర్పడింది. తరువాత రాజోలు, నగరం, పుల్లేటికుర్రు సమితిలు ఏర్పడగా మంగెన గోపాలం గారు రాజోలుకు మొదటిసమితి అధ్యక్షునిగా ఎన్నుకోబడ్డారు. తిరిగి 1964లో జరిగిన పంచాయితీఎన్నికలలో గెలుపొందిన సర్పంచ్‌లు అందరూ సమితిలో సభ్యులు తాటిపాకతో సహా కడలి వరకు రాజోలుపంచాయితీ సమితి అయింది. 1964లో మంగెన గోపాలంగారు అధ్యక్షులుగా రుద్రరాజు భీమరాజుగారు, ఉపాధ్యక్షులుగా ఎన్నికైయ్యారు. 'ప్రస్తుతం కాసుసూర్యనారాయణమూర్తి గారికి విక్రయించబడిన గొర్తి సుబ్రహ్మణ్యం గారిమేడలో సమితి కార్యాలయం పెట్టారు. తిరిగి 1970 సం॥లో పంచాయితీ ఎన్నికల తరువాత సర్పంచ్‌లు అంతా కలసి రుద్రరాజుభీమరాజుగారిని అధ్యక్షులుగా , ఏనుములబాపిరాజుగార్ని ఉపాధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. ఈ కార్యాలయం 1977 ప్రాంతంలో దొరగారి తోటలోని ఒకప్రైవేట్‌బిల్డింగ్‌లోకి మార్చబడింది. 1980లో శ్రీ వాద్రేవుసుబ్రహ్మణ్యం గారు దానమిచ్చిన భూమిలో సమితి భవనం నిర్మించబడింది. అప్పటి మంత్రి రామలింగరాజుగారిచే 7-1-81 తేదీన ప్రారంభించబడింది. 1981జూన్ నెలలో పంచాయితీ సమితి అధ్యక్షపదవులకు నేరుగా ఎన్నిక జరిగింది.రాజోలుపంచాయితీ సమితి ఎస్.సి. లకు రిజర్వేషన్ చేయబడింది. ఈ ఎన్నికలలో మాజీ శాసనసభ్యులు గెడ్డంమహాలక్ష్మి, వోగూరివసంతరావుగారు, దీపాటిలక్ష్మణరావు వగైరాలు పోటీచేయగా వసంతరావుగారు ఎన్నుకోబడ్డారు. తరువాత జరిగిన పంచాయితీ సమితి ఉపాధ్యక్షుని పదవి ప్రతిష్టాత్మకం అయింది. సర్పంచిల నుండి కోఆప్టెడ్ సభ్యులనుండి ఈ ఉపాధ్యక్ష పదవికి రుద్రరాజుభీమరాజుగారికి శ్రీ అల్లూరి వెంకటసూర్యనారాయణరాజు(ప్రస్తుతం ఎమ్మెల్యే) గార్కి పోటీ జరుగగా భీమరాజు గారు గెలుపొందారు. ఆ తరువాత జరిగిన జిల్లా పరిషత్ ఎన్నికలల్లో రాజోలు సమితి అధ్యక్ష్యులు వసంతరావుగారు జిల్లాపరిషత్ ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడి కొద్దిరోజులు ఇన్‌ఛార్జి జిల్లాపరిషత్ ఛైర్మన్‌గాకూడా ఉన్నారు. 1985లో వచ్చిన మండల వ్యవస్థలో పంచాయితిసమితి రద్దయి రాజోలు, మల్కిపురం, సఖినేటిపల్లిమండలపరిషత్‌లు ఏర్పడ్డాయి. 1986లో రాజోలు మండలం పరిషత్‌కు పార్టీపద్దతిని జరిగిన ప్రత్యక్ష్య ఎన్నికలలో రాజోలుకు చెందిన డా॥ జి.రమేష్ గారికి (టి.డి.పి) తాటిపాకకు చెందిన డా॥ కె. రాజేశ్వరరావు గార్కి(కాంగ్రెసు) పోటాపోటీ జరగగా రమేష్ గారు ఎన్నికైయ్యారు. 1995లో పరోక్ష ఎన్నికలలో టి.డి.పి.కిచెందిన చేకూరిశింగరాజుగారు అధ్యక్షనిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. శ్రీ దారపు రెడ్డి సర్వేశ్వరరావుగారు ఉపాధ్యక్షునికి ఎన్నికయ్యారు. ఆ ఎన్నికలలో రాజోలు పంచాయితీలోని మూడునియోజకవర్గాలలో బిక్కిన రామంగారు, శ్రీమతి పాదలాడ సీతారత్నం, శ్రీ దారపురెడ్డి సర్వేశ్వరరావు గారులు యం.పి.టిసిలుగా ఎన్నికయ్యారు. వీరందరి పదవీకాలం మార్చి 2000తో అంతమయ్యింది.





# 17. రాజకీయాలు

1935వ సం॥ గవర్నమెంటు ఆఫ ఇండియా చట్టప్రకారం స్థానికస్వపరిపాలన మొదటిసారిగా ఏర్పడింది. ఆంధ్రప్రాంతమంతా ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో ఉండేది. మొదటిసారిగా 1937 వ సం॥లో ఉమ్మడి మద్రాసురాష్ట్ర అసెంబ్లీఎన్నికలు జరిగాయి. దానితోపాటు కౌన్సిలుకు కూడా ఎన్నికలు జరిగాయి. అప్పుడు కేవలం భూమిపన్ను కట్టే వారికి మాత్రమే ఓటు హక్కు ఉండేది. అందుచే రాజోలు, అమలాపురం తాలూకాలకు కలిపి అమలాపురం నియోజకవర్గం ఒక్కడే ఉండేది. 1937లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో ఈ నియోజకవర్గం ద్విసభ్య నియోజకవర్గం అంటే అందరూ ఓటర్లు కలసి ఒక జనరల్ అభ్యర్ధిని ఒక షెడ్యూలు కులాల రిజర్వు అభ్యర్థిని ఎన్నుకోవాలి. ఆ ఎన్నికలకు అమలాపురం నియోజకవర్గ కాంగ్రెసు జనరలు అభ్యర్థిగా కళావెంకట్రావుగారు, రిజర్వు అభ్యర్థిగా పండులక్ష్మణస్వామి పోటీచేశారు. బ్రిటీషువారికి మద్దతు యిచ్చే పీపుల్సుపార్టీ నుండి జనరలు సీటుకు పిఠాపురం యువరాజు,రిజర్వుసీటుకు గెద్దాడ ముసలయ్య పోటీచేశారు. 13-1-37న మధ్యాహ్నం కళావెంకట్రావుగారు, బిక్కిన వీరాస్వామి గారు, మొదిలి అచ్యుతలింగంగారు, అమలాపురం ప్లీడరు అనుప్పిండి వెంకట్రావుగారు వగైరాలు రాజోలు వచ్చి కాంగ్రెసు అభ్యర్థికి ప్రచారంచేశారు. తిరిగి 20-1-37న సాయంత్రం 7గం॥లకు వాద్రేవురామమూర్తి గారి అధ్యక్షతన రాజోలు సత్రంవద్ద ఎన్నికల మీటింగు జరిగింది. జిల్లాబోర్డు అధ్యక్షులు నడింపల్లిసుబ్బారాజుగారు, సభ్యులు ఆకుల జోగయ్యగారు, ముప్పర్తి వెంకటరత్నం, చాగంటిఅచ్యుతంగారు, బిక్కినవీరాస్వామిగారు వగైరాలు పాల్గొన్నారు. కళావెంకట్రావుగారు, మల్లాది రామమూర్తిశాస్త్రిగారు మాట్లాడి కాంగ్రెసుకు ఓటు వేయవలసిందిగా కోరారు. నడింపల్లి సుబ్బరాజుగారు, కాకినాడకు చెందిన డా॥ లక్కరాజు సుబ్బారావు గారు కౌన్సిలుకు పోటీచేశారు. కాబట్టి నడింపల్లి సుబ్బారాజుగార్కి ఓటు వేయవలసిందిగా కూడా కోరారు. 23-1-37న డా॥ లక్కరాజు సుబ్బారావుగారు రాజోలు వచ్చి ప్రచారం చేసుకొన్నారు. ఎన్నికలు జరిగిన తరువాత 24-2-37న లెక్కింపగా కాకినాద రూరల్ అసెంబ్లీసీటుకు మల్లిపూడి పళ్ళంరాజు (కాంగ్రెస్)గారు, పిఠాపురం మహారాజా (పీపుల్సుపార్టీ) పై 7,726 ఓట్లతో గెలిచారు. అట్లాగే కాకినాద అర్బన్‌సీటుకు జరిగిన ఎన్నికలో కాంగ్రెసు అభ్యర్థి స్వాతంత్ర్యసమరయోధుడు బులుసుసాంబమూర్తిగారు, కొమ్మిరెడ్డి కేశవరామ్మూర్తిగారిపై 2000 ఓట్లుతో గెలుపొందారు. ఇక 25-2-37న జరిగిన అమలాపురం అసెంబ్లీ ఎన్నికలలో కళావెంకట్రావుగారు, 6000 ఓట్లతో గెలుపొందారు. అట్లాగే పండులక్ష్మణస్వామి గారు, గెద్దాడ ముసలయ్యపై 5200 ఓట్లు మెజారిటీతో

గెలుపొందారు. అట్లే తిరిగి 1946లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలకు కళావెంకట్రావుగారు పోటీచేసారు. 17-3-46న దేశరాజురామచంద్రరావు (వకీలు) గారి అధ్యక్షతన పొన్నాడసూర్యారావుగారింటి ముందు ఆవరణలో ఎన్నికల మీటింగు జరిగింది. 20-3-46న ఎన్నికజరిగింది. వెంకట్రావు గారు ఎన్నికయ్యారు. తరువాత గంగలకుర్రుకు చెందిన వాడ్రేవుజగ్గరాజులు గారు కూడ కొంతకాలం అమలాపురం అసెంబ్లీనుండి యం.ఎల్యేగా. పనిచేశారు.

భారతరాజ్యాంగము 26-1-1950నుండి అమలులోకి వచ్చాక 1952లో మొదటిసారిగా దేశమంతటా సాధారణ ఎన్నికలు జరిగాయి. 21 సంబలు నిండిన ప్రతీవ్యక్తికి ఓటుహక్కు యివ్వబడింది. ప్రపంచంలోనే అతిపెద్ద ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో మొదటిసారి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంకు , రాజోలు అసెంబ్లీనియోజకవర్గం ఏర్పడింది. అయితే ప్రస్తుతవు రాజోలు, నగరంఅసెంబ్లీనియోజకకవర్గాలు కలిపి ఒకేద్విసభ్య నియోజకవర్గం కూడా ఏర్పడింది.రాజమంత్రి పార్లమెంటు దిసభ్య నియోజకవర్గంగా ఏర్పడింది. అట్లే ఒక్కొక్క ఓటరు పార్లమెంటుకు ఒక జనరల్, ఒక రిజర్వుడు మెత్తం రెండు, అసెంబ్లీకి ఒక జనరల్, ఒక రిజర్వు మొత్తం రెండు కలసి 4 ఓట్లు వేయవలసివచ్చేది. 1952లో జరిగిన మొదటి రాజోలు ద్విసభ్యనియోజకవర్గ ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థిగా జనరల్ సీటుకు ముప్పర్తి వెంకటరత్నంగారు, రిజర్వుసీటుకు బోయిభీమన్నగారు. ప్రకాశంగారి ప్రజాపార్టీ తరుపున అకుల బుల్లిస్వామిగారు జనరలుసీటుకు పాముల వెంకటరత్నం గారు రిజర్వుసీటుకు, కమ్యూనిస్టుపార్టీ తరుపున అల్లూరి వెంకట్రామరాజు గారు జనరులు సీటుకు, గంజి నాగేశ్వరరావుగారు రిజర్వు సీటుకు పోటీచేశారు. ఈ ద్విసభ్య నియోజకవర్గంలో కమ్యూనిస్టు ప్రాబల్యం కల్గిన ముంగండ, నరేంద్రపురం వగైరాలు ఉండటంతో రాజోలు తాలూకా ఆఫీసులో జరిగిన కౌంటింగులో కమ్యూనిస్టు అభ్యర్థులు అల్లూరివెంకట్రామరాజు, గంజి నాగేశ్వరరావులు గెలుపొందారు. అయితే ఈ ఎన్నికలు తరువాత మద్రాసు నుండి 1-10-53న ఆంధ్రరాష్ట్రం వేరుపడటంతో టంగుటూరి ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఏర్పడిన ప్రభుత్వం ఒక ఓటు తేడాలో పడిపోవడంతో గవర్నరుపరిపాలన ఏర్పడి 1955లో మధ్యంతర ఎన్నికలు వచ్చాయి. ఈ ఎన్నికల సమయానికి కాంగ్రెసు, ప్రజాపార్టీ, కృషికార్, లోకపార్టీలు ఐక్యప్రంటుగా ఏర్పడి కమ్యూనిస్టులకు పోటీయిచ్చాయి. 1952-55నాటికి రాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీబాగా పుంజుకుంది. అందుకు ఐక్యపోరాటం యివ్వడంతో ఈ ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పాటుచేసింది. అయితే రాజోలు ద్విసభ్య నియోజకవర్గంలో ఐక్యసంఘటన అభ్యర్థులు అకుల బుల్లిస్వామిగారు, పాముల వెంకటరత్నంగారు తిరిగి కమ్యూనిస్టు అభ్యర్థులు అల్లూరివెంకట్రామరాజుగారు, గంజినాగేశ్వరరావు గార్లతో పోటీకి దిగగా తిరిగి 1955లో కూడ రాజోలు ద్విసభ్య నియోజకవర్గం నుండి కమ్యూనిస్టు అభ్యర్థులు గెలుపొందారు. 1952 నుంచి రాజమంత్రీ పార్లమెంటు జనరలు అభ్యర్థిగా అమలాపురం న్యాయవాది నల్లారెడ్డి నాయుడుగారు సోషలిస్టుపార్టీ అభ్యర్థిగా. 1957 ఎన్నికలలో కళ్ళల్‌రాజుగారు ఎన్నికయ్యారు. ఫిబ్రవరి 1957లో





బాబుజగ్జీవన్‌రామ్ రాజోలు సంతమార్కెటులో జరిగిన ఎన్నికలు సమావేశంలో ప్రసంగించారు. తిరిగి 1962కి అసెంబ్లీకి, పార్లమెంటుకు ద్విసభ్య నియోజకకవర్గం రాజోలు, నగరం నియోజకవర్గాలుగా విడిపోయి నగరం జనరలు, రాజోలు రిజర్వు అయ్యింది. అల్లాగే రాజమంత్రీ పార్లమెంటు నియోజకవర్గం నుండి అమలాపురం రిజర్వు నియోజకవర్గం విడిపోయింది. ఈ ఎన్నికలలో నగరం నుండి కాంగ్రెసు అభ్యర్థిగా నైనాల గణేశ్వరరావు, రాజోలు రిజర్వు నియోజకవర్గం నుండి గెడ్డం మహాలక్ష్మి మొదటిసారి ఎన్నికయ్యారు. నగరం నుంచి గణేశ్వరరావుగారిపై స్వతంత్ర అభ్యర్థిగా అల్లూరి పెదసూర్యనారాయణరాజుగారు, జనసంఘ అభ్యర్థిగా శ్రీ భమిడిపాటి వెంకటరత్నం గారు పోటీచేశారు. అప్పటికి అంటే 1959లో కమ్యూనిస్టుపార్టీ సి.పి.యం., సి.పి.ఐ. గా విడిపోవడంతో బాగా దెబ్బతిన్నారు. తిరిగి 1967 సాధారణ ఎన్నికలకు రాజోలు జనరులు, నగరం రిజర్వుడు అయ్యింది. నైనాల గణేశ్వరావుగారు రాజోలు నుంచి అకుల బుల్లిస్వామిగారి పైన, గెడ్డంమహాలక్ష్మి నగరం నుంచి తిరిగి ఎన్నికయ్యారు. అట్లే అమలాపురం పార్లమెంటు రిజర్వుడునియోజకవర్గంనుంచి 1962లోను 1967లోను కూడ బి.యస్.మూర్తి గారు గెలుపొంది కేంద్రంలో ఆరోగ్యశాఖ మంత్రిగా చేరారు. ఈలోపుగా 1958 మరియు 1966లో జరిగన శాసనమండలికి స్థానిక సంస్థలనుండి యం.ఎల్.సిగా గుడిమూలకు చెందిన రుద్రరాజురామలింగరాజుగారు ఎన్నికయ్యి 1967లో కాసు బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో దేవాదాయశాఖ మంత్రిగా పనిచేశారు. 1977, 80,89లో జరిగిన పార్లమెంటు ఎన్నికల్లో అమలాపురం నుంచి కుసుమకృష్ణమూర్తిగారు (కాంగ్రెసు) యం.పి. గా ఎన్నికయ్యారు. 1984లో బుచ్చిమహేశ్వరరావు, 1991లో జి.యం.సి. బాలయోగిగారు తెలుగుదేశం తరుపు యం.పిగా ఎన్నికయ్యారు. 1972లో జరిగిన రాజోలు అసెంబ్లీఎన్నికలో మంత్రి రామలింగరాజుగారి పై బిక్కిన గోపాలక్రిష్ణగారు స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేసి గెలుపొందారు. తిరిగి 1978లోని అసెంబ్లీ ఎన్నికలలో రుద్రరాజురామలింగరాజుగారు యం.ఎల్.ఏ. గా ఎన్నికయ్యారు. 1982లో తెలుగుదేశం పార్టీ ఏర్పడిన తరువాత జరిగిన 1983 జనవరి ఎన్నికలలో అల్లూరివెంకటసూర్యనారాయణరాజుగారు తెలుగుదేశం అభ్యర్థిగా, రుద్రరాజు భీమరాజుగారు కాంగ్రెసు అభ్యర్థిగా, ఎనుముల బాపిరాజుగారు స్వతంత్ర అభ్యర్థిగా , అల్లూరివెంకట్రామరాజుగారు కమ్యూనిస్టు అభ్యర్థిగా పోటీచేశారు. అల్లూరి వెంకటసూర్యనారాయణరాజుగారు గెలుపొందారు. 1985లో జరిగి మధ్యంతర ఎన్నికలలో ఆయన తెలుగుదేశం అభ్యర్థిగా , కాంగ్రెసు అభ్యర్థి పొన్నాడ హనుమంతరావు పై గెలుపొందారు. సూర్యనారాయణరాజుగారు అసెంబ్లీలోడిప్యూటి స్పీకరుగా ఎన్నుకోబడ్డారు. 1989లో జరిగిన ఎన్నికలలో అయనపై మంగెనగంగయ్య గారు కాంగ్రెసు అభ్యర్థిగా గెలుపొందారు. తిరిగి 1994 డిశెంబరు లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో సూర్యనారాయణరాజుగారు, గంగయ్యగారిపై గెలుపొందారు. 1999లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థి అల్లూరి క్రిష్ణంరాజుగారిపై సూర్యనారాయణరాజుగారు గెలుపొంది శతాబ్దం చివరికి యం.ఎల్.ఏ. గా ఉన్నారు.

అప్పట్కిరాజోలులో మకాం ఉన్న భూపతివెంకటసత్యయ్యగారు 1980లో అసెంబ్లీస్థానం నుండి యం.ఎల్.సిగా ఎన్నికయ్యారు. రాజోలులో సర్పంచి హనుమంతురావు గారు వీరికి సన్మానం చేశారు. అట్లే 1981లో స్థానిక సంస్థలనుండి జరిగిన శాసనమండలికి పెదపట్నం అగ్రహారానికి చెందిన బోళ్ళవెంకటసత్యనారాయణగారు ఎన్నిక కాగా వారికి రాజోలులో సర్పంచి సన్మానం ఏర్పాటుచేశారు. అట్లే 1981లో తిరిగి అంజయ్యగారి మంత్రి వర్గంలో కేబినెట్‌మంత్రిగా చేరిన రామలింగరాజుగార్కి రాజోలు పంచాయితీ అధ్వర్యంలో పెద్దసన్మానకార్యక్రమం జరిగింది.

1952లో పొట్టి శ్రీరాములుగారు ఆత్మత్యాగం చేసినప్పుడు రాజోలులో స్కూలువిద్యార్థులు ఉద్యమం నడిపారు. అట్లే 1953 అక్టోబరు1న ఆంధ్రరాష్ట్ర అవతరణజరిగినప్పుడు, 1 నవంబరు 1956న ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు ఉత్సవాలు జరిగాయి. 1966లో స్టీలుప్లాంటుకోసం 1972 నవంబరు లగాయితు 1973 మార్చి వరకు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమాలు జరిగాయి. ఆంధ్ర ఉద్యమంలో ఎంతోమంది జైలుకు వెళ్ళారు. విద్యాసంస్థలు, ఆఫీసులు, కోర్టులు 5నెలలు మూతపడ్డాయి. ఉద్యమం సందర్భంలో తేన్నేటి విశ్వనాథంగారు వచ్చినప్పుడు రాజోలులో వారికి హీరో స్వాగతం యివ్వబడింది. బోర్ ఆవరణలో జరిగిన అతిపెద్దబహిరంగ సభలో ఆయన ప్రసంగించారు. ఆదేవేదికపై అప్పటి విద్యార్థినాయకుడు వెంకయ్యనాయుడుగారు ప్రసంగించారు.

1977లో నీలం సంజీవరెడ్డికూడ జనతాపార్టీ ఎన్నికసభలో అక్కడ ప్రసంగించారు.

1982 తెలుగుదేశం పార్టీ ఏర్పడినప్పుడు మరియు 1984 పార్లమెంటు ఎన్నికలలోను, తరువాత 1989 ఎన్నికలలోను బాలుర హైస్కూలు ఆవరణలో ఎన్.టి.రామారావుగారు ప్రసంగించారు.

1982 డిసెంబరు 28న అప్పటి ఏ.ఐ.సి.సి. కార్యదర్శి మరియు యం.పి. హోదాలో రాజీవ్‌గాంధీ బాలుర్‌హైస్కూల్లో ప్రసంగించారు. తరువాత 1985 ఫిబ్రవరి 15న భారతప్రధానిగా బాలుర్‌హైస్కూల్లో జరిగిన అసెంబ్లీ ఎన్నికల సభలో ప్రసంగించారు. సర్పంచ్ మరియు కాంగ్రెస్ అభ్యర్థి పొన్నాడహనుమంతురావు రాజీవ్‌గాంధీకి స్వాగతం చెప్పారు. ఒకదేశ ప్రధాని ఆ హోదాలో రాజోలు వంటి మారుమూల ప్రాంతాన్కి రావటం అదే ప్రథమం. ఆ తరువాత మళ్ళీ 18-7-90న లోకసభ ప్రతిపక్ష నాయకుడుగా రాజీవ్‌గాంధి ఆంధ్రలో జనజాగరణ కార్యక్రమంలో భాగంగా రాజోలు వీదుగా వయనిస్తూ సెంటర్‌లో గాంధీ, ఇందిరాగాంధి, రంగా విగ్రహాలకు దండలువేసి పొన్నాడహనుమంతరావుగారింటికి అప్పటి యం.పి. కుసుమకృష్ణగారితో కలసి వచ్చి 20 నిఁలు ఉండి కొబ్బరిబొండాలు తీసుకొని మహాత్మగాంధి ఆ ఇంట్లో గడిపిన ప్రదేశాన్ని చూసారు. 1996 నవంబరు గాలివాన తరువాత డిసెంబరులో ఏ.ఐ.సి.సి. అధ్యక్షులు లోకసభ ప్రతిపక్ష నాయకులు శ్రీ పి.వి.నరసింహారావు, యం.పి. కె.ఎస్. ఆర్. మూర్తి గారితో పర్యటిస్తూ రాజోలులో హనుమంతరావుగారి ఇంటిముందు రోడ్డుపై ఆగి గాలివాన వివరాలు తెలుసుకొన్నారు.



# 18. సహకారరంగము

1922 ఆ ప్రాంతంలో సహకార ఉద్యమం ప్రారంభమై సహకారసంస్థలు ఏర్పడ్డాయి. రాజోలు, శివకోడు, సోంపల్లి గ్రామాలకు కలిపి రాజోలుప్రాథమిక వ్యవసాయ సహకారపరపతి సంఘం 1927లో ఏర్పడింది.

ఈ సొసైటి 6-4-27న ఏర్పడి, మల్లాది రామమూర్తిశాస్త్రిగారు మొదటి అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. తరువాత గటిగంటి నారాయణమూర్తిగారు చాలాకాలం అధ్యక్షులుగా ఉన్నారు. స్వాతంత్ర్యానంతరం శివకోడుకు చెందిన నున్నానారాయణరావుగారు కొంతకాలం కసుకుర్తి సుబ్బారావుగారు కొంతకాలం అధ్యక్షులుగా పనిచేశారు. ఎర్రాప్రగడ సత్యనారాయణగారు కార్యదర్శి 1972నుండి 1977వరకు జజ్జరావుగారు అధ్యక్షులుగా ఉన్నారు. 1972 తరువాత రామలింగరాజుగారు కోనసీమ సెంట్రల్‌బ్యాంక్ అధ్యక్షులుగా అంతవరకు అస్తవ్యస్తమయిన రాజోలు సొసైటీకి ఎంతో సహాయంచేసి సరియైనమార్గంలో పెట్టారు. 1977నుండి 1982వరకు కోటమారెయ్యగారు ఇన్‌ఛార్జీ అధ్యక్షులుగా ఉన్నారు. ఆ తరువాత 1982నుంచి 1985వరకు అధ్యక్షునిగాను ఆ తరువాత 1985నుంచి 1987 వరకు పర్సన్‌ఇన్‌చార్జిగా నున్ననారాయణస్వామిగారు ఉన్నారు. 1980 నుంచి రాష్ట్రసహకారబ్యాంకు అధ్యక్షులయిన రామలింగరాజుగారు ప్రపంచబ్యాంకు సహాయంతో రాష్ట్రమంతటా సహకారసంఘాలకు నిర్మింపబడిన భవనాలతో పాటు 1982లో దొరగారితోటలో రాజోలు సొసైటీకి స్వంతభవనం రామలింగరాజుగారి చే ప్రారంభింపబడింది. రామలింగరాజుగారి కేంద్రసహకారబ్యాంకు అధ్యక్షులుగా ఉండగానే పెయిడ్ సెక్రటరీ పదవులను సృష్టించి ఎంతోమందికి ఉద్యోగావకాశాలు ఏర్పర్చారు. అప్పటినుంచి రాజోలు సొసైటీకి సత్తిరాజు రామచంద్రరావుగారు కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

నున్ననారాయణస్వామిగారి తరువాత 1987నుండి 1990 వరకు శివకోడుకు చెందిన బోళ్ళసత్యనారాయణగారు, 1991 నుండి 1994వరకు సోంపల్లికి చెందిన కట్టా సూర్యనారాయణగారు అధ్యక్షులయ్యారు. 1994నుండి మేడిచర్లసూర్యప్రకాశరావుగారు అధ్యక్షులుగా ఉన్నారు.

ఈ సహకారసంఘం చాలాకాలం నుండి వ్యవసాయదారులకు ఋణసౌర్యం కలిగిస్తూ రైతులకు సహాయకారిగా ఉంది.

మొదట్లో ఈ రాజోలులో సహకారపరపతి సంఘం కార్యాలయము పొన్నాడ

వీరభద్రవిశ్వేశ్వరరావు గారింట్లో ఉండేది. ఈ ఆవరణలో 26-8-42 సాయంకాలం 4గం॥లకు గటిగంటినారాయణమూర్తిగారి అధ్యక్షతన పౌరుల సమావేశం జరిగి ఒక కమిటీ ఏర్పాటు చేశారు. చాలాకాలం ఈకార్యాలయం అక్కడే పనిచేసింది.

**భూమి తనఖా బ్యాంకు** : రాజోలులో సహకారరంగంలో 1933 సం॥లో భూమి తనఖాబ్యాంకు ప్రారంభింపబడింది. దీని డైరెక్టర్ల మీటింగు 30-1-1933న జరిగి వాడ్రేవురామ్మూర్తిగారు మొదటి ప్రసిడెంటుగా, పొన్నాడ శ్రీరామవెంకటసూర్యారావుగారు మొదటి సెక్రటరీగా ఎన్నికయ్యారు. ఆ తరువాత వాడ్రేవురామ్మూర్తిగారు కేంద్రభూమితనఖాబ్యాంకు (మద్రాసు) డైరెక్టరుగా ఎన్నుకోబడ్డారు. ఆ సందర్భంలో 18-11-1933న రాజోలు ఎల్.యం.బి. డైరెక్టర్ల సమావేశం జరిగింది. ఆ రోజున రామ్మూర్తి గారి గౌరవార్థం వారింటి వద్దనుండి ఆఫీసు వరకు ఊరేగింపుగా తీసుకువచ్చి టీపార్టీ, అభినందనసభ గ్రూపఫొటో జరిగింది. మార్చి 1935లో సూర్యారావుగారు సెక్రటరీగా రాజీనామా చేసినందున డా॥ బ్రహ్మాజ్యోస్యుల సుబ్రహ్మణ్యం వగైరాలు వచ్చి రాజీనామా ఉపసంహరింపచేశారు 1935నాటికి భూమి తనఖాబ్యాంకు పొన్నాడ వీరభద్రవిశ్వేశ్వరరావు గారింటివద్ద ఉండేది.అప్పట్లో వేమవరపు రామదాసుపంతులుగారు సహకారరంగంలో గొప్పపేరున్న వ్యక్తి ( ఆయన పేరునే రాజమండ్రిలో రామదాసు సహకారశిక్షణ కేంద్రం ఉన్నది). ఆయన లండను పర్యటించి వచ్చిన సందర్భంలో ది.13-2-36న వాడ్రేవురామ్మూర్తిగారు, వారి గౌరవార్థం విందుయిచ్చారు. ది. 2-10-39 వ తేదీని అప్పటి కేంద్రభూమి తనఖా బ్యాంకు మద్రాసు ప్రసిడెంటు అయిన రామలింగ మొదలియార్ రాజోలు వచ్చారు.అప్పుడు రావి తిమ్మయ్యగారింట్లో కార్యాలయం ఉండేది. ఆకార్యాలయంలో ఆరోజున మధ్యాహ్నం 2గం॥ 30ని॥లకు వాడ్రేవురామ్మూర్తి గారి చిత్రపటాన్ని మొదలియార్ ఆవిష్కరించారు. అదే రోజున బి.ఎస్. శాస్త్రిగారి అధ్యక్షతన కళావెంకట్రావ్ వగైరాలతో సత్రం వద్ద బహిరంగసభ కూడా జరిగింది. 1942 సం॥లో ఆగష్టు 3వ తేదీన రామ్మూర్తిగారి షష్టిపూర్తి ఉత్సవం జరిగింది. 1943లో గాదిచర్ల లక్ష్మీనారాయణగారు కో-ఆపరేటివ్ ఇన్స్పెక్టర్‌గా పనిచేశారు.

వాడ్రేవు రామ్మూర్తిగారు చాలాకాలం ప్రెసిడెంటుగా కొనసాగేరు. ఆయన తరువాత తల్లాప్రగడ సూర్యప్రకాశరావు అనే కస్తూరి చిన్నబ్బాయిగారు, అంతకుముందు కొత్తపేట తాలూకా రాజవరంకు చెందిన అయ్యగారి సుబ్బారావుగారు అధ్యక్షులుగా పనిచేశారు. అప్పట్లో కొత్తపేట తాలూకాకుకూడా ఎల్.యం.బి. రాజోలులోనే ఉండేది. తిరిగి 1958లో జరిగిన ఎల్.యం.బి. ఎన్నికలలో చింతలపల్లి అల్లూరిసత్యనారాయణరాజుగారు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. అప్పట్లో ఈ బ్యాంకు పొన్నాడ వారింటికి ఎదురుగా ఉండేది.



తరువాత పొన్నాడవీరభద్రవిశ్వేశ్వరావు గారి మేడమీదకు మారింది. 1962లో కొత్తపేటకు వేరే ఎల్.యం.బి. ఏర్పడి విడిపోయింది. 1963లో అప్పటి ఆర్థికమంత్రి కాసుబ్రహ్మానందరెడ్డిగారి సమక్షంలో కొత్తపేటకు చెందిన చీఫ్‌విప్‌గాపనిచేసిన మంతెనసుబ్బరాజుగారు, రాజోలు ఎల్.యం.బి. ఆఫీసులో తల్లాప్రగడసూర్యప్రకాశరావుగారి చిత్రపటాన్ని ఆవిష్కరించారు. తరువాత ఎల్.యం.బి. పోస్టాఫీసు వీదిలోని శ్రీ బిక్కిన సుబ్బారావుగారింట్లోకి మారింది. 1966లో కేంద్రభూమితనఖా బ్యాంక్ (హైదరాబాదు) డైరెక్టర్ల సమావేశం రాజోలులో జరిగింది. చింతలమోరి వాస్తవ్యులు, రాజోలులో లాయరుగా ప్రాక్టీసుచేసి సి.ఎల్.యం.బి.లో లీగల్ అసిస్టెంట్‌గా చేరి చివరకు సి.ఎల్.యం.బి. కార్యదర్శి అయిన దుర్గారామచంద్రరావుగారు కూడ ఈ సమావేశంలో ముఖ్యపాత్ర వహించారు. అప్పటి సి.ఎల్.యం.బి. అధ్యక్షులు కాసువెంగళరెడ్డిగారు అధ్యక్షత వహించారు. అల్లూరిసత్యనారాయణరాజుగారి చిత్రపటం ఆవిష్కరించబడింది.

ఎల్.యం.బి.కి జిల్లాలోనే మొదటిగా సొంతభవనం సేకరించబడింది. అల్లూరి సత్యనారాయణరాజుగారు డా॥ అమంచిరామారావుగారి వద్ద భవనాన్ని కొన్నారు. ఈ భవనాన్ని అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వసహకార శాఖా మంత్రి బత్తిన సుబ్బారావుగారు ప్రారంభించారు.

1986లో సహకార రంగంలో మార్పువచ్చి సింగిల్‌విండో పద్ధతి రావడంతో ఎల్.యం.బి. రద్దయి జిల్లాకేంద్రసహకారబ్యాంకులో కలసిపోయింది. ఆభవనం జిల్లాకేంద్రసహకారబ్యాంక్ ఆధీనంలోకి వచ్చింది. ఈ కేంద్రసహకార బ్యాంక్ అంతకుముందు కోనసీమప్రాంతానికి ప్రత్యేకంగా కోనసీమసెంట్రల్‌బ్యాంక్ ఉండేది. దీని శాఖ రాజోలులో 1970లో అరుమిల్లి మారెయ్యగారింట్లో ఉండేది. ఆ తరువాత జిల్లాకేంద్రసహకారబ్యాంక్ బ్రాంచిగా మారి, దీనిశాఖ ఇప్పుడు కొనసాగుతుంది.

**బిల్డింగ్‌సొసైటీలు** : రాజోలులో బిల్డింగ్స్ నిర్మాణానికి వీలుగా 1952లో బిల్డింగ్‌సొసైటీ ఏర్పడింది. దీనికి శివకోడుకు చెందిన నున్నానారాయణరావు మొదటి అధ్యక్షులుగాను, రాజోలు న్యాయవాది విన్నకోటబాపిరాజు కార్యదర్శిగా ఉండేవారు. దొరగారి తోటలో పెద్దస్థలాన్ని సేకరించి ప్లాట్‌లుగా విడగొట్టి సభ్యులకు కేటాయించారు. కొద్దిపాటి రుణాలు కూడా ఇచ్చేవారు. ఆ తరువాత ఈ సొసైటీకి పెన్మత్సచిట్టిబాబుగారు, బోళ్ళభద్రంగారు, రుద్రరాజురామరాజు గారు, గెద్దాడవివేకానందం వగైరాలు అధ్యక్షులుగా వ్యవహరించారు. ఈ దొరగారి తోటలో ఇప్పుడు పూర్తిగా భవనాలు నిర్మింపబడ్డాయి. అక్కడే పార్కు ఏర్పాటుచేయబడింది. అచ్చట కళ్యాణమండపం కట్టడాన్కి ప్రయత్నాలు

జరుగుతున్నాయి. అక్కడే కార్యాలయం కూడా ఉన్నది.

**అర్బన్‌బ్యాంక్** : రాజోలు అర్బన్ ప్రాంతంగా లోగడే ప్రకటించబడినందున ఇక్కడ సుమారు 50 సం॥లు నుండి కో-ఆపరేటివ్ అర్బన్‌బ్యాంక్ కూడా ఏర్పడింది.ఇది చాలాకాలం పాన్నాడవారి ఇంటి ఎదురుగా లక్కింశెట్టి చిన్నయ్యగారి మేడపైన ఉండేది. ప్రస్తుతం శివాలయం ఎదురుగా గల ధరణీప్రగడ వారి మేడపై ఉన్నది. దీనికి నున్నానారాయణరావుగారు, నున్నకన్నారావు, నున్ననాగేశ్వరరావుగారు, ముత్యాలనాగేశ్వరరావుగారు అధ్యక్షులుగా వ్యవహరించారు. ప్రస్తుతం శివకోడుకు చెందిన ముద్దా సీతారామయ్యగారు అధ్యక్షులుగా ఉన్నారు.

**సమిష్టివ్యవసాయ సహకారసంఘాలు** : పూర్వంగోదావరి నదీప్రాంతంలలో ఉండేప్రభుత్వ లంక భూములన్నీ ప్రభుత్వమువారు ప్రతిసంవత్సరము వేలంవేసి లీజుకుయిచ్చేవారు. భూస్వాములు ఎక్కువపాడుకొని అనుభవించారు. అయితే ప్రభుత్వ విధానంలో భాగంగా సమిష్టివ్యవసాయం చేయించే ఉద్దేశ్యంతో అప్పటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం ఒక ప్రణాళిక రూపొందించింది. భూమిలేని హరిజన మరియు బలహీనవర్గాలతో కోనసీమలో కొన్నివందల సమిష్టి వ్యవసాయసహకారసంఘాలు ఏర్పడ్డాయి. 1964లో ఈ మాస్టర్ ప్రణాళికకు అప్పటిముఖ్యమంత్రి కాసుబ్రహ్మానందరెడ్డి గారు అమలాపురంలో ప్రారంభించారు. అప్పుడు రాజోలులో కూడా కొన్ని సమిష్టి వ్యవసాయసహకార సంఘాలు ఏర్పడ్డాయి. రాజోలు మధ్యలంకలోను భూమిని ఈ సంఘాలకు ఇచ్చారు. తాలూకాలో ఈ సహకారసంఘాలను సమిష్టి వ్యవసాయసంఘాలు పర్యవేక్షణ చేయడాన్కి, ఆడిట్ చేయడాన్కి రాజోలులో ఎంతోమంది అధికారులు ఉండేవారు. కె.సుబ్బారావు, ఎ.వెంకటేశ్వరరావు, జోగేశ్వరావు వగైరాలు అధికారులుగా ఉండేవారు. కె.సుబ్బారావుగారు నాటకాల్లో పాత్రలు కూడ వేసేవారు. తరువాత ఏ సదుద్దేశ్యంతో ఈ సమిష్టి వ్యవసాయం ప్రారంభింపబడిందో ఆ ఉద్దేశ్యం నెరవేరడంసాధ్యం కాకపోవడంతో ఆ భూములకు వ్యక్తిగత పట్టాలిచ్చివేయడంతో సమిష్టి వ్యవసాయం రద్దయింది.

అట్లాగే రాజోలులో తాలూకాలో కోకోనెట్‌మార్కెటింగ్‌సొసైటీ కూడా పనిచేస్తోంది. దీనికి అయితం సుబ్బారావు, వార్నిసుబ్బారావు, గ్రంధివిష్ణుగారు, జక్కంపూడి తాతాజీ వగైరాలు అధ్యక్షులుగా పనిచేశారు.

రాజోలుకు 1979లో కో-ఆపరేటివ్ సూపర్‌బజార్ ఏర్పడింది. దీనికి జద్దువెంకట్రావు గారుఅధ్యక్షులుగా ఉండేవారు. 1982లో ఇది మూసివేశారు. రాజోలు ప్రాంతంలో గృహనిర్మాణకార్యక్రమాలకు వీలుగా రాజోలులో గృహనిర్మాణ ఇంజనీరును కూడా 1990 సం॥నుండి నియమిస్తున్నారు.



# 19. విజ్ఞానము - వినోదము - విహారము

రాజోలులో ముందునుంచి విద్యాలయాలు, విద్యావంతులు వుండడంతో విజ్ఞానానికి సంభందించిన ఎన్నో కార్యక్రమాలు జరుగుతూవుండేవి.అప్పట్లో కేవలం పుస్తకపఠనము, సాహిత్యచర్చలు మాత్రమే విజ్ఞాన సముపార్జనకు ముఖ్య అధారాలు.ఇందులోనే పత్రికాపఠనము కూడా ఇమిడివుంటుంది. పాన్నాడభానుమూర్తిగారు ఎన్నోగ్రంధాలను సేకరించారు. 1903లో ప్రచురించబడిన మరియు Annesదేల్ ఇంగ్లీషు నుండి ఇంగ్లీషు డిక్షనరీ చాలా విపులమైన పెద్ద గ్రంథము అది ఇప్పటికి వుంది.1903-04సం॥లకే రాజోలుకు "మద్రాసు మెయిలు" పేపరు వచ్చేది. నెలసరి చందా రూ॥ 0-12-3లు అంటే ఇప్పటికి లెక్కలలో 77 పైసలు. 1919 మే నెలలో రాజమండ్రిలో నవయుగవైతాళికుడు కందుకూరి వీరేశలింగంగారు చనిపోయారు. రాజమండ్రిలో ఆయన పేరు గల స్కూలులో పాన్నాడ సూర్యారావుగారు చదువుకున్న కృతజ్ఞతగా పాన్నాడ భానుమూర్తిగారు సేకరించిన ఎన్నో విలువైన గ్రంధాలన్నిటితో సూర్యారావుగారు రాజోలులో వీరేశలింగ పుస్తకభాండాగారాన్ని తమ ఇంటి వద్ద స్థాపించారు. అప్పుడు రాజమండ్రికి సంభందించిన పెద్దాడ సుందరశివరావుగారి అధ్యక్షతన ఒక సభ కూడా జరిగింది. ఆ తరువాత 1922 లో వీరభానుపురమందిరం నిర్మించబడినపుడు ఈ గ్రంథాలయం అందులోకి మార్చబడి ఇప్పటికీ వీరభానుపురమంధిర సమాజమువారి ఆధ్వర్యములో నడుస్తోంది. అప్పట్లోనే హిందూ, ఆంధ్రపత్రిక, భారతి వగైరా పత్రికలు వచ్చేవి.అప్పట్లో ఆరోజు పత్రికలు పాలకొల్లు నుండి సైకిలుపై వెళ్ళి తెచ్చేవారు. సాయంకాలానికి మాత్రమే ఆరోజు పేపరు వచ్చేది.హిందూ, ఆంధ్ర పత్రికకు రాజోలులో శరత్ పంతులు గారు ఆంధ్రప్రభకు ఎర్రాప్రెగడ సత్యంగారు చాలా కాలం విలేఖరులుగ వుండేవారు. సత్యంగారు తరువాత ఆంధ్రజ్యోతికి విలేఖరి కాగా మోరికి చెందిన గోపరాజుసుంధరావు గారు ఆంధ్రప్రభ విలేఖరి అయ్యారు. ఇక చాలా కాలం క్రితం నుండి రాజోలులో స్థానిక పక్షపత్రిక "సుదర్శిని" పత్రిక ప్రచురించబడేది. రాధాకృష్ణ ప్రెస్ రాజోలులో పురాతనమైన ప్రింటింగ్ ప్రెస్. వీరి ఆధ్వర్యంలో ఆ పత్రిక ప్రకటింపబడేది. 1915లోనే ఈపేపరు నడిచినట్లు దాఖలాలు వున్నాయి. 1915 జూలై 7వతేదీన రాజోలులో జరిగిన ఒక వివాహమును గూర్చి వ్రాశారని చెబుతారు. ఈ పత్రిక చాలా కాలం కోర్టుప్రకటనలకు పరిమితమై వారపత్రికగాను, ఆతరువాత దినపత్రికగాను మారి ఇప్పటికీ కొనసాగుతోంది. దెందుకూరి సూర్యచంద్రరాజుగారు నడిపిన ఈపత్రికను ప్రస్తుతం వారి సంతతివారు ఇప్పటికి నడుపుతున్నారు.అప్పట్లో మచిలీపట్నం నుండి

వెలువడే కృష్ణాపత్రిక (పక్షపత్రిక) కూడా ఇక్కడ చదివేవారు.

వీరేశలింగ పుస్తకభాండాగారము గాక తూర్పుగోదావరిజిల్లా గ్రంధాలయ అధ్వర్యంలో సుమారు 50సం॥లు క్రితమే ఒక గ్రంధాలయాన్ని కూడా రాజోలులో నెలకొల్పేరు. ప్రతీ తాలూకాకు ఒక సభ్యుడు చొప్పున ఆ తాలూకాలోని సర్పంచిలు ఎన్నుకొనేవారు. జిల్లా సభ్యులుగా ఉండి వీరంతా ఒక అధ్యక్షుడుని ఎన్నుకొంటారు. ఈ గ్రంధాలయము ఇప్పటికీ 5[illegible]లు నుండి తాలూకా ఆఫీసుకు ఎదురుగాగల లక్కింశెట్టి చిన్నయ్యగారి భవనంలో నడుపబడుతోంది. ఈ గ్రంధాలయాన్కి ఇంతవరకు స్వంతభవనంలేదు. 1983లో స్వాతంత్ర్యసమరయోధులు అకులబుల్లిస్వామిగారు గతించినప్పుడు, వారి విగ్రహాన్ని వీరభానుపురమందిరం వద్ద 1984లో నెలకొల్పాగా వావిలాలగోపాలకృష్ణగారు ప్రారంభించారు. వారి స్మారకార్థం భవనం నిర్మించి అందులో గ్రంధాలయం ఏర్పాటుచేయాలని అల్లూరివెంకట సూర్యనారాయణరాజు ఎం.ఎల్.ఏ. శ్రీ బోళ్ళసత్యనారయణమూర్తి, నున్ననారాయణరావు వగైరా పెద్దలు నిర్ణయించారు. కొన్ని విరాళాలు కూడ ప్రకటింపబడ్డాయి. ఈ భవన నిర్మాణాన్ని కావల్సిన స్థలాన్ని ఇచ్చుటకు పంచాయితీ తీర్మానాన్ని కూడ ఇచ్చారు. అయిన ఇది కార్యరూపం దాల్చలేదు. శ్రీ మంగెనగంగయ్యగారు ఎం.ఎల్.ఏ. గా ఉన్నప్పుడు పంచాయితీ వారి స్థలంలో శంకుస్థాపన కూడా జరిగింది. రాజోలు నియోజకవర్గాన్కి సంభందించిన శ్రీ రుద్రరాజువెంకటరామరాజు, శ్రీ చైతన్యరాజు తూర్పుగోదావరిజిల్లా గ్రంధాలయ సంస్థ అధ్యక్షులుగా ఉన్నప్పటికీ పురాతనమైన ఈ గ్రంధాలయం ఇంతవరకు సొంతభవనానికి నోచుకోకపోవడం దురదృష్టకరం.

1952-1955ల మధ్య రాజోలు హైస్కూలు విధ్యార్థులైన టి.హెచ్.వి.చలపతి, టి.ఎస్. చలపతిశర్మ వి.వి.బాపేశ్వరరావు, వగైరాలు తల్లాప్రగడ సూర్యప్రకాశరావు అనే కస్తూరిచిన్నబ్బాయి గారి ప్రోద్భలంతో ఒక బాల గ్రంధాలయాన్ని కోర్టుప్రక్కన గల వారి మేడలోని గదిలో నెలకొల్పారు. బాల, చందమామ వంటి బాలల పత్రికలు, ఎన్నో సాహసవీరుల గాధలు, చరిత్ర, విజ్ఞానాన్కి సంభందించిన పుస్తకాలు చాలా ఉండేవి. పైగా బాలలలో రచనావ్యాసంగాన్ని పెంపొందించడానికి అప్పుడప్పుడు బాలగ్రంధాలయం వారువ్రాతప్రతులు (మాన్యుస్క్రిప్ట్) తయారుచేసి అందులో బాలబాలికలు రచించిన ఎన్నో అంశాలను వ్రాసేవారు. ఆ మేడలో గల హాలులో వార్షికోత్సవాలు జరిపి సాంస్కృతిక కార్యక్రమాలు కూడ నడిపేవారు. ఈ బాలగ్రంధాలయాన్ని నడిపిన విధ్యార్థులు కళాశాల చదువులకు వెళ్ళిపోవడంతో గ్రంధాలయం కాలగర్భంలో కలసిపోయింది.



ప్రస్తుతం టి.వి.ల యుగం ప్రారంభంకావడంతో పుస్తకాలు చదవడం పూర్తిగా తగ్గిపోయింది. అసలు గ్రంధాలయాలు అవసరమా అనే పరిస్థితి ఏర్పడింది. ఈ ప్రభుత్వగ్రంధాలయులు ఎన్.టి.ఆర్.గారి హయంలో తెలుగు విజ్ఞానసమాచారకేంద్రాలుగా మారేయి. ప్రతీ సంవత్సరం పండిట్ జవహరలాల్‌నెహ్రూ జన్మదినమైన నవంబరు 14నుండి వారంరోజులు గ్రంధాలయ వారోత్సవాలు జరుగుతాయి. ప్రధానమంత్రిగా ఉంటూ కూడా ఖాళీ సమయాలలో ఎన్నో గ్రంధాలను ఔపోసనం పట్టిన మహావ్యక్తి జవహర్‌లాల్‌నెహ్రూ ఒకసారి ఆయన కార్యాలయంనుండి లిఫ్టులో దిగివస్తుండగా కరెంటుపోయి లిఫ్టు ఆగిపోయింది. అందరూ కంగారుపడ్డారు. ఆ తరువాత క్రిందకు వచ్చిన తరువాత విలేఖరులతో "ఈ లిఫ్టులలో ఒక చిన్న లైబ్రరీ ఉంటే ఎంతబావుంటుంది, ఇలాంటప్పుడు చదువుకోడాన్కి" అనడాన్నిబట్టి ఆయనకు పుస్తకాలు చదవడం ఎంత ఇష్టమో అర్థంఅవుతుంది.

రాజోలు గ్రంధాలయంలో చాలాకాలం శ్రీ సుబ్బరాజుగారు, శ్రీ వరహాగిరి సూర్యనారాయణగారు మొ॥న వారు లైబ్రేరియన్లుగా పనిచేశారు.

వెంకటనర్సయ్య చాలాకాలం అటెండర్‌గా పనిచేశారు. శ్రీమతి భూపతివెంకటనర్సమ్మ ప్రస్తుతం ఈ లైబ్రేరీలో పనిచేస్తున్నారు.

ఈ శతాబ్దంలో అయినా ఈ గ్రంధాలయాన్కి సొంతభవనం వస్తుందనిఆశిద్దాం.

ఇక విజ్ఞానం కోసం కాకపోయినా వినోదంకోసం పుస్తకాలు చదవడం ఉండేది. సాంఘికనవలలు, డిటెక్టివ్‌నవలలు మొదలైనవాటికి సంభందించి చాలా పుస్తకాలు వచ్చేవి.

లోగడ శ్రీ బొమ్మిశెట్టివెంకటస్వామి ఇతని కుమారుడు శ్రీ వెంకటేశ్వరరావు. శ్రీ కత్రి నర్సింహమూర్తి, శ్రీ తోరం మునేశ్వరరావుగారి వద్ద పుస్తకాలు, పత్రికలు అద్దెకు ఇచ్చేవారు.

ఈ మధ్యకాలంలో ఈనాడు, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, వార్త, జనశక్తి, తెలుగుదినపత్రికలు హిందూ, ఇండియన్‌ఎక్స్‌ప్రెస్ వగైరాదినపత్రికలు వస్తున్నాయి.

"**ఈనాడు**" కొత్తలో మామిడికుదురుకు చెందిన యక్కలదేవరరామారావు (గాంధీ) మొదటి విలేఖరిగా వచ్చారు. తరువాత మానేశారు. ఆయనను ఈనాడుగాంధీ అని పిలుస్తారు. కొంతకాలం రాజోలు మహిళాకళాశాల ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. ఆయన తరువాత శ్రీ మామిడిశెట్టి సత్యనారాయణగారు, కొంతకాలం విలేఖరిగా పనిచేశారు. ప్రస్తుతం కొండారమేష్ ఈనాడు విలేఖరిగా ఉన్నారు. అట్లే ఆంధ్రప్రభకు కటికిరెడ్డి శ్రీరామారావు (బాబాయి), బోళ్ళసతీష్, ఆంధ్రభూమికి మొదటినుంచి పాలిక శ్రీనివాస్, ఆంధ్రజ్యోతి, వార్తలకు వట్టిపువెంకటేశ్వరరావు,విన్నకోట విట్టపంతులు,

యం.సూర్యనారాయణగార్లు విలేఖరిలుగా ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రభకు మట్టపర్తి నాగప్రసాద్, ఆంధ్రజ్యోతికి దొంగసత్యనారాయణ, ప్రజాశక్తికి శిలంసుబ్రహ్మణ్యం, విజేతకు పి.ఎస్.ఎస్.మూర్తి విలేఖర్లుగా వున్నారు.

జర్నలిస్టు మేధావుల వర్గాన్కి చెందిన విజ్ఞానవంతులు ప్రజాస్వామ్యంలో 4th Estate వీరి మీద ఎక్కువ బాధ్యత ఉన్నది. రాజకీయపరంగా కాకుండా కేవలం ప్రజాసమస్యలు ప్రభుత్వదృష్టికి తీసుకురావడంలో వీరికి ముఖ్యమైన బాధ్యత ఉంది. భారతప్రజాస్వామ్యంలో మన రాజోలు విలేఖర్లు కూడా ముఖ్యపాత్ర వహించాలని ఆశిద్దాం.

**ముద్రణాలయాలు** : చాలా పూర్వకాలం నుంచి ఈ ప్రింటింగ్ పరిశ్రమ ఉన్నట్టు తెలుస్తోంది. పేపరు దొరకని రోజులలో రావిఆకులమీద, తాటి ఆకులుమీద కూడా నోటీసులు, సినిమా ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ వగైరాలు కరెంటులేని ఆ రోజులలో ట్రెడిల్ కాలుతో త్రొక్కి వేలకువేలు ప్రింట్‌చేసేవారట. ఆకోవకు చెందిన ప్రెస్సులు నవమాలికప్రెస్, రాధాకృష్ణప్రెస్‌లు మొ॥. ఈ నవమాలికా ప్రెస్‌లోనే అప్పటి స్వతంత్రపోరాటంలో ప్రభుత్వాన్కి వ్యతిరేకంగా పత్రిక ముద్రించారనే ఆరోపణతో అచ్చట పనిచేస్తున్న మల్లాది కృష్ణమూర్తిగార్కి జైలు శిక్ష విధించారట. స్వతంత్రపోరాటం తరువాత వీరిని స్వతంత్రసమరయోధులుగా గుర్తించారు. తరువాత గెల్లి వీరరాజు గారి రాజాప్రెస్ కూడా తరువాత ప్రారంభించారు. రానురాను ఈ పరిశ్రమ 1950 సం॥పు నాట్కి దినదినాభివృద్ధిచెంది భారతిప్రెస్, లక్ష్మిప్రెస్, సరస్వతీ ప్రెస్, స్వతంత్రప్రెస్,శ్రీ రవిప్రెస్‌లు 1960 దశకంలో అభివృద్ధిచెందాయి. వీటన్నింటికీ పుస్తకాలు ప్రింట్‌చేయడం ఓటరులిస్టులు ప్రింట్‌చేయడం, పత్రికలు ప్రింట్‌చేయడం, ఆఫీసులకు కావల్సిన అన్నిరకాల ఫారంలు సప్లయి చేయడం ఉండేవి. రానురాను ఈ పరిశ్రమలో ఎనలేని మార్పులు రావడంతో (ఫొటోస్టాట్స్, కంప్యూటర్స్, ఆఫ్‌సెట్‌మిషన్స్) రావడంతో 2000 సం॥నాటికి ఈ పరిశ్రమ చాలా కుంటుపడి దీనిని నమ్ముకొన్న యజమానులు, వర్కర్స్ పనులు లేక ఇబ్బందులకు గురిఅగుచున్నారు.

**సాహిత్యం** : విజ్ఞానం సంపాదించడంలో సాహిత్యం కూడా చాలా ముఖ్యమైన పాత్రవహిస్తుందని చెప్పనక్కర్లేదు. సాహితీపరులు కూడా మేధావి వర్గానికి చెందినవారు (intellectuals.) పూర్వం సాహిత్యాన్ని మహారాజులు పోషించేవారు. ప్రజస్వామ్యప్రభుత్వాలలో ఇది కొరవడింది.

పూర్వం రాజోలులో సాహితీకార్యక్రమాలన్నీ హైస్కూల్‌లో జరుగుతూ ఉండేవి. వీరభానుపురమందిరంలో కూడ కొన్ని సాహిత్యకార్యక్రమాలు జరిగేవి. లోగడ రాసినట్లుగా



బోర్డుహైస్కూలులో 6-5-45 సం॥ తేదీన జరిగిన సారస్వత ఉత్సవంలో మల్లాదిసూర్యనారాయణశాస్త్రి, వేదాంతం శేషయ్య, ప్రముఖపండితులు జటావల్లభుల పురుషోత్తం, వగైరాలు ప్రసంగించారు. అలాగే 1953లో హైస్కూల్లో పాలగుమ్మి పద్మరాజు (పాప) కూడ సాహితీప్రసంగం చేశారు. అట్లే ది.17-10-36 సాయంకాలం 5గం॥లకు వీరబానుపురమందిరంలో అడ్వకేటు కొమ్ముల సత్యనారాయణ గారి అధ్యక్షతన జరిగిన సాహితీ సమావేశంలో జటావల్లభుల పురుషోత్తంగారు హిందూవివాహాన్ని గురించి ఉపన్యసించ్చారు.

ఇక 1968లో రాజోలు కళాశాల ఏర్పడిన తరువాత మొదటిసంవత్సరాలలో వార్షికోత్సవాలలో ప్రముఖులు సాహిత్యఉపన్యాసాలు చేసేవారు. కళాప్రపూర్ణ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, ఆర్.యం. చల్లా, వేదవ్యాస్ ఐ.ఏ.యస్. వగైరాలు ఎంతోమంది ప్రముఖులు పాల్గొన్నారు. ఇక కళాశాలలో మొదటి ఇంగ్లీషు శాఖాధిపతి మహాంకాళి సుబ్రహ్మణ్యంగారు, అధ్యాత్మిక మరియు ఇంగ్లీషు సాహిత్యకార్యక్రమాలు ఏర్పాటు చేశారు. అట్లే కవులు పండితులు అయిన శ్రీ జొన్నలగడ్డమృత్యుంజయరావు గారు, మిరియాలరామకృష్ణగారు ఇక్కడ తెలుగుశాఖాధిపతులుగా పనిచేసినప్పుడు ఎన్నో సాహితీ సమావేశాలు జరిగేవి. 1970లో మిరియాల రామకృష్ణగారు అధ్యక్షులుగా అభ్యుదయ రచయితల సంఘం(అ.ర.సం.) రాజోలులో ఏర్పడింది. కవి పండితులు ఆవంత్స సోమసుందరం దీనిని ప్రారంభించారు. అప్పటి పంచాయితీ ఈ.ఓ. జి.రామకృష్ణ, పొన్నాడ హనుమంతరావుగారలు ఉపాధ్యక్షులుగా ఈ సంస్థను పోషిస్తూ ఇంటింటా సమావేశాలు నిర్వహించేవారు. ఈ "అ.ర.సం.", రాష్ట్రఅభ్యుదయరచయితలసంఘం శాఖగా పనిచేసింది. క్రమేణా ఆ లెక్చరెర్లు బదిలీకావడంతో ఇది రద్దయింది. ప్రిన్సిపాల్ అన్నాప్రగడ లక్ష్మినారాయణ (1970-75)గారు కూడా అనేక సాహితీ మరియు అధ్యాత్మిక, చారిత్రక ఉపన్యాసాలు చేసేవారు. ఆ తరువాత తెలుగుశాఖలో ఉండే శివలెంకప్రకాశరావుగారు కూడ గొప్పసాహితీవేత్త.

మొగలికుదురు గ్రామాన్కి చెందిన శ్రీ శ్రీపాదశ్రీరామమూర్తిగారు (శ్రీశ్రీశ్రీ) "**మాయప్రవరీయం**" అను గ్రంథాన్ని రచించి బిక్కినసత్యనారాయణ గారి ధనసహాయంతో శ్రీ రవి ఆర్ట్‌ప్రింటర్స్ చక్రధరరావు చే ముద్రించగా, ఆవిష్కరణోత్సవానికి 1981 అక్టోబరులో అప్పటి ఆంధ్రవిశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్ శ్రీ యం.ఆర్. అప్పారావు, రాజోలు వచ్చారు. ఈయనను పొన్నాడహనుమంతరావు గారింటి వద్దనుండి ఊరేగింపుగా బార్‌క్లబ్ ఆవరణలోనికి తీసుకువెళ్ళగా అక్కడ కార్యక్రమం జరిగింది. విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ ఎస్.వి. జోగారావు ప్రభృతులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. శ్రీశ్రీశ్రీ గారు అధ్యాపక

వృత్తిలో రిటైర్ అయిన తరువాత రాజోలుకు మకాం వచ్చారు. 1982లో ఈయన "**సాహితీప్రవంతి**" అను సాహిత్యసంస్థను ప్రారంభించారు. దీనికి ఆయన అధ్యక్షులుగా, శివలెంక ప్రకాశరావుగారు కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. ఆ తరువాత భిక్కినసత్యనారాయణమూర్తి గారు అధ్యక్షులు అయ్యారు. 1982లో ప్రారంభమైన ఈ సాహితీప్రవంతి అధ్వర్యంలో అప్పటి తెలుగుయూనివర్సిటీ వైస్‌చాన్సలర్ డా॥ సి.నారాయణరెడ్డి, జంధ్యాల పాపయ్యశాస్త్రి, ఆచార్యదివాకర్ల వెంకటావధాని వంటి ఎంతోమంది ప్రముఖులను రాజోలు రప్పించారు. జంధ్యాలపాపయ్యశాస్త్రి రాసిన పుష్పవిలాపం ఎంతో గొప్ప రచన. ఘంటశాలవారు దీనిని గానం చేయడంతో ఈ కావ్యం ఎంతో ప్రసిద్ధిలోకి వచ్చింది. 1983లో జరిగిన సాహితీస్రవంతి కార్యక్రమంలో భిక్కినసత్యనారాయణమూర్తిగారి ఆధ్వర్యంలో కరుణశ్రీ గారికి పుష్పాభిషేకం జరిగింది. అప్పుడు ఇక్కడకు కోర్టు ప్రారంభించడానికి వచ్చిన అప్పటి హైకోర్టు న్యాయమూర్తి వి. మాధవరావు గారు కూడ ఈ సమావేశంలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమం అయిన కొంతకాలం తరువాత కరుణశ్రీ గార్కి జరిగిన టి.వి.ఇంటర్వ్యూ ఒకటి ప్రసారం చేయబడింది. అందులో ఆయనను ఇంటర్వ్యూయరు "మీ జీవితంలో మరుపురాని సంఘటనలు ఏమన్నా ఉన్నాయా? అని అడిగినప్పుడు ఆయన రాజోలుసాహితీప్రవంతి సభలో నాకు చేసిన పుష్పాభిషేకం మరువరాని సంఘటన అని చెప్పటం రాజోలుకు గర్వకారణం."

ఇక రాజోలులో 1972లో వైద్యరంగంలో చేరిన డా॥ ఎ. రాజకుమారి గొప్పసాహిత్యవేత్త. ఈమె స్వయంగా నవలారచయిత్రియే గాకుండా సాహితీపోషకురాలుగా ఉన్నారు. సాహితీప్రవంతికి ఈమె అధ్యక్షులుగా, ఆ తరువాత గౌరవాధ్యక్షులుగా ఎన్నో సాహితీకార్యక్రమాలు ఏర్పాటుచేయబడ్డాయి. ఆమె తన ఇల్లు గృహప్రవేశం జరిగినప్పుడు వినూత్నపద్ధతిలో సాహితీకార్యక్రమం పెట్టడం గొప్పవిశేషం. ఈమె తల్లిదండ్రుల స్మృత్యర్థం ప్రతిసంవత్సరం డిసెంబరు 14,15 తారీఖులలో తాను స్వయంగాను సాహితీప్రవంతి అధ్వర్యంలో కూడా సాహిత్యకార్యక్రమాలు నిర్వహించేవారు. నిర్వహిస్తున్నారుకూడా. ప్రతి సం॥ డిసెంబరు ఉత్సవాలుగా పేరుబడిన ఈ సమావేశాలకు ఆంధ్రరాష్ట్రంలో హాజరుకాని ప్రముఖరచయితలు, రచయిత్రిలు లేరంటే అతిశయోక్తి కాదు. 1995 లో డిసెంబరు15నుండి వారంరోజులు విశ్వనాథ జయంతి మహోత్సవాలు కూడా జరిగియి. ఆసందర్భంలో ఆంధ్ర మాజీముఖ్యమంత్రి, మాజీకేంద్రమంత్రి, ఉత్తరప్రదేశ్‌మాజీగవర్నరు, సాహితీవేత్త బెజవాడగోపాలరెడ్డిగారి షష్ట్యుత్తరసహస్రమాససూర్యదర్శన దినోత్సవాన్ని కూడా ఇక్కడ జరుపడం విశేషం. డా॥ ఏ. రాజకుమారికి గురుతుల్యులు, రచయిత, విమర్శకుడు స్వాతంత్ర్యసమరయోధుడు, ఇటీవల స్వర్గస్తులయిన మహీధరరామోహన్‌రావు గారి



సలహాతో ఈ కార్యక్రమాలు నిర్వహించేవారు. డా॥రాజకుమారి అతిథులందరుకూ వసతి,భోజనసదుపాయాలు స్వయంగా చేస్తారు.

ఈ సాహితీస్రవంతికి ఇంకా మున్నునాగేశ్వరరావుగారు, దంగేటి రామచంద్రరావుగారు, వెలిదివెంకట్రామారావుగారు, శ్రీపొన్నాడహనుమంతరావుగారు, అధ్యక్షులుగా వ్యవహరించారు. అనిశెట్టి కృష్ణమూర్తిగారు, కవి తిలక , గుబ్బలమాధవమూర్తి ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు. ఇక యక్కలదేవరగాంధీ, యం.వి. సుబ్బారావు గారు, బాలాజీ వేమా, మునుకుట్లసూర్యనారాయణ, దార్లపెదబాబు మొ॥వారు కార్యదర్శు లుగా పనిచేశారు.

అయితే 1996నుండి డిసెంబరు ఉత్సవాలు డా॥రాజకుమారి, ఆధ్వర్యంలో వేరుగాను, మిగతా సాహితీప్రవంతికార్యక్రమాలు వేరుగాను జరుగుతున్నాయి. శ్రీ పొన్నాడహనుమంతరావు అధ్యక్షులుగా వై. గాంధీ కార్యదర్శిగా ఈ సాహితీప్రవంతి నడుస్తోంది. అప్పుడప్పుడు చిన్నకార్యక్రమాలు చేబడుతున్నారు.

ఇక గొప్పసాహితీవేత్త బోయిభీమన్న గారు రాజోలు వారి అల్లుడు. అట్లే ప్రముఖ నవలారచయిత, సినీరచయిత యండమూరివీరేంద్రనాద్ గారు కూడా కొంతకాలం రాజోలులో ఉన్నారు. ప్రముఖన్యాయవాది వాడ్రేవు పాపయ్యపంతులుగారి సతీమణి శ్రీమతి వాడ్రేవు రమాదేవిగారు కూడ కవితలు వ్రాస్తారు. నవలారచయిత్రి శ్రీమతి అచ్యుతపల్లి కొంతకాలం భర్త ఉద్యోగరీత్యా ఇక్కడ ఉంటూ రచనలు చేసేవారు. అట్లే రాజోలుకు చెందిన ఎర్రాప్రగడ రామకృష్ణ కూడా మంచిపేరుపొందిన యువకవి.

**రాజోలు సాహితీ డిసెంబరు కార్యక్రమాలలో పాల్గొన్న ప్రముఖుల వివరాలు.**

1986 సం॥ డిసెంబరు 14,15, విషయము :- "**20వశతాబ్దంలో రచనారంగంలో స్త్రీ**" పాల్గొన్నవారు :- 1). ఆచార్యనాయునికృష్ణకుమారి, 2). నిడమర్తి నిర్మలాదేవి, 3).ద్వానాశాస్త్రి, 4). హనుమంతరావు, 5). డా॥ రాజకుమారి, 6). పి. సుజాత.

1987 : విషయము :- "**తెలుగునవలాసాహిత్యం**" 1). ఇల్లిందల సరస్వతి, 2). కోడూరి శ్రీరామ్మూర్తి, 3). యఱ్ఱాప్రగడ రామకృష్ణ, 4). వాడ్రేవు రమాదేవి. 5). కొప్పర్తి వెంకటరమణమూర్తి

1988 : విషయము :- "**విశ్వనాథసాహితీసంచికా కార్యక్రమం**" 1). మధునాపంతుల సత్యనారాయణ గారు, 2). శరభయ్యగారు, 3). ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, 4). ఆర్.ఎస్. వెంకటేశ్వరరావుగారు, 5). విశ్వనాథ పావనిశాస్త్రి

1989 : విషయము :- "**గురజాడ సాహితీసంచిక కార్యక్రమము**" 1).కాశీపట్నం రామారావుగారు, 2). కె.వి. రమణారెడ్డి, 3). చిరంజీవినీకుమారి, 4). వాడ్రేవు చినవీరభద్రుడు.

1990 : విషయము :- "**శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రి శతజయంతిఉత్సవాలు**" 1). మహీధర రామమోహనరావు, 2). చామర్తి కనకయ్య, 3). పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, 4).కె. రామ్మోహనరాయ్, 5). కాత్యాయని విద్మహే.

1991 : విషయము :- "**గరిమెళ్ళ సత్యనారాయణగారి శతజయంతి**" 1). వావిలాల గోపాలకృష్ణయ్య, 2). మహీధరరామమ్మోహనరావుగారు, 3). పరకాల పట్టాభిరామారావు, 4). కె.వి.రామరాజు, విషయము :- "**భాషువాసాహిత్యసంచిక**" 1). కె.వి.రామరాజు, 2).రామడుగువెంకటేశ్వరశర్మ, 3). హేమలతాలవణం.

1992 : విషయము :- "**రాయప్రోలుశతజయంతి**" 1). ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, 2). డా॥ సరస్వతి, 3). ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి, 4). కాత్యాయని విద్మహే

1993 : విషయము :- "**కందుకూరి వారి సాహితీసంచిక**" 1). వాకాటి పాండురంగారావు, 2). వకుళాభరణం రామకృష్ణ, 3). లలిత, 4). ఆచార్య కేతువిశ్వనాథరెడ్డి, 5). మృణాలిని.

1994 : విషయం :- "**చలంశతజయంతి**" 1). ఆర్.ఎస్. సుదర్శనం, 2). ఇస్మాయిల్, 3). శివశంకర్, 4). ఆర్. వసుంధరాదేవి, 5). కాత్యాయనివిద్మహే, 6). మహీధర రామమ్మోహనరావు.

1995 : విషయం :- "**విశ్వనాథభారతి**" 1). బెజవాడ గోపాలరెడ్డి, 2). నాయనికృష్ణ కుమారి, 2). ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, 4). జవ్వాది గౌతమిరావు,5).పేరాల భరతశర్మ, 6).కోవెలసు ప్రసన్నాచార్య, 7).ఇంద్రగంటి శ్రీకాంతశర్మ 8). కోలవెన్నుమలయవాసిని, 9). జానకీబాల, 10). తుమ్మపూడి కోటేశ్వరరావు, 11). మహీధర నళినీమోహన్, 12). బేతవోలు రామబ్రహ్మం, 13). మధురాంతకంరాజారాం,14). చాగంటితులసి, 15). వాకాడి పాండురంగారావు, 16). కోడూరి శ్రీరామమూర్తి, 17). కోవెలసంపత్కుమారాచార్య, 18). అబ్బూరి గోపాలకృష్ణ, 19). సి. మృణాళిని, 20). కొర్లపాటి శ్రీరామమూర్తి, 21). జ్వాలాముఖి, 22).కాత్యాయిని విద్మహే, 23).చామర్తి శివరావు, 24). నండూరి రామకృష్ణాచార్యులు, 25). ముదిగొండవీరభద్రయ్య, 26). విశ్వనాధపావనిశాస్త్రి.





1996 : విషయం :- "**ప్రజాసాంస్కృతిక ఉద్యమాలు**" 1). ఆచార్య వకుళాభరణం రామకృష్ణ, 2). ఆర్.వి.ఆర్. 3). ప్రతాపరెడ్డి వగైరా.

1997 : విషయం :- "**శ్రీనాథుని షట్ శత ఉత్సవాలు**" 1). కొర్లపాటి శ్రీరామమూర్తి, 2). బేతవోలురామబ్రహ్మం వగైరా

1998 : విషయం :- "**నాయనిశతజయంతి**" 1).నాయనికృష్ణ కుమారి, 2). బేతవోలురామబ్రహ్మం, 3). భూమయ్య, 4). అక్కిరాజురమాపతిరావు, 5). మలయవాసిని వగైరా

1999 : విషయం :- "**సాహితీఉత్సవం**" 1). జయంధీరతిరుమలరావు,2). అద్దేపల్లిరామమ్మోహనరావు, 3). కొప్పర్తి, 4). జొన్నలగడ్డ అనూరాధ.

1995 విశ్వనాథభారతి రాజోలు సాహితీ చరిత్రకే గొప్ప మకుటం.

జవ్వాదిహనుమంతరావు ఆహ్వానసంఘం అధ్యక్షులుగా, డా॥ రాజకుమారి కార్యదర్శిగా ఈ కార్యక్రమం జరిగింది.

**వినోదం** : పాఠ్యపుస్తకాలంతిని చదుకుంటూ ఉంటే మనిషికి, గొడ్డుకు తేడా ఏమిటని ముత్యాలముగ్గు సినిమాలో రావుగోపాలరావుగారు డైలాగు చెప్పారు. మనిషన్న తరువాత వినోదం, వికాసం ఉండాలి. పూర్వకాలంలో హరికథలు పురాణాలు, భాగవతాలు, నాటకాలు మాత్రమే వినోదం. ఇందులో కాస్తపుణ్యం పురుషార్థం ఉండేది. నాటకాల విషయానికొస్తే ఎక్కువగా పౌరాణికనాటకాలు వేసేవారు. నాటకం కంపెనీలు కూడా ఉండేవి. రాజోలులో కూడ పూర్వంనుంచి నాటకాల ప్రదర్శన ఉండేది. ఈ నాటకాలు ఇతరసాంస్కృతిక కార్యక్రమాలు గురించి ఆ శీర్షికలో చర్చిస్తాను.

ఇక దేశంలో, 1930 ప్రాంతంలో సినిమా ప్రవేశించింది. పూర్వం కేవలం మూకీసినిమాలు మాత్రము ఉండేవి. సినిమాలో ఎవరో డైలాగులు హాలులో నుండి చెబుతూ ఉండేవారు. ఇక సినిమా హాళ్ళు మొదట్లో టూరింగుటాకీసులు మాత్రమే ఉండేవి. సంవత్సరానికి 3 మాసాలు మూసివేయాలి. వీటికి సినిమాటోగ్రాఫ చట్టం క్రింద తాత్కాలిక లైసెన్సు ఇచ్చేవారు. అటువంటి థియేటరు రాజోలులో 1937లో, సున్నవసంతరావు గారిచే ప్రారంభింపబడి పాతబస్టాండు ప్రక్కన ఉండేది. 1945 ప్రాంతంలో లక్కవరంలో ఉండేది. ప్రక్కన జగన్నపేటలో కూడ ఏకోరామయ్య థియేటరు, టూరింగుటాకీసు ఉండేవి. 1947-49 నాట్కి రాజోలులో జైహింద్ టాకీసు వచ్చింది. ప్రస్తుతం బాలుర హైస్కూలు వద్ద ఈ హాలు ఉండేది. అప్పటికి టాకీ సినిమాలు వచ్చాయి. సింగిలుప్రొజక్టరుతో రీలు రీలుకి ఆగేది. ఇక 1949లో కోనసీమలోనే మొదటిసారిగా అత్యంత ఆధునికమైన పర్మనెంటు థియేటరును రాజోలులో పెదపట్నం అగ్రహారంకు చెందిన బోళ్ళ సుబ్బారాయుడు గారు నిర్మించారు. బాల్కని, డబుల్-వెస్ట్రక్స్ ప్రొజక్టర్సు, నేలకూడ బెంచీలతో రవిటాకీసు 1949 నవంబరు 9 న "కీలుగుర్రం" సినిమాతో ప్రారంభింపబడింది.

ఈ థియేటరు శివకోడు మేడిచర్ల తాతయ్యనాయుడు, ప్రకాశరావు గార్ల ఆధీనంలోకి వచ్చి ప్రశాంతిథియేటరుగా మారింది. ఈ నిర్మాణం బోళ్ళసుబ్బారాయుడుగారి (రాష్ట్రమంత్రి గా॥ జాగర్లమూడిలక్ష్మీపద్మావతి వీరి కుమార్తె) ఆధ్వర్యంలో ప్రత్తిపాటి సుబ్బారావుగారి సాంకేతిక సలహాతో చాలబలంగా అప్పట్లో అధునిక వసతులతో నిర్మింపబడిన థియేటరు కావడంతో రిలీజు సినిమాలు కాకపోయినా రెండువ రిలీజుగా మంచి సినిమాలు వచ్చేవి. అప్పట్లో నవయుగ విడుదల చేసిన అన్ని పాప్యులర్ సినిమాలు ఇక్కడకి వచ్చేవి అప్పటికి అమలాపురంలో పరమేశ్వరటాకీసు అని మామూలు థియేటరు ఒకటి ఉండేది. రవి థియేటరు తరువాత అమలాపురంలో కమలేశ్వర థియేటరు వచ్చింది. రాజోలులో సినిమాలు చూడటానికి ,చుట్టుప్రక్కల గ్రామాలు, పశ్చిగోదావరిలోని దొడ్డిపట్ల, అల్లిరాజుపాలెం, యలమంచిలి, లక్ష్మీపాలెం గ్రామాలే కాకుండా అమలాపురం నుంచి కూత వచ్చేవారు. గుణసుందరి కథ, పాతాళభైరవి, హరిశ్చంద్ర (ఎస్.వి. రంగారావు) మొదలైన సినిమాలకు దూరప్రాంతాలనుంచి వందలాది రెండెడ్లబండ్లలో కూడ విపరీతంగా జనం వచ్చేవారు. తాటిపాక తులసీమహల్కి, ఈ రవిథియేటర్కి పోటీగా ఉండేది. ఈ హాలులో విలక్షణమైన కంటిన్యూయేషను పద్ధతిఉండేది. అంటే మొదటి ఆటలో రెండువభాగంచూసి, రెండొవ ఆటలో మొదటి భాగం చూసేవారు. మొదటక్లాసుకు మాత్రమే ఈ పద్ధతి ఉండేది. చాలామంది ఈ విధంగానే సినిమాలు చూసేవారు. రామరాము సినిమాలో పాటలు ఎక్కువై హైర్ పద్ధతిన సినిమాలు రిలీజుకావడం బోళ్ళవారు ఈ థియేటరు అమ్మివేయడం, తాటిపాక రిలీజుపిక్చర్సుతో డెవెలప్కావడంతో ఈ థియేటరు తన పూర్వ సౌభాగ్యాన్ని కోల్పోయింది. ఇక 1968లో శివకోడుకు చెందిన గెల్లి బాలకృష్ణగారు "వెంకటరమణ" టూరింగుటాకీసు నిర్మించారు. ఇందులో మంచి హిందీసినిమాలు వచ్చేవి.. తరువాత ఈ థియేటర్ను లక్ష్మింశెట్టి లక్ష్మీనారాయణగారు కొని దానిని 1984లో పర్మనెంటు థియేటరుగా మార్చారు. అల్లే [illegible] క్రిష్ణమూర్తి గారు 1979లో శ్రీనివాస్ థియేటరు అని సెమీపెర్మనెంటు థియేటరు నిర్మించారు. ఇది కొద్దికాలం నడపబడి ప్రస్తుతం మూతవేయబడింది.

1950 ప్రాంతంలో సర్కసులు కూడ వినోదాన్ని ఇచ్చేవి సరోజాగ్రాండ్ సర్కస్, సర్వేశ్వరసర్కస్ అను కంపెనీలు 1952లో సర్కస్ టెంటులువేసి చాలా కాలం నడిపారు.

ప్రస్తుతం టి.వి.లు వచ్చాక సినిమాలు, సర్కస్సులు నాటకాలు, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలుకేవలం పెద్ద పట్టణాలకు, నగరాలకు మాత్రమే పరిమితమయ్యాయి.

**వికాసం**: రోజంతా బిజీగా ఉండి సాయంకాలం యువకులు క్రీడారంగంలో ఉంటే పెద్దవారు క్లబ్‌లలోను, పార్కులలోను కాసేపు సేదతీర్చుకొంటారు. అట్లాంటివి రాజోలులో చాలా ఉన్నాయి. రాజోలులో పొన్నాడశ్రీరామవెంకటసూర్యరావు గారు 1922 అక్టోబరులో, విజయదశమి రోజున తన తండ్రిగారిపేర, స్థలదాత తండ్రిపేర కలిపి





వీరభానుపురమందిర సమాజం ఏర్పాటు చేసి తన స్వంతసొమ్ముతో భవనాన్ని నిర్మించారు. ఇది ఇప్పటికీ ఉన్నది. 1922 విజయదశమి రోజున వాడ్రేవురామమూర్తిగారు ప్రారంభించారు. అసలు ఈ ప్రారంభానికి చిలకమర్తి లక్ష్మీనరసింహం రావలసి ఉన్నది కాని చివరిక్షణంలో రాలేదు. మొదటి అధ్యక్షులుగా వాడ్రేవురామమూర్తిగారు, కార్యదర్శిగా పొన్నాడ సూర్యారావు గారు ఎన్నుకోబడ్డారు. 1927 వరకు వీరేకొనసాగారు. రాజోలులో ఉండే ఉద్యోగస్థులు, మేధావులు ఈ సమాజం కార్యక్రమాలలో పాల్గొనేవారు. పేకాటలో చెస్, చదరంగం మొదలైన నైపుణ్యం పై ఆధారపడే ఆటలేగాక టేబులుటెన్నీస్, వగైరాలు కూడా ఆడేవారు. అప్పట్లో మేధావుల మానసిక వికాసానికి ఈ సమాజం దోహదంచేసేది. ప్రతీ విజయదశమికి ఎన్నికలు, వార్షికోత్సవం జరుగుతాయి. 25-10-36న జరిగిన వార్షికోత్సవంలో పోలీసు సర్కిలుఇన్స్పెక్టరు ఎస్. కామేశ్వరరావునాయుడు గారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. ఆ సాయంకాలం బాణాసంచాకాల్చారు. [illegible] డ్రామా జరిగింది. 1950 వరకు కోర్టుమునసబులు, న్యాయవాదులు, గవర్నమెంటు హాస్పటలు డాక్టర్లు, వగైరాలు ఈ సమాజానికి ఆధ్వర్యం వహించేవారు. ఆ తరువాత క్రమేణా విద్యావంతులు ఈ సమాజంనుండి తప్పుకొని 1958లో "బార్క్లబ్"లో చేరిపోయారు. 1950నుండి దారపురెడ్డి వెంకన్నగారు అధ్యక్షులుగా ఉంటూ ఈ సమాజాన్ని అభివృద్ధిలోకి తీసుకువచ్చారు. ఆయన సుమారు 15సం॥లు క్రితం చనిపోయేవరకు ఆయన అధ్యక్షులుగా, తాటిపాకకు చెందిన బిక్కిన తిరపన్నగారు కార్యదర్శిగా పనిచేశారు. ఇక్కడ జూదం జరుగుతుందనే వాదన ఉండే కాని, క్రమశిక్షణ పాటిస్తారు. ( ఈమధ్య సుప్రీంకోర్టువారు పేకాటలో రమ్మీఆట జూదం కాదని తీర్పు చెప్పారు.) వీరిహయాంలో సమాజభవనానికి వెనుక మరియొక భవనాన్ని నిర్మించి కళ్యాణమండపంగా కూడా అభివృద్ధి చేశారు. 1981 విజయదశమి రోజున ఒక వంటశాల కూడా అప్పటి సర్పంచి గారిచే ప్రారంభింపచేశారు. తిరపన్నగారు గతించిన తరువాత శ్రీ ఆకెళ్ళకృష్ణశర్మగారు కార్యదర్శిగా, వెంకన్నగారితో కలసిపనిచేశారు. దారపురెడ్డి వెంకన్న గారు గతించిన తరువాత కొద్దికాలం రుద్రరాజు భీమరాజుగారు అధ్యక్షులుగా ఉన్నారు. భీమరాజుగారి తరువాత దారపురెడ్డి గోపాలకృష్ణగారు అధ్యక్షులయ్యారు.

1996 లో ఈయన గతించే వరకు అధ్యక్షులుగా ఉన్నారు. ఆకెళ్ళకృష్ణశర్మ గారు కార్యదర్శి అయ్యారు. వీరి ఇరువురి హయంలో భవనానికి రోడ్డువైపున 6 కొట్లు కూడ నిర్మించారు 1996 నుండి శ్రీకృష్ణశర్మగారు అధ్యక్షులుగా శ్రీదారపురెడ్డివెంకన్న కుమారులు వెంకటేశ్వరరావు గారు కార్యదర్శిగా కొనసాగుతున్నారు. ఈ పురమందిరం టౌన్‌హాలుగా వ్యవహరించేవారు. ఈ మందిరంలో గల వేదికపై వందలాది నాటకాలు, సాంస్కృతికకార్యక్రమాలు ప్రదర్శింపబడ్డాయి. వందలాది వివాహాలు జరిగాయి. 78 సంవత్సరాల వయస్సు నింపుకొని నూతన శతాబ్దంలో ప్రవేశించింది. ఈసంస్థ

**యూత్‌క్లబ్** : 1979లో వాడ్రేవుపాపయ్యపంతులుగారు అధ్యక్షులుగా బిక్కిన సీతారాంబాబుగారు కార్యదర్శిగా రాజోలు కల్చరల్ అండ్& యూత్ రిక్రియేషను క్లబ్ "ఉగాది"నాడు

ఏర్పడింది. యువకులకు వ్యాయామకార్యక్రమాలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగేవి. పాతబస్టాండు వద్ద ఒక చిన్నభవనాన్ని నిర్మించారు. ఆ తరువాత కొత్తబస్టాండు వద్దకు మారి స్వంతభవనాన్ని చేకూర్చుకొంది. దారపురెడ్డి చిట్టిగారు, దార్లపెదబాబుగారు, వెంకటపతిరాజుగారు, బోసుగారు, వగైరాలు అధ్యక్షులుగా ఉన్నారు కొంతకాలం ముదునూరి అక్కిరాజుగారు అధ్యక్షులుగా ఉన్నారు. ఈ క్లబ్‌లోని కార్యక్రమాలతో వచ్చిన విరాళాలుతో ఎన్నో ప్రజానంక్షేమకార్యక్రమాలు చేస్తోంది. ప్రభుత్వపధకాలు వగైరాలకు సహకరిస్తూ సర్వీసుక్లబ్‌గా కూడ పనిచేస్తోంది. శ్రీ అక్కిరాజుగారి హయాంలో అత్యాధునికమైన జిమ్నాసియము కూడా 1997లో ఏర్పాటుచేశారు. పిన్నలు పెద్దలు ఎంతోమంది ఈ "జిమ్" సర్వీసులను ఉపయోగించుకుంటున్నారు.

కొద్దికాలం క్రితం శ్రీ బోసురాజుగారు యోగా, రిక్రియేషను క్లబ్‌కూడ వేరే ఏర్పాటుచేశారు.

**విహారం** : చాలా ప్రదేశాలకు లేని అదృష్టం రాజోలుకు ఉన్న ప్రకృతిరమణీయత. ఉదయంనుంచి ఎంత అలసిసొలసినా సాయంకాలం గోదావరి చూస్తూ గట్టుపై కూర్చుంటే సేదతీరేది. అందుకే 1941 జనవరి 30న గోదావరి గట్టుపై అప్పటి పంచాయితీ ప్రెసిడెంటు పొన్నాడ శ్రీరామవెంకటసూర్యారావుగారు తెల్లవారుజామున 4-30 గం॥లకు ఒక పార్కుకు శంఖుస్థాపన చేశారు. అందులో సిమ్మెంటుతో ఒక పెద్దు నిర్మింపచేసి దానిని 16-10-41న ప్రారంభించి ఒక పబ్లికు రేడియో కూడ ఏర్పాటుచేసారు. ఈ పార్కును అప్పటి వశిష్ఠా సబ్ డివిజనలు ఇంజనీరు జి.యం. గోన్ను ప్రారంభించారు. ఈ పార్కుకు సూర్యారావుపార్కు అని పేరు పెట్టాలని పంచాయితీ తీర్మానించారు. కాని సూర్యారావుగారు అమలుపర్చలేదు. ఈ ప్రారంభం సమావేశం లో ఒక రౌడీవచ్చి త్రాగి అల్లరి చేయగా అతనిని అదుపుచేశారు. ఆ రాత్రి అచట బాణాసంచా, హరికథ, నాటకం కూడ తెల్లవార్లూ జరిగాయి. ఈ పార్కు 1958 వరకు చాలాబాగా మెయిన్‌టైన్ చేయబడింది. పట్టణంలోని మేధావులు, సామాన్యులు, విద్యార్థులు అందరూ కూడ సాయంకాలం ఇక్కడికి చేరి ఆనందంపొందేవారు. రేడియో వినేవారు. రకరకాలు పూలమెక్కలు, క్రోటన్సు, బొమ్మలు, వగైరాలు ఉండేవి. సిమ్మెంటుసోఫాలు ఉండేవి. లాన్ ఉండేది. సాయంత్రం అయ్యేసరికి మద్రాసు, విశాఖపట్నం బీచ్‌లా ఉండేది. దురదృష్టవశాత్తు ఈపార్కు 1958నుండి శిథిలావస్థకు చేరుకుంది. తిరిగి 1976లో దీనిని పునరుద్ధరింపబడి కొంతకాలం నడిచింది. పబ్లిక్ టి.వి. కూడ పెట్టారు. కాని 1986 వరదలు తర్వాత మళ్ళీశిథిలావస్థకు చేరుకొంది. పైగా ఈపార్కు ప్రక్కన ఏటుగట్టుపై నివాసగృహాలకు ఆక్రమణకు గురి అవడంతో పార్కుకు కావలసిన వాతావరణం కొరవడింది. 60 సంవత్సరాల క్రితం కట్టిన పెద్దుమాత్రం కాలగతిలో ఏటిగట్టులో కప్పడిపోయి, ఇప్పటికీ స్మారకచిహ్నంలా నిలబడింది. చాలామంది గోదావరిలో బోట్ షైర్లుకు ఇప్పటికి వెడుతుంటారు.మధ్యలంకలో పిక్నిక్‌లు ఏర్పాటుచేసుకొంటారు. చక్కని సహజ ప్రకృతి వాతావరణం కలిగిన రాజోలు గోదావరిగట్టు ప్రాంతాన్ని ఒక విహార యాత్రాస్థలంగా మార్చడానికి అనువైన పరిస్థితులు ఉన్నాయి. కొత్తతరాల్లం ప్రారంభంలోనైనా మనఆశలు చిగురిస్తాయని ఆశిద్దాము.





# ౨౦. క్రీడలు - సాంస్కృతిక విషయాలు

రాజోలు ప్రాంతంలో హాకీ, ఫుట్‌బాల్ ఆటల్కు తగ్గ గ్రౌండ్సు లేకపోవడంతో పూర్వంనుంచి ఈ ఆటలు రాజోలులో లేవు. అయితే రాజోలులో పూర్వంనుంచి బాల్‌బాడ్మింటను, టెన్నీసు ఆటలకు ప్రసిద్ధి. రాజోలులో టెన్నీసుకు వందసంవత్సరాల చరిత్ర ఉన్నది. ది. 11-3-1898 వ తేదీని రాజోలులో లాన్‌టెన్నీస్‌క్లబ్ ఏర్పడింది. అప్పటినుంచి టెన్నీసు ఆట ఉండేది. తరువాత 1928వ సం॥లో కోర్టు ఆవరణలో ఒక సిమ్మెంటు టెన్నీసుకోర్టు ఏర్పడింది. అదే సమయంలో నాలుగురోడ్ల కూడలిలో ప్రక్కస్థలంలో తల్లాప్రగడ సూర్యప్రకాశరావుగారు ఒక టెన్నీసు కోర్టు నడిపారు. ఈ కోర్టులో టెన్నీసు ఆడేవారి కోసం రోజూ పాలకొల్లునుండి స్పెన్సరుషాడాలు వచ్చేవని చెబుతారు.

కోర్టులో గల సిమెంటుకోర్టును 1953లో త్రవ్వివేసి గ్రావెల్‌తో హార్డ్‌కోర్టు టెన్నీసుకోర్టుగా మార్చారు. న్యాయవాదులు, న్యాయధికారులు, ఇతర అధికారులు, టెన్నీసు ఆడేవారు. 1960లో కొంతమంది విద్యార్థులతో కూడ ఇదినడిచింది. 1963లో బార్‌టెన్నీస్‌అసోసియేషన్ ఏర్పడింది. అప్పటి న్యాయాధికారులు కృషి ప్రోద్భలంతో 1965లో ఈ టెన్నీసు కోర్టుకు ఫ్లడ్‌లైట్లు అమర్చబడ్డాయి. 1973-78 వరుకు టెన్నీసు నడిచింది. అమలాపురంలో ఆర్.డి.ఓ. గా ఉండి ఆతరువాత జిల్లా కలెక్టరుయిన ఎస్.వి.హెచ్. శాస్త్రి గారు అమలాపురం నుంచి రాజోలు క్యాంపు వచ్చినప్పుడల్లా టెన్నీసు ఆడేవారు. కాలక్రమేణా క్రికెటు పై మోజు పెరగడంతో ఈ టెన్నీసు ఆట తగ్గిపోయింది. టెన్నీసు కోర్టు మాత్రము అట్లాగే ఉంది.

రాజోలు తాలూకా బాల్‌బాడ్మింటనుకు ప్రసిద్ధి. హైస్కూలులో కూడ జగన్నపేట పతిగారు, వెలుగోట్ల వేణుగారు, గటిగంటి క్రిష్ణగారు, ముత్యాలుగారు, గులేబ్‌హుస్సేన్ మొదలైన వారు విద్యార్థిదశలో మంచి ఆటగాళ్ళుగా పేరు పొందారు.

కోర్టులోని టెన్నీసుకోర్టులోను , రాజుగారి మేడవద్ద అనేకసార్లు టోర్నమెంట్సు నిర్వహించబడ్డాయి. ఆ తరువాత వాడ్రేవుపాపయ్య పంతులుగారు బాల్‌బాడ్మింటను లో మంచి ప్రావీణ్యం సంపాదించి టోర్నమెంట్సుకు అధ్వర్యంవహించారు. ఈయన అధ్వర్యంలో రాజోలులో రాష్ట్రబాల్‌బాడ్మింటెన్ టోర్నమెంటు మరియు అధికారికమైన సెలక్షను టోర్నమెంట్సు రాజోలులో 1974లో జరిగాయి. 1974నవంబరు నెలలో పైడిపర్తి వెంకటరామదాసు,శ్రీబోళ్ళఉమామహేశ్వరరావు, శ్రీ అన్నంనీడి పురుషోత్తం. శ్రీటిక్కిన శీతారాంబాబు వగైరాలు ప్రదానపోషకులుగా స్త్రీలకు, పురుషులకు టోర్నమెంట్సు జరిగాయి.

రాజోలు క్రీడాచరిత్రలోనే ఇది పెద్దపండుగ. రాష్ట్రం నలుమూలలనుండి ఇక్బల్, భావనారాయణ, సత్తార్ ,ఇంకా ఎంతోమంది పాల్గొన్నారు. పాపయ్యపంతులుగారు తన మిత్రబృందం సహాయంతో కనీవినీఎరగని ఏర్పాట్లు చేశారు. కోర్టు ఆవరణలో ఏర్పర్చిన మూడు కోర్టులలో ఈ పోటీలు జరిగాయి. ఈ టోర్నమెంటులో రాజోలుకు చెందిన గటిగంటి కృష్ణగారిని, జగన్నపేటకు చెందిన కాశిన వీరభద్రరావు (పతి) గార్ని రాష్ట్రం తరుపున ఆడటానికి సెలక్షను బోర్డువారు సెలక్ట్ చేశారు. క్రీడాకారిణులను కూడ సెలక్టు చేశారు. ఆ తరువాత 1990లో కూడ చిన్న స్కేలులో టోర్నమెంట్లను పంతులుగారు నడిపారు. అప్పటి ఎస్.పి. గోపీనాథ్‌రెడ్డి, ట్రోఫీలను బహుకరించారు. షటిల్‌బాడ్మింటన్, క్రికెట్ ఆటలు ప్రాధాన్యతపెరుగడంతో బాల్‌బాడ్మింటనును నామమాత్రంగా మిగిలిపోయింది. పూర్వం నుంచీ రాజోలు చుట్టుప్రక్కలగల గ్రామాలనుంచి పైడిపర్తివెంకటరామదాసుగారు, కట్టావండుగారు, బోళ్ళసత్తెయ్యగారు, బోళ్ళఉమామహేశ్వరరావుగారు, చింతలపల్లిమణి,సుబ్బరాజు వగైరాలు ఈ బాల్‌బాడ్మింటును ఆడుతూ ఈ క్రీడకు ముఖ్యపోషకులుగా ఉండేవారు. దాసుగారు, సత్తెయ్యగారు తమ 70వ ఏట కూడ పంచెలతోనే బాడ్మింటను ఆడేవారు.

ఇంక 1965 ప్రాంతంనుంచి రాజోలులో క్రికెట్‌ఆట కూడ పుంజుకుంది. రాజోలు క్రికెట్‌క్లబ్ ఏర్పడి డా॥ ఏ.వి. అప్పారావు , గొల్లమందల రమేష్ వగైరాలు బాలుర హైస్కూలు గ్రౌండ్స్‌లో క్రికెట్ ఆడేవారు.

**సాంస్కృతిక కార్యక్రమాలు** : సినిమాలు రాకముందు ప్రజలకు వినోదం నాటకాలు మాత్రమే. నాటకాల కంపెనీలు పర్యటనలు చేస్తూ ప్రదర్శనలిచ్చేవి. పాఠశాలలో విద్యార్థులు కూడ నాటకాలు వేసేవారు.. దీనికి రాజోలులో వందసంవత్సరాల చరిత్ర ఉన్నది. ది. 10-4-1903వ సం॥తేదీని గుంటూరుట్రావెలింగుడ్రమేటిక్‌సొసైటీవారు రాజోలులో హరిశ్చంద్రనాటకం వేశారు. దీనికి చాలామంది జనం వచ్చారు. 29-4-1903వ తేదిని రాజోలులో ప్రమోటర్ సొసైటీ ఏర్పాటు చేయడానికి ప్రయత్నం జరిగింది. కాని ఎక్కువమంది హాజరుకాకపోవడంతో అదిజరగలేదు. 1911-12 సం॥లో పాతబస్టాండు వద్దగల నున్ననారాయణస్వామి గారి దొడ్లో తాటియాకులతోవేసిన నాటకశాలుండేది పొన్నాడలక్ష్మయ్యగారు, అంజనేయస్వామివారి ఆలయం అప్పటి అర్చకులు అట్లవణం శేషగిరిరావు గారి బావమరిది, మట్టపర్రుకు చెందిన అయ్యగారివీరభద్రరావు వగైరాలు ఇందులో నాటకాలు వేసేవారు. అప్పట్లో ప్రసిద్ధిచెందిన నర్సాపురం వై.ఎన్.ఎన్.వి. నాటక కంపెనీ ట్రూప్‌వారు కూడ వచ్చి నాటకాలు వేసేవారు.

1911-12 సం॥లో బ్రిటీషురాజుకు పట్టాభిషేకం జరిగిన సందర్భంలో శివకోడు





హైస్కూలులో పిల్లలచేత నాటకాలు ఆడించారు. క్షాట్రావులపల్లి సుబ్బారావు అర్జునుడుగా , పొన్నాడసూర్యారావుగారు అభిమన్యుడుగా పాత్రలువేస్తే మహమ్మద్ అబ్దుల్‌రజాక్ అనేముస్లిము విద్యార్థి కృష్ణుని పాత్రవేయడం విశేషం. ఇతను 1930-40 సం॥ల మధ్య రాజోలు పంచాయితీ ఆఫీసులో ప్యూన్‌గా పనిచేశాడు. 1916-17, 1917-18 సం॥లో కూడ నాటకాలు వేసేవారు. కోర్టులోగల రేకుషెడ్డు హాలులో (అప్పటి రివర్‌కన్సర్వెన్సీ ఆఫీసు) నాటకాలు వేసేవారు. ఈ షెడ్డు ఇప్పటికీ ఉన్నది. అయితే మధ్యన పార్టీషన్లు చేశారు ఇక 1922లో వీరభానుప్రమందిరం నిర్మించబడటంతో అందలో ఎన్నోనాటకాలు వేసేవారు. కాలక్రమేణా సినిమాలు రావడంతో ఈ నాటకాలు వెనుకబడ్డాయి.

నండూరి కృష్ణమూర్తి గారనే "నాయనప్పగారు" రాజోలులో ఎన్నో అధ్యాత్మిక కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. ప్రతి సంవత్సరం జరిగే శ్రీరామనవమికి ఎన్నోనాటకాలు వేయించేవారు. 1949లో గుజ్జపుద్యాన్సు కూడ పెట్టారు. మేజువాణి కార్యక్రమాలు కూడ ఎక్కువగా ఉండేది. పెద్దవారిళ్ళలో పెళ్ళిళ్ళకి, దైవకార్యాల ఉత్సవాలకి కూడ ఈ మేజువాణి కార్యక్రమాలు ఉండేవి.

1949వ సం॥ములో నాయనప్పగారు అప్పటి ప్రముఖ గాయని టంగుటూరిప్రకాశం గారు సోదరుని కుమార్తె అయిన టంగుటూరిసూర్యకుమారి గాన కచేరి కూడ ఏర్పాటు చేశారు. దీనికి టిక్కెట్లు కూడ వసూలుచేశారు. తాలూకాఆఫీసు కాంపౌండులో చుట్టుగోనె బరకాలు కట్టి ఈ కచేరి జరిపారు. 1953 ప్రాంతంలో శ్రీరంగంగోపాలరత్నం, 1960 ప్రాంతంలోనే **వీణ చిట్టిబాబు** కూడ రాజోలులో ప్రైవేటు ఫంక్షనులలో కచేరీలు చేశారు. వెలదివెంకటరామారావు గారింట్లో కార్యక్రమానికి బి.వి. పట్టాభిరామ మేజిక్‌షో కూడ జరిగింది. 1982 జూన్ 12న డా॥ అప్పారావుగారింట్లో ఒక ఫంక్షనులో మాండలీన్ శ్రీనివాస్ కచేరి యిచ్చారు.,

ఇక 1971 సం॥ములో రాజోలులో లలితకళలు పోషించే ఉద్దేశ్యంలో పొన్నాదహనుమంతరావుగారు 1971 అక్టోబరులో విజయదశమిరోజున లలితకళాసమితిని ఏర్పాటుచేయటకు కస్వీరుగా సమావేశం బార్ క్లబ్‌లో ఏర్పాటుచేశారు. అప్పటి స్టేట్‌బ్యాంక్ ఏజంటు యం.వి.ఎస్. రాజ్‌పాయి అధ్యక్షునిగా, పొన్నాదహనుమంతరావు కార్యదర్శిగా డా॥ ఏ.వి. అప్పారావు సహాయకార్యదర్శిగా, ఇంకా వై .మధుసూదనరావు, వై.వి. రామకృష్ణ, మీనవల్లవిష్ణుమోహన్ వగైరా సభ్యులుతో ఏర్పడింది. దానిని 87/71గా రిజష్టరు చేశారు. దీనిని 20-11-1971న అప్పటి జిల్లా కలెక్టరు ఎల్. మాలకొండయ్య బార్ క్లబ్‌లో జ్యోతివెలిగించి ప్రారంభించారు. ఆ రాత్రి బార్‌క్లబ్ వారు '**టొమ్మాటొరుసా**' అనే నాటకాన్ని బాలికల హైస్కూలు ఆవరణలో ప్రదర్శించారు. 1972 ఆగష్టు 15వ తేదిని

స్వాతంత్ర్యదినోత్సవ రజతోత్సవాల సందర్భంగా లలితకళాసమిత ఆధ్వర్యంలో "ఆదది " అను నాటిక బార్ క్లబ్ వేదిక ( జక్కిరావు కళామందిరం) పైన ప్రదర్శించారు. 1974లో వాడ్రేవుసుబ్రహ్మణ్యంగారు అధ్యక్షులుగా, డా॥ ఎ.వి. అప్పారావు కార్యదర్శిగా, పొన్నాడహనుమంతరావు కోశాధికారిగా అయ్యారు. రాజోలులో సాంస్కృతిక కార్యక్రమాలు నడవటానికి ఒక ఆడిటోరియం నిర్మించడానికి చర్యలు తీసుకోవడం ప్రారంభించారు. లలితకళాసమితిలో జీవితసభ్యులను చేర్చుకొని, కొన్ని బెనిఫిట్‌షోలు ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు మొదలయ్యాయి. 1975లో మంగళంపల్లి బాలమురళీకృష్ణను ఆహ్వానించి అప్పటి రవిథియేటరులో ఆయనకు సన్మానం, ఆ తరువాత ఆయన గానకచేరి జరిగింది. ఈ కార్యక్రమం అందరినీ ఎంతో అలరించింది. ఆ తరువాత 1976వ సం॥లో సినీగాయకుడు ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం అండ్ పార్టీచే రవిథియేటరులో బెనిఫిట్‌షో ఏర్పాటు చేయబడింది. ఈ కార్యక్రమంలో వచ్చిన సొమ్ముతో పాతబస్టాండువద్ద 16సెంట్లు స్థలాన్ని కొని అందులో ఆడిటోరియం నిర్మించాలని లలితకళాసమితి నిర్ణయించింది. ఈ లోపుగా 1979లో ఈమనిశంకరశాస్త్రి వీణ కచేరి, బాలురహైస్కూలు ఆవరణలోనూ 1981లో యల్లావెంకటేశ్వరరావుగారి నవమృదంగసమ్మేళనం రవిథియేటరులోనూ జరిగింది కె.రాజుగారి మాజిక్స్ మరియు హిప్నాటిజం ప్రోగ్రాములు కూడ జరిగాయి.

ఇక ఆడిటోరియం ప్రతిపాదన తోపాటు ఆడిటోరియం -కమ్-కళ్యాణమంటపం నిర్మిస్తే బాగుంటుందని నిర్ణయించారు. ఇందుకు తిరుమల-తిరపతిదేవస్థానం వారిని లలితకళాసమితి కోరింది. ఒక ఎకరం భూమి ఇచ్చి, లక్షా ఏభైవేలు యిస్తేకళ్యామండపం కడతామని వారు హామీయిచ్చారు అందుకు ప్రయత్నాలు జరిగాయి. దొడ్డవరం పాబోలు శేషారావుగారు 10,000 రూ॥లు విరాళంతో ముఖ్యదాతగా, సభ్యులందరూ తలో 5,000రూ॥లు చొ॥న విరాళాలు పోగుచేశారు. రాజోలులో 6చోట్లస్థలాలు ఎంపికచేసి టి.టి.డి ఇంజనీరింగువార్కి చూపించగా వారు పొన్నాడహనుమంతరావుగారి తాలూకు ఆర్.ఎస్.నెం.65/3ఎ. భూమిని ఆమోదించారు. లోగడ కొన్న16 సెంట్లభూమి అమ్మివేశారు. 50సెంట్లు దాన పట్టారీత్యాను, 50సెంట్లు క్రియంద్వారాను ఒక ఎకరం సేకరించి టి.టి.డి.కి నేరుగా దఖలుపరిచారు. 1,50,000లలో 1,30,000 డ్రాఫ్టుతీసుకొని డా॥ ఎ. అప్పారావుగారు, డా॥ ఎస్. నారాయణమూర్తిగారు, పొన్నాడహనుమంతరావుగారు, డా॥ కె.శితారామరావుగారు, వి. పాపయ్యపంతులు గారు, తిరుపతి వెళ్ళి టి.టి.డి వార్కి యిచ్చివచ్చారు. 1983లో టి.టి.డి. వారి కళ్యాణమందిరనిర్మాణం ప్రారంభమయి 6 ఆగష్టు 1989, వ తేదీని అప్పటి డిప్యూటిస్పీకరు ఎ.వి.సూర్యనారాయణరాజుగారు అప్పటి టి.టి.డి ఛైర్మన్ దేవినేని సీతారామయ్యగారి అధ్యక్షతన ప్రారంభించారు. అప్పుడు





లలితకళాసమితి ఒక సంచికను కూడ ప్రచురించారు. ఈ కళ్యాణమండపనిర్మాణానికి శ్రీ బోళ్ళసత్యనారాయణగారు, అప్పటి టి.టి.డి. సభ్యులు, నగరం శాసనసభ్యులు స్వర్గీయ ఉండ్రుక్రిష్ణారావు గారు ఎంతో సహాయపడ్డారు.

రాజోలు లలితకళాసమితి సాధించిన గొప్ప విజయం. ఈ టి.టి.డి. కళ్యాణమండపం. పూర్తిగా ఇది టి.టి.డి. వారి ఆధీనంలో నడుస్తోంది. ఎన్నో వివాహాలు ఇచ్చట జరుగుతున్నాయి. ఈ కళ్యాణమండపానికి చాలాకాలం నుంచి నడింపల్లి సూర్యనారాయణరాజుగారు మేనేజరుగా ఉన్నారు.

దీని తరువాతకూడ లలితకళాసమితి చిన్న చిన్న కార్యక్రమాలు చేబట్టింది. 1997 ఏప్రియలులో రెండురోజులు లలితకళాసమితి రజతోత్సవాలు కూడ జరిగాయి.

దురదృష్టవశాత్తు టి.వి. సంస్కృతి రావడంతో సాంస్కృతికార్యక్రమాల మీద ఆసక్తి పూర్తిగా తగ్గిపోయింది.

వాడ్రేవుపల్లికి చెందిన స్వర్గీయ బిక్కినసత్యనారాయణగారు ఈ లలితకళాసమితి గౌరవ అధ్యక్షులుగా ఎంతోసేవచేశారు. 1989నుండి డా॥ నున్ననారాయణమూర్తిగారి లలితకళాసమితి అధ్యక్షులుగా, డా॥ ఎ.వి. అప్పారావుగారు కార్యదర్శిగా, పి. హనుమంతరావుగారు, కోశాధికారిగా కొనసాగుతున్నారు. ఈ లలితకళాసమితిని ముందుకు నడిపించడానికి యువత ఏ విధమైన ఆసక్తి చూపించటల్లేదు.

రాజోలుకు చెందిన లేటు చింతలపూడినరశింహంగారు మధుర లలిత సంగీతగాయకులే కాకుండా చక్కటి బాణీలు కట్టేవారు. వీరు ఆకాశవాణి గాయకులు. వీరి శిష్యురాలు ఎ.ఎల్.కె. ప్రియదర్శిని, మైలవరపు పద్మ కూడ రేడియో ఆర్టిస్టులే. అట్లే రాజోలుకు చెందిన పుల్లేటికుర్తి సత్యనారాయణగారు గాయకులు, వయోలిన్ విద్వాంసులు ఆకాశవాణి ఆర్టిస్టు కూడ. కీ॥శే భాగవతులనారాయణరావు వేణువు, కీ॥శే దేవరకొండవిశ్వనాథం, గాత్రంలో ప్రముఖులు.

సాంస్కృతిక వ్యవహారాలకోసం షెడ్యూలు కులాలవార్కి 1985లో అంబేద్కర్‌భవనం నిర్మింపబడింది. షెడ్యూలుకులాల కార్పోరేషన్ పనులుచేయించడాని ఎస్.సి. కార్పోరేషన్ ఇంజనీరు ఆఫీసు కూడ 1988నుంచి రాజోలులో నడుస్తోంది.

# 21. సేవాకార్యక్రమాలు - ప్రకృతివైపరీత్యాలు

ప్రజాసేవకార్యక్రమాలు పూర్వం వ్యక్తిగతంగా చేస్తూ ఉండేవారు.తరువాత 1970లో మొదటిసారిగా రాజోలులో లయన్స్‌క్లబ్ ఏర్పడింది. మలికిపురానికి చెందిన అమిరికారాజుగారు అధ్యక్షులుగా, అప్పటి స్టేట్‌బ్యాంక్ ఏజంటు యం.వి.ఎస్. రాజ్‌పాయి కార్యదర్శిగా, పొన్నాడహనుమంతరావు లైన్ టేమరుగా, టైల్‌ట్విస్టరుగా, ఆదబాలరామకృష్ణారావు ఎన్నికోబడ్డారు. అయితే రాజోలు లయన్స్‌క్లబ్ ఎక్కువకాలం కొనసాగలేదు.

బార్ క్లబ్‌వారు అప్పుడప్పుడు సేవాకార్యక్రమాలు నిర్వహించేవారు. అట్లే రాజోలులో చిక్కినజానకి రామారావుగారు సత్యసేవాసమితి ఆధ్వర్యంలో ప్రజాసేవ కార్యక్రమాలు నడిపేవారు. ప్రస్తుతం వారి కుమారుడు చిక్కినశితారాంబాబు వగైరాలు నడుపుతున్నారు.

ఇక 1985లో దంగేటిరామచంద్రరావుగారు వ్యవస్థాపక అధ్యక్షులుగా రాజోలులో రోటరీక్లబ్ ఏర్పడింది. రామచంద్రరావుగారు ఎంతో శ్రద్ధగా దీనిని అభివృద్ధిచేశారు. దీనికి టెలిఫోన్‌ఎక్ఛేంజి భవనం ప్రక్కన స్వంతస్థలం కూడ సేకరించి ఒక చిన్న భవనాన్ని కూడ నిర్మించారు. 1986 వరదలలోను, ఆ తరువాత వచ్చిన గాలివాన వగైరాలలో ఈ రోటరీ క్లబ్ ఎంతో సేవచేసింది. చేస్తోంది కూడా. ఈ రోటరీక్లబ్ కు ఇంకా వెలిదివెంకటరామారావుగారు, గాదిరామకృష్ణగారు, డా॥ గంగరాజుగారు, అన్నంనీడి పురుషోత్తంగారు, నామన వెంకటస్వామిగారు, దారపురెడ్డి చిట్టిగారు, మంగెన శివ రామకృష్ణగారు ఇంకా యితరులు అధ్యక్షులుగా పనిచేశారు. ప్రస్తుతం అప్పనధర్మసాయిగారు అధ్యక్షులుగా ఉన్నారు. పల్స్‌పోలియో, కంటి ఆపరేషన్లు వగైరా కార్యక్రమాలు నడుపుతూన్నారు. ఒక అంబులెన్సు కూడ నడుపుతున్నారు.

అట్లే రాజోలు యూత్‌క్లబ్‌వారు కూడ సేవా కార్యక్రమాలలో పాల్గొంటున్నారు.

ఇక కొత్తగా 5సం॥లు క్రితం ఎస్.ఆర్.ఎఫ్. యూత్‌కూడ ఏర్పడి దారపురెడ్డిబాల్జీ వగైరాలు సేవాకార్యక్రమాలు చేబడుతున్నారు. గత సంవత్సరం 1999లో గరల్స్‌హైస్కూలు వద్ద స్నేహయూత్ కూడ ఏర్పడింది.

**ప్రకృతి వైపరీత్యాలు** : ప్రతి సంవత్సరం ప్రతీసీజన్‌లోను అన్నిచోట్ల ఎన్నో ప్రకృతి వైపరీత్యాలు ఏర్పడి చాలమంది ప్రాణాలు కోల్పోవడం, ఆస్తినష్టం జరుగుతుంటాయి. కాని రాజోలులో ఎప్పుడూ ప్రకృతి భీభత్సాలుగాని, ఎక్కువ మరణాలు గాని సంభవించకపోవడం రాజోలు అదృష్టమని చెప్పాలి. అయితే చాలాసార్లు మేజరు ప్రమాదాల నుండి తప్పించుకొంది. రాజోలులో ఎన్నడూ పెద్దఅగ్నిప్రమాదాలు





సంభవించలేదు. అయితే చుట్టుప్రక్కల గ్రామాలలో తరుచు అగ్నిప్రమాదాంలు సంభవించడం వలన పూర్వం అమలాపురం నుంచి అగ్నిమాపక యంత్రాలు వచ్చేవి. ఈ లోపుగా అంతా భస్మీపటలం అయ్యేది. అందుచే 1979నుంచి రాజోలులో అగ్నిమాపకకేంద్రం పెట్టాలని ప్రతిపాదనలు ప్రారంభం అయ్యాయి. అయితే దానికి రూ॥ 50,000లు విరాళాలివ్వాలని ప్రభుత్వం షరుతు విధించింది. అందుపై రాజోలు సర్పంచి పొన్నాడహనుమంతరావు అప్పటి పంచాయితీసమితిలో ఒక తీర్మానం చేయించి అన్ని పంచాయితీలు విరాళాలివ్వాలని నిర్ణయించారు. చాల పంచాయితీలు విరాళాలు యిచ్చాయి. ఆ తరువాత 1983లో యం.ఎల్.ఎ. శ్రీ సూర్యనారాయణరాజుగారి అధ్యక్షతన, పొన్నాడహనుమంతరావు కార్యదర్శిగా, శివకోడు మేడిచర్లబాల్జీగారు మొదలైనవారు మెంబర్లుగా ఒక కమిటీ ఏర్పడింది. ఆ తరువాత రాజోలుకు ఒక అగ్నిమాపకేంద్రం మంజూరుచేయబడింది. తాలూకా ఆఫీసు ఆవరణలో నైరుతీమూలస్థలం ఇందుకు యివ్వడానికి అప్పటి కలెక్టరువారు అనుమతిచ్చారు. అగ్నిమాపకవాహనం ఉంచడానికి ఒక టెంపరరీ షెడ్డు వేయాలని డివిజనల్ ఫైరు ఆఫీసరు వారు కోరడంతో సర్పంచి ఒక తాటియాకుల షెడ్డును నిర్మించియిచ్చారు. ది. 7-2-1984న ఈ అగ్నిమాపకేంద్రం శ్రీ అల్లూరివెంకటసూర్యనారాయణ రాజుగారిచే ప్రారంభింపబడింది. అప్పటి కాకినాడ డివిజనలు ఫైరు ఆఫీసరు నంజుండయ్య అధ్యక్షత వహించారు. సర్పంచి హనుమంతరావు నివేదిక సమర్పించి స్వాగతం పలికారు. ఆ తరువాత అదే ప్రదేశంలో శాశ్వతభవనం నిర్మింపబడింది. చుట్టుప్రక్కలు ఎక్కడ అగ్నిప్రమాదం జరిగినా ఈ కేంద్రం ఎంతోసేవచేస్తోంది.

**తుఫానులు** : రాజోలు ఉత్తరకోస్తాప్రాంతం కావడంతో బంగళాఖాతంలో ఏర్పడిన వాయుగుండాలు తుఫానుగా మారి ఒడ్డున తాకడం సుమారు 100 కిలోమీటర్లు వేగంతో గాలివీచడం తుఫాన్లురావడం జరుగుతుంటాయి. ఈ రాజోలు ప్రాంతానికి సాధారణంగా అక్టోబరు 15, నవంబరు 15 మధ్య మాత్రమే ఇట్టి తుఫానులు తాకే గత అనుభవాలు ఉన్నాయి. 20వ శతాబ్దంలో రాజోల్కు 15-10-1904న పెద్దగాలివాన వచ్చింది. తిరిగి 1924 అక్టోబరులో గాలివాన వచ్చింది. ఇది రాజోలులో చాల యిళ్ళుదెబ్బతిన్నాయి. మళ్ళీ 25-11-38న పెద్ద గాలివాన వచ్చింది. ఇది సాయంత్రానికి బాగా పెరిగి రాత్రి 3గం॥ల వరుకు ఉన్నది. రాత్రి 11 గం॥లకు పెద్దకాంతి ఉత్తరం నుంచి దక్షిణంగా వెళ్ళడం చాలామంది చూసారు. చాలా చెట్లు కూలిపోయాయి. ఆకులు నల్లగా అయిపోయాయి. తరువాత మళ్ళీ 17-10-45న గాలివాన వచ్చింది. తిరిగి 27-10-49 మళ్ళీ 7-11-1969లలో గాలివానలు వచ్చాయి. ఈ మధ్య అనగా 6-11-96న ఒక గాలివాన వచ్చింది. కాని రాజోలు

పై నుంచి అనగా నగరం నుండి యానాం వరకు మాత్రమే బాగా బీభత్సం జరిగింది. భగవంతుడు దయవల్ల రాజోలు తప్పుకొంది.

**వరదలు** : ఉప్పొంగే గోదావరి ఎంత అందంగా ఉన్నా కోపం వస్తే మాత్రం రౌద్రరూపం దాల్చి కట్టత్రెంచుకొని ఊళ్ళమీదకు వస్తుంది. అదేం విచిత్రమో గాని రాజోలులో గోదావరి మాత్రం ఎన్నోసార్లు ఆగ్రహించిందే గాని రాజోలులో ప్రవేశించలేదు. రాజోలు సముద్రం మట్టంతో సమానంగా ఉంటుంది. గోదావరి వరదలు వస్తేమాత్రం నీరు ఇళ్ళకప్పులతో సమానంగా ఉంటుంది. ఏటిగట్టును త్రెంచుకొనివస్తే రాజోలు ఏమయ్యేదో ఊహించలేనిదే పైగా ఈ గోదావరి వరదలు ఎప్పుడూ ఆగష్టునెలలోనే వస్తాయి. ముఖ్యంగా ఆగష్టు 15చాల ప్రమాదమైన రోజు. 20వ శతాబ్దపు మొదటి సంవత్సరంలో గోదావరికి వరదలు వచ్చాయి. 15-8-1900 తేదీన పలివెల వెళ్ళడానికని పొన్నాడ భానుమూర్తి గారు మెండెపులంక దాక వెళ్ళి వరదలు ఎక్కువుగా ఉండడంతో తిరిగి వచ్చివేశారు. ధవిళేశ్వరం ఆనకట్టవద్ద గోదావరి నీటిమట్టానికి 18 అడుగులు వరకు మాత్రమే కొలబద్ద ఉండేది. 1900 వరదలకు ఇది 16'-9" కు చేరింది. తరువాత మళ్ళీపెద్ద వరద 6-8-42న వచ్చింది. ఈ మట్టం ఈ సారి 17'-3" కు చేరింది. 7-8-42న రామరాజులంక గ్రామంలో గండిపడింది. 8-8-42న అప్పటి డిస్ట్రిక్ట్ మున్సిఫ్ ఎల్లాప్రగడ సత్యనారాయణగారు ఉదయం 8-00 గం॥లకు కబురుచేయగా పంచాయితీ ప్రెసిడెంట్ పొన్నాడసూర్యారావుగారు వారింటికి వెళ్ళారు. అక్కడ న్యాయవాదులు వాడ్రేవురామమూర్తిగారు, వాడ్రేవుపాపయ్యగారు, చెలియ్యంబుచ్చిబ్బాయిగారు ఉన్నారు. వీరంతా రామరాజులంకకు సాయంచేయడాన్కి చందాలకు తిరిగి అప్పటికప్పుడు సుమారు 150రూ॥లు మూడుబస్తాలు బియ్యం సేకరించారు. ఇది తీసుకొని మధ్యాహ్నం మూడు నావలమీద బయలుదేరి సాయంకాలాన్కి వీరు రామరాజులంక చేరారు. ఊరంతా నిలువులోతు నీరు వున్నది. పడవల మీదనే ఊళ్ళో తిరిగేరు. కుక్కలు, కోళ్ళు, ఇళ్లకప్పుల మీద ఉన్నాయి. పేదవారు కాల్వగట్టుపై చిన్నగుడెసెలు వేసుకొన్నారు. వారికి బియ్యం, రొఖ్ఖం పంచి తిరిగి వీరంతా నడుచుకొంటూ శివకోడు మీదగా రాజోలు రాత్రి 11-30ని॥లకు చేరుకొన్నారు.

తిరిగి 24-8-1944న ఓ మోస్తరు వరదలు వచ్చాయి. తిరిగి 1953సం॥ ఆగష్టు 15వ తేదీన విపరీతంగా వరదలు వచ్చాయి. ధవళేశ్వరం వద్ద 18 దాటిపోయింది. చాలాచోట్ల గట్లకు గండ్లుపడ్డాయి. రాజమంత్రి ఆర్యాపురంలో నీరు ప్రవేశించింది. చాలా నష్టం జరిగింది. నడక నేర్చుకోవడానికి ఉపయోగించే ఒక చిన్న పిల్లవాని బండి ఎలక్ట్రికల్ లైన్ పై చిక్కుకొన్నట్లు పేపర్లో ఫొటోలు వచ్చాయి. దానిని బట్టి గోదావరి ఎంత ఎత్తు వచ్చిందో అర్థంవుతుంది. గోదావరికి చాలా దూరంగా ఉన్న అమలాపురం కూడ కౌశిక అనే చిన్నపాయ ద్వారా వచ్చిన నీటితో మొత్తం అమలాపురంలో మొలలోతు నీరుచేరింది. పడవలు తిరిగాయి. రాజోలులో 15-8-53 రాత్రికి గోదావరి బాగా పొంగి ఏటిగట్టు మట్టానికి ఇంచుమించు సమానంగా చేరింది. రాత్రి వేసిన గాలికి గోదావరి కెరటాలు కొన్నిచోట్ల గట్లుమీద





నుండి మెల్లిగాజారి ప్రక్కకాల్వలో పడేవి. ఊరంతా భయంతో నిండిపోయింది. ఏ క్షణాన్నైనా గోదావరి రాజోలు పై పడవచ్చు కాని ప్రజలు తెల్లవార్లూ ఇసుకబస్తాలు అడ్డంగావేస్తూ కాపాడుకొన్నారు. అలాగే రవిథియేటరుకు ఎదురుగా ఊల పడింది. అదికాపాడుకొన్నారు. ఈ లోపుగా నాగుల్లంక వద్ద గట్టుకు గండిపడటంతో పొదలాడకు పై నున్న అన్నిగ్రామాలు నీటమునిగాయి. అయితే తాటిపాక గ్రామానికి చెందిన జనం గునపాలతో పొదలాడకు వచ్చి లాకుఎత్తివేయండనీ, లేకపోతే బద్దలుకొడతామని లాకు సూపర్‌డెంట్‌ను బెదిరించారు. పొదలాడ లాకుఎత్తివేస్తే నీరు రాజోలువైపు వెళ్ళాలని వారి ఉద్దేశ్యం. కాని నీటివాటం భూమిలెవెలు దక్షిణంవైపునకు ఉన్నది. అయినా వరదలు సమయంలో కాల్వలో నీరు నిండుగా వదలి లాకులు మూసివేసి ఉంచాలనేది ఇరిగేషన్ రూల్స్. అందుచే లాకు ఎత్తడాన్కి లాకు సూపర్నెంట్ అంగీకరించకపోవడంతో లాకుబద్దలు కొట్టడాన్కి ప్రయత్నించారు. ఈ లోపుగా ఈ గొడవ తెలిసిన తహశీల్దార్ ఖాన్ గారు పోలీసుబలగంతో అచ్చటకు వచ్చి లాకుబద్దలుకొడితే ఫైరింగ్ చేస్తామని హెచ్చరించారు. దానితో రాజోలుకు కాల్వల్లోకి నీరుప్రవేశించలేదు. సహజంగా మట్టాన్నిబట్టి దక్షిణంగా వరదనీరు వెళ్ళిపోయింది. మళ్ళీ ఇదే పరిస్థితి 86లో వచ్చింది.

ఇక తిరిగి 1958లో సెప్టెంబరులోను 1959 సెప్టెంబరులోను వరదలు వచ్చాయి. అయితే ఇవి 1953 కంటె ఎక్కువకాదు. కాని ఈవరద చాలాకాలం ఉండటంతో గట్లు నానిపోయాయి. 1959లో వరద చాలా ఉధృతంగా ఉండగా అనుకోకుండా ఒకరోజు ఉదయం 6గం॥లకు ప్రస్తుతం కాలేజి ఎదురుగా గల గోదావరిగట్టు సుమారు 50గజాల పొడవున సగం చీలి కాలువలో పడిపోయింది. ఇక మిగతా సగం పడిపోతే నీరు రాజోలులో ప్రవేశించేది. ఈ వార్త దావానంలా ఊరంతా తెలియడంతో ప్రజలంతా అక్కడికి చేరుకొన్నారు ఇంతలో చింతలపల్లి నుండి అల్లూరిపెదసూర్యనారాయణరాజుగారు కూడ అక్కడికి చేరుకొన్నారు. ఊరులోని వడ్రంగులను పిలిపించారు. గట్టుపై ఉన్న పెద్ద సరుగుడుచెట్లను అప్పటికప్పుడు నరికి బాదులు చేశారు. వాటిని కాల్వ వైపుపాతి అడ్డుకర్రలువేసి కూలిపోయిన గట్టుభాగంలో ఇసుక బస్తాలువేశారు. గోదావరి వైపు గల కొన్నిచెట్లకు సరుగుడుబాదులకు పగ్గాలువేసి బిగించారు. అ సమయంలో గట్టుకు లోపల బయట చెట్లుఉండటంతో ఇది సాధ్యమయింది. మొత్త ఊర్లోని చిన్నాపెద్దా అంతా యుద్ధప్రాతిపదికపై ఈ పనిని 10గం॥లకు పూర్తిచేసారు. అప్పటికప్పుడు కూలిపోయిన గట్టును తిరిగి పునర్నిర్మించారు. ఇంజినీరంగు అనుభవం గల అల్లూరిపెద్దసూర్యనారాయణరాజు గారి ఆధ్వర్యంలో అడ్వకేటు వెంపరాల కామేశ్వరరావుగారి పర్యవేక్షణలో కన్సర్వెన్సీ డిపార్ట్‌మెంటు వారి సహకారంతో ఈ పని పూర్తిచేయబడటంతో రాజోలు రెండవసారి రక్షింపబడింది. లేనిచో అదేరోజు గట్టుకు గండిపడి నీరు ఊళ్ళోకి ప్రవేశించేది. ఈ అనుభవంతో గోదావరి గట్లు ఎత్తుచేసి బలంచేయడాన్కి ప్రభుత్వం నిర్ణయించింది. రాజోలులో ఇందుకు ఒక ప్రత్యేక సబ్‌డివిజన్ ఏర్పాటుచేసి 1960లో గోదావరి గట్లు బలంచేసి, ఎత్తుచేశారు.

ఆ తరువాత మళ్ళీ 1986వరకు పెద్ద వరదలు రాలేదు. కాని తిరిగి 1986 ఆగష్టు నెలలో

గోదావరికి అతిపెద్ద వరద వచ్చింది. ఇదికూడ 15-8-86న ఉధృతమై రెండురోజులు ఉన్నది. ఆగష్టు 10,11తేదీలలో విపరీతంగా వర్షాలు పడటం గోదావరి దాని ఉపనదులు ఒకేసారి పొంగడటంతో వరద రికార్డు బద్దలు కొట్టింది. ధవళేశ్వరంలో కొలబద్ద పూర్తిగా మునిగిపోయి ఎంతరీడింగ్ ఉన్నదో తెలియని పరిస్థితి ఏర్పడింది. 24' తిరిగి 25'లకు చేరి ఉండవచ్చునని అంచనావేశారు. ఆగష్టు 15 ఉదయం స్వాతంత్ర్యదినోత్సవ పతాక ఆవిష్కరణలు జరిగే సమయాన్కి వరదలు చాలా ఉధృతంగా వస్తుందని రేడియోల్లో ప్రచారం జరిగింది. లంకలో ప్రజలను ఖాళీ చేయించి ఇవతలకు తీసుకువచ్చారు. పెద్దవరదకు మధ్యలంక మునిగిపోతుంది. అక్కడ కాపురం ఉంటున్న సుమారు 100 కుటుంబాలవారిని ఇవతలకు తీసుకొనివచ్చి శిబిరాలలో ఉంచుతారు.

అతిప్రమాదాన్ని గుర్తించిన సర్పంచ్ పొన్నాడహనుమంతరావు ఆ సాయకాలం రాజోలు సత్రంలో అందరి పెద్దలతో, రోటరీక్లబ్, యూత్‌క్లబ్, ఇండియన్ మెడికల్ అసోసియేషన్ వంటి సేవాసంస్థలతో సమావేశం ఏర్పాటుచేశారు. రాజోలును రక్షించుకోవడానికి అందరూ కలసి కార్యాచరణగావించారు. ఒక వేళ వరదనీరు ప్రవేశిస్తే పల్లపుప్రాంతంవారు ఎక్కడతలదాచుకోవాలో నిర్ణయించారు. అప్పటికే గోదావరి గట్టుకు ఒక అడుగుతేడాలో నీరు ఉన్నది. ఇంకా పెరుగుతుందని హెచ్చరికలు చేశారు. సాధారణంగా వరదలు వచ్చినప్పుడు ఎండగా ఉంటుంది. ఈ వరదకు పెద్దవర్షంకూడా తోడయింది. విద్యుత్‌శక్తి సరఫరా నిల్చిపోయింది. అది భయంకర కాళరాత్రి. అప్పటికప్పుడు పంచాయితీ వారు ట్యూబ్‌లైట్లు ఏటిగట్టు పై ఏర్పాటుచేయగా రోటరీక్లబ్ అధ్యక్షులు దంగేటిరామచంద్రరావుగారు జనరేటర్ ఏర్పాటుచేశారు. ప్రభుత్వయంత్రాంగం పూర్తిగా విఫలమై ఏమిచేయలేని పరిస్థితికి వచ్చారు. ఇక పెద్దలు మైకులో ఊరంతా ప్రచారంచేయించి అప్రమత్తులై ఉండాలని హెచ్చరిక చేసారు. మూతిపై మీసం ఉన్న యువకులందరూ బ్యాటరీలైట్లుతో కర్రలతో రాత్రంతా ఏటిగట్టుకు వచ్చి కాపలాకాయాలని మైకులో ఉద్దేశించడంతో అన్ని వర్గాల వేలాది యువకులు తెల్లవార్లూ వానలో తడుస్తూ గట్టుపై అప్రమత్తంగా ఉంటూ గట్టును రక్షించారు. ఈ లోపుగా ఒంటరి స్త్రీలు, వృద్ధులకోసం రక్షణగా వాలంటరీరక్షక దళాలను కూడా పంపి తెల్లవార్లూ పారి కాసారు. సాధారణంగా ఇటువంటి ఉపద్రవాలు వచ్చినప్పుడు కొన్ని సంఘవ్యతిరేక శక్తులు విజృంభిస్తూ ఉంటాయి కాబట్టి ఈ చర్య తీసుకొన్నారు. తెల్లవార్లూ కాపలాకాస్తూ అందరూ ఇళ్ళకు వెళ్ళేసరికి అదునుచూసుకొని ఊళ్ళోకి గోదావరి ప్రవహించబోయింది. గట్టుతో సమానంగా గోదావరినీటి మట్టం అపైన వర్షం దీనితో సెంతమార్కెట్‌కు, మరియు పల్లిపాలెం మధ్యగాగల ఏటిగట్టు భాగం సుమారు 100గజాలు పొడుగునా సగంగట్టు కాల్వలోకి విరిగి పడిపోయింది. గట్టు అడుగునుంచి బొలల ద్వారా నీరు ఇవతలకు లీకుఅవుతోంది. ప్రమాదం అంచుకుచేరింది. అచ్చట గోదావరి వంపుకూడా ఉండటంతో అంతటి గోదావరి ప్రవాహం అంతా ఆ గట్టును గుద్దుతోంది. నిమిషాలలో రాజోలు మధ్యనుంచి మరియొక గోదావరిపాయ ఏర్పడిఉండేది. వెంటనే ప్రజలు స్పందించారు.







పెద్దలు నాయకత్వంలో గట్టు సంరక్షణ ప్రారంభం తెల్లవారు గట్టు అరుగంటలకే ప్రారంభం అయింది. ఊళ్ళోంచి ఎక్కడ దొరికితే అక్కడనుండి బస్తాలలో ఇసుక తీసుకువచ్చి కరలుపాతి అడ్డుకట్టలు కట్టి యుద్ధప్రాతిపదికపై వందలాదిమంది పనిచేసారు. అయినా ప్రమాదం ఆగలేదు. ఆసమయాన్ని అప్పటి మట్టపర్రు సర్పంచి కనుమూరి నరసింహారాజు రక్షణ కార్యక్రమాన్ని ఆతృతతో వచ్చారు. ప్రక్కగ్రామాలు నుండి కూడా ట్రాక్టర్లతో ఇసుకరావడం ప్రారంభించింది. నాగుల్లంక వద్ద ప్రజలు కలుగజేసుకోకపోవడంతో మళ్ళీ అక్కడ గండిపడింది. రవాణా ఆగిపోయింది. అందుపై ఒక వేళ గండిపడితే ప్రజలు తలదాచుకోవడాన్కి వీలుగా ఆర్.టి.సి. బస్సులను సిద్ధంచేయమని రాజోలు సర్పంచి అప్పటి ఆర్.టి.సి. డిపోమేనేజర్‌ను కోరగా తిరస్కరించినందున [illegible] జరిగింది. ఈలోపుగా మట్టపర్రు సర్పంచి గండి ఆపడానికి సిమ్మెంటుబస్తాలు కావాలని కోరడంతో అప్రయత్నం ప్రారంభమయింది. ఆర్. అండ్.బి. వారి గోడౌను బద్దలుకొట్టి సిమ్మెంట్ బస్తాలను గండివద్దకు ప్రజలు తరలించారు. [illegible] నుంచి పేపబస్తాలు వేస్తుండగాకరిగిపోవడం ప్రజలు రెండురోజులు అలాగే అక్కడపనిచేస్తూనే ఉన్నారు. ఇంకా [illegible] వారికి ఆహారపొట్లాలు సరఫరాచేస్తూ ఉన్నారు. ఆఖరికి రాజోలు మోటారుసైకిల్ మెకానిక్ వెలుగొట్ల సూర్యనారాయణ ఎంతో సాహసంతో ఒకపెద్ద పగ్గం కట్టుకొని మరియొకరి సాయంతో సిమ్మెంటుబస్తా నెత్తిమీద పెట్టుకొని గోదావరివైపు అంతటి ప్రవాహంలో లోపలికి దిగి గట్టుకు పడిన కన్నంలో సిమ్మెంటుబస్తా కూరి వచ్చేయడంతో ఆ బొల నుండి లీకేజి ఆగిపోయింది. అతని సాహసాన్ని ప్రజలు ఎంతగానో అభినందించారు. తరువాత వరద ప్రాంతం చూడటానికి వచ్చిన అప్పటి కేంద్రమంత్రి జలగం వెంగళరావుగారిచే [illegible] జరిగిన ఒక మీటింగులో శ్రీ సూర్యనారాయణకు ఒక జ్ఞాపిక కూడ బహూకరించబడింది. ఇటువంటి సమయాలలో సహకరించవలసిన అప్పటి ప్రభుత్వ అధికారులు ఏమీచేయలేకపోగా, ప్రభుత్వంవారి సిమ్మెంటు బస్తాలు దొంగిలించారని సర్పంచి హనుమంతరావు గారి మీద, మట్టపర్రు సర్పంచి కనుమూరి నరసింహరాజుగారి మీద, డా॥ వి. శేషగిరిరావు గారి మీద కేసు రిజిష్టరు చేశారు. తరువాత అప్పటి వ్యవసాయశాఖమంత్రి రాజగోపాలరెడ్డి రాజోలు వచ్చినప్పుడు పరిస్థితి తెలుసుకొని ఈ కేసును ఉపసంహరించారు. రెండురోజులకు గోదావరి తల్లి శాంతించింది. ప్రభుత్వంమీద ఆధారపడితే నాగుల్లంక, గోపాలపురం, ధవళేశ్వరంలో వలె రాజోలులో కూడ నీరు ప్రవేశించేది. ప్రజలంతా ఒక్క తాటిపై నడిచి తమకు తాము రక్షించుకొన్నారు. దీనికి నిజంగా దైవబలం కూడ తోడయింది. ప్రజలు చేసుకొన్న ఈ రక్షణను పత్రికల్లో కూడ ప్రచురించారు. ఇక ముందుకూడ రాజోలులో ఇటువంటి సహకారం ఉంటుందని, ఉండాలని ఆశిద్దాం. వరదల తరువాత రాజోలు నుంచి నాగుల్లంక, లూటుకుర్రు గ్రామాలకు వెళ్ళి వరద సహాయకార్యక్రమాలు కూడ రాజోలు పెద్దలు నిర్వహించారు. పొదలాడలాకు వద్ద 1953 సంఘటన పునరావృతం కాబోయింది గాని అదృష్టవశాత్తు జరగలేదు. ఈ వరద తరువాత తిరిగి ఏటిగట్టు ఎత్తు చేయబడి బలపరచబడింది. ప్రమాదం జరగబోయిన చోట గోదావరి గట్టుకు సిమ్మెంటుతో రక్షణ గోడ నిర్మించబడింది. అందుచే 1990లో కూడ గోదావరికి వరదలు వచ్చినా అప్పుడు పెద్ద భయం కలుగలేదు.

ఈ విధంగా ఎన్నోసార్లు ప్రకృతి భీభత్సాల నుండి రాజోలు తప్పించుకోగలగడం మనందరి అదృష్టం.

# 22. ఆధ్యాత్మిక విషయాలు

రాజోలు పూర్వం నుంచి చాలా ఊళ్ళ కంటె ఎక్కువ అధ్యాత్మిక కార్యక్రమాలకు నిలయమయింది. ముఖ్యంగా రాజోలు పవిత్ర గోదావరినదీ తీరంలో ఉండడంతో ఎంతో ప్రాధాన్యత సంతరించుకొంది. ఈ గోదావరి పాయ వశిష్టనది రాజోలు వద్ద పశ్చిమంగా ప్రవహిస్తోంది. సోంపల్లివద్ద వశిష్టమహాముని తపస్సు చేశాడని, అక్కడ సోమయజ్ఞం జరిగిందని పురాణకథలు చెబుతున్నాయి. ఆ సందర్భంలోనే రాజోలులో అంజనేయస్వామి ఆలయం కూడ ప్రతిష్టింపబడింది.

ఒక నదిలో ఉదయం స్నానం చేయాలంటే సూర్యునికి అభిముఖంగాను, ప్రవాహానికి అభిముఖంగాను చేయాలి. నది పశ్చిమంగా ప్రవహించినప్పుడే ఇది సాధ్యమవుతుంది. సోంపల్లి నుండి రాజోలు దాటే వరకు వశిష్టనది పశ్చిమంగా ప్రవహిస్తుంది. ఇది ఇక ఏ నదికి ఈ అవకాశం లేదు. అందుకే రాజోలు గోదావరిలో స్నానం చేసేటప్పుడు "వశిష్టా : పశ్చిమవాహినీ : స్నానమయం కరిష్యామి" అని సంకల్పం చేయిస్తారు. అందుకే ప్రతి 12 సం॥లకు వచ్చే గోదావరి పుష్కరాలలో రాజోలు పొలిమేరలో సోంపల్లి కూడ ముఖ్యమైన పుష్కరస్నానఘట్టంగా ఉన్నది.

చారిత్రక విషయాలులో వ్రాసినట్లుగా లోగడ యిచ్చట రాజగోపాలస్వామి ఆలయం ఉండేదని అది నదీకోతకు గురై నదీగర్భంలో కలసిపోయిందని, విగ్రహం నర్సాపురం వద్దకు చేరిందని చెబుతారు. ఇక ఇచ్చట పూర్వం నుంచి ఉమారామలింగేశ్వరస్వామి వారి శివాలయం ఉన్నది. ఇది లోగడ అనగా మూడువందల సంవత్సరాల క్రితం పొన్నాడ వారిచే ప్రతిష్ఠ చేసినట్టు చెబుతారు.

ప్రతిగ్రామానికీ ఉన్నట్టుగానే ఈ గ్రామానికి కూడ కనకదుర్గ సహిత "వనువులమ్మ" అమ్మవారు గ్రామదేవత. పూర్వంనుంచి సంతమార్కెట్టు వద్ద ఈ దేవతలకు ఆలయం ఉన్నది. ప్రతి సంవత్సరం ఉగాది తరువాత వచ్చే మొదటివారం అమ్మవారిని నిలబెడతారు. ప్రతిరోజు అమ్మవారి ఘటాన్ని గ్రామంలో ఇంటింటికి తీసుకువెడతారు. అమావాస్యకు 5రోజుల ముందు జాతర జరుగుతుంది. పూజఘటం, ఆ తరువాత ఇతర ఘటాలతో ఊరేగింపు జరుగుతుంది. అమావాస్య వరకు గుడివద్ద చిన్న తీర్థం జరుగుతుంది. గ్రామస్తులు నేవేద్యాలు సమర్పిస్తారు.

20 సం॥ములు క్రితం గన్నవరం కాలువలో కొట్టుకు వచ్చిన ఒక విగ్రహాన్ని పాతబస్స్టాండు వద్ద పెద్దింట్లమ్మగా నెలకొల్పి పాతబస్టాండు వద్ద టాక్సీవర్కర్సు ప్రతి





సంవత్సరం పాల్గుణ మాసంలో జాతరచేస్తారు. ఇక అంజేయస్వామి అలయం గోదావరికి దగ్గరగా యుండి పూర్వం నుంచి ఎంతోమంది భక్తులు ఈ ఆలయానికి వచ్చేవారు. అట్టవణం శేషగిరిరావుగారు ఈ శతాబ్దంలో ఎక్కువకాలం అర్చకునిగా పనిచేశారు. తరువాత వారి మనమడు అంగరవెంకట్రావు, వీరి కుమార్తు కొంతకాలం పనిచేశారు. ప్రయాణీకులుతో ఎప్పుడు రద్దీగా ఉండేది. తరుచు పురాణకాలక్షేపాలు భజనలు జరుగుతుంటాయి. 5-1-35న ఒక మహిళాగాయనిచే హరికథా కాలక్షేపం కూడ జరిగింది. సుమారు 40 సం॥ముల క్రితం ఈ ఆలయంలో ఆగ్నేయమూల ఉత్తర ముఖంగా రామమందిరం కూడ నిర్మింపబడింది. ఈ ఆలయం చాల పురాతనమైనది కావడంతో 1996లో జీర్ణోద్ధరణ చేయాలని తలంచారు కాని జరగలేదు. తిరిగి 2000 సం॥లో ఈ ప్రయత్నం మళ్ళీ ప్రారంభం అయింది. బిక్కినరామంగారి అధ్యక్షతన డా॥ ఎ.వి.అప్పారావుగారి పర్యవేక్షణలో ఒక కమిటీ ఏర్పడి, ఆక్రమణలు ఖాళీ చేయించి ఆలయాన్ని జీర్ణోద్ధరణ చేసి పునర్నిర్మాణం జరుగుతోంది. ఇందుకు ప్రజలునుండి, భక్తులనుండి మంచి సహకారం లభిస్తోంది. తొందరలో ఈ ఆలయ నిర్మాణం పూర్తియి ప్రతిష్టా కార్యక్రమాలు జరగాలని ఆశిద్దాం.

అట్లే రామలింగేశ్వర ఆలయం కూడ పురాతనమైనది. మానేపల్లి పేరయ్య వీరి సోదరులు ఈ శతాబ్దపు మొదట్లో అర్చకత్వం చేసేవారు. 1930నుండి మానేపల్లి అగస్త్తీశ్వరుడుగారు అర్చకత్వం సేవచేస్తున్నారు. ఈ మధ్య వీరి అల్లుడు వీరభద్రశాస్త్రిగారు అర్చకులుగా ఉన్నారు. ఈ అలయానికి రాజోలులో కొంత పల్లపుభూమి, మెరకభూమి కూడ ఉండేది. మెరకభూమిలో చాలాకాలం నుంచి సుమారు 60 కుటుంబాలవారు ఇల్లు కట్టుకొని దేవస్థానానికి కొద్దిగా అద్దెచెల్లిస్తూయుండేవారు. 1975లో వచ్చిన హోమ్‌స్టెడ్ ఆర్డినన్సు ప్రకారం పట్టాలు యిచ్చారు. కానీ ఈ ఆర్డినన్సు చట్టంగా మారినపుడు దేవస్థానంభూములకు ఈ చట్టం వర్తించదని మార్పుచేశారు. అయినా ఆతరువాత ఈ పట్టాలుఖాయమయ్యాయి. దానితో ఈ ఆలయం తన విలువైన భూమిని కోల్పోయింది. ఈ ఆలయంలో ప్రతిసంవత్సరం జ్యేష్టశుద్ధ ఏకాదశినాడు ఉమారామలింగేశ్వరస్వామివారి కళ్యాణం 1994 వరకు పొన్నాడవీరభద్రవిశ్వేశ్వరరావుగారి కుటింబీకులచే జరిపించబడేది. పూర్వం బెండపూడి సూరమ్మగారు (పొన్నాడసూర్యారావుగారి పెదతల్లి) ఈ ఆలయానికి మండపం కట్టించారు. కాని బాగులేనందున తిరిగి సూర్యారావుగారు 1931 మార్చి నెలలో తిరిగి నిర్మింపచేశారు. 19-7-31న నాపరాళ్ళు వేయించారు. తిరిగి మండపాన్ని 1992లో కాచీభట్లగోపాలకృష్ణమూర్తిగారు, పొన్నాడహనుమంతరావుగారు కలసి పునర్నించారు. శ్రీ గోపాలక్రిష్ణమూర్తిగారు రాజోలులో పుట్టి హైస్కూలు విద్యపూర్తిచేసి ఇంజనీరింగు పూర్తిచేసి రాజోలులో వశిష్టసబ్‌డివిజనలు ఇంజనీరుగా పనిచేస్తూ 18-6-90 శిఖరం పునఃప్రతిష్టకూడ చేశారు. తరువాత ఈ శివలింగం జీర్ణంకావడంతో 1994లో ఇందుకు డా॥ ఎ.వి. అప్పారావుగారి అధ్వర్యంలో ఒక జీర్ణోద్ధరణ కమిటి ఏర్పడి సుమారు రెండులక్షలు వసూలుచేసి నూతన శివలింగ ప్రతిష్ఠ 1994 మే నెల2వ వారంలో పూర్తి అయింది. తాటిపాక బిక్కిన సుబ్బారావుగారిచ్చిన టేకు చెట్టుతో

కొత్త ధ్వజస్థంభం కూడ పునః ప్రతిష్టచేయబడింది. అప్పటి నుంచి జీర్ణోద్ధరణ కమిటి ఆధ్వర్యంలో ప్రతి సం॥ వైశాఖమాసంలో కళ్యాణం లక్షపత్రి పూజకూడ జరుగుతోంది. ప్రతివిజయదశమికి పొన్నాడహనుమంతరావుగారి కుటుంబీకులచే శమీపూజ జరుగుతుంది. కార్తీకపూర్ణిమ నాడు నున్నగోపాలకృష్ణ నారాయణస్వామివారి కుటుంబీకులచే జ్వాలాతోరణం జరుగుతుంది.

ఇక 1924లో పొన్నాడ సూర్యరావుగారు శివాలయానికి ఒక ఇత్తడి సుబ్రహ్మణ్యేశ్వర వాహనాన్ని బహుకరించి అప్పటినుంచి ప్రతిసంవత్సరం మార్గశిర శు॥ పంచమి రోజురాత్రి దేవసేన సుబ్రహ్మణ్యేశ్వర కళ్యాణం ప్రారంభించారు. ఇప్పటికీ వారి కుటుంబసభ్యులు కొనసాగిస్తున్నారు. సుబ్రహ్మణ్య షష్టికి శివాలయం ప్రక్క గ్రామముల నుండి కూడ వచ్చి గోదావరి స్నానాలు తెల్లవారజామున నుంచి చేస్తారు. తీర్థం కూడ జరుగుతుంది. ఈ శివాలయానికి వాయువ్యమూలలో ధరణీప్రగడ వెంకట్రామయ్యగారు ఒక రామాలయాన్ని నిర్మింపచేసి ప్రతిసం॥రం శ్రీరామనవమి జరుపుతారు. ఈ శివాలయ ఆవరణలో ఎన్నో పురాణాలు, మచిలీపట్టణానికి చెందిన శర్మగారు భగవద్గీత ఉపన్యాసాలు ఇచ్చారు.

1977లో అప్పటి తహశీల్దారు ఆకెళ్ళ సూర్యప్రకాశరావుగారి ఆర్థిక సహాయంతో వేరే సుబ్రహ్మణ్యస్వామి ఆలయం నిర్మించి ఆగస్టు 20,21,22 తేదీలలో సూర్యప్రకాశరావుగారు, పొన్నాడవెంకటసుబ్రహ్మణ్య క్రిష్ణప్రసాదుగారు కలిపి విగ్రహప్రతిష్ఠ చేశారు. ఈ ఆలయానికి అప్పటినుంచి పొన్నాడహనుమంతురావు గారు మేనేజింగ్‌ట్రస్టీగా యున్నారు.

ఇక 20వ శతాబ్దంలో కలియుగ దైవం శ్రీ వెంకటేశ్వరస్వామివారి ప్రాముఖ్యత పెరిగింది. 1940 తరువాత రాజోలులో తహశీల్దారుగా పనిచేసిన జట్ల సత్యనారాయణగారు వేంకటేశ్వరస్వామి భక్తుడు కావడంతో ఆయన రాజోలులో వేంకటేశ్వర ఆలయనిర్మాణకార్యక్రమం ప్రారంభించారు. సుందరమ్మ చెర్వు తూర్పుగట్టున ఆర్.సి. నెం. 62లో నిర్మాణం ప్రారంభించారు. చివరకు 4-5-1944 ఆయనచే శ్రీ వెంకటేశ్వరస్వామి విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. మంగెనవారు, కస్తూరిసత్యవతమ్మగారు భోళ్ళవారు ఈ దేవస్థానానికి భూములు కూడ వ్రాసియిచ్చారు. ఈ ఆలయానికి స్థానాచార్యులుగా కొమండూరి శోభనాద్రాచార్యులు గారిని నియమించారు. ఈయన రాజోలు నుంచి వెళ్ళిపోవడంతో భట్టరు లక్ష్మీనారాయణాచార్యులుగారిని స్థానాచార్యులుగాను, సుదర్శనం వెంకట రమణాచార్యులు గార్ని అర్చకునిగా నియమించారు. జట్ల సత్యనారాయణగారు బదిలీ అయి వెళ్ళిన తరువాత కూడ వారి మేనేజిమెంటులోనే యుండేది. అయితే 1975లో తిరిగి శోభనాద్రాచార్యులుగారు వచ్చి మేనేజిమెంటు చేయడంతో వారికి జట్ల సత్యనారాయణగార్కి పేచీలురావడంతో శోభనాద్రాచార్యులుగారు సత్యనారాయణగారి పైన వారి కుమార్తు వెంకటేశ్వర్లుపైన వారి మేనల్లుడైన డా॥ మల్లికార్జునరావుగారి పైన 1976లో మున్సిఫ్‌కోర్టులో దావాచేశారు. ఈ గుడికి నాకు అగ్రిమెంటు ఉందని, నేనే మేనేజిచేయాలని వాదించగాకోర్టు ఆదావా తేలేవరకు పొన్నాడహనుమంతరావుగార్ని రిశీవరుగా నియమించారు. 1988 వరుకు రిశీవరు మేనేజిమెంటులో ఉన్నది. ఈ లోపుగా ఆ గుడిలో తాళాలు బ్రద్దలుకొట్టి 4సార్లు





దొంగతనాలు జరిగి వెండి, బంగారువస్తువులు పోయాయి. చివరకు ఒక దొంగతనంలో శోభనాద్రాచార్యులుగారి వద్ద నుంచి కొంతవెండి బంగారం స్వాధీనం చేసుకొని రాజోలు పోలీసువారు కేసు పెట్టగా అమలాపురం కోర్టులో ఆయనకు శిక్ష పడింది. ఆ తరువాత అప్పీలులో ఈ కేసు కొట్టివేశారు. ఈ లోపుగా దేవాదాయధర్మాదాయశాఖవారు ఈ దేవస్థానాన్ని తీసుకొంటూ నోటీసు చేశారు. అది చెల్లదని శోభనాద్రాచార్యులుగారు హైకోర్టులో రిట్‌దాఖలు చేసి స్టే దాఖలు చేశారు. ఈ లోపుగా ఎవరూ కలుగచేసుకోకపోవడంతో ఈ దావా ఆయనపరం అయింది. దేవాదాయశాఖవారు గాని గ్రామస్థులుగాని పట్టించుకోకపోవడంతో 1999 వరుకు కూడ ఎంతో ఆదాయం కలిగిన ఈ ఆలయం ఒకేఒక్క ప్రైవేటువ్యక్తి ఆధీనంలో ఉండేది. ఎన్నోభూములు, వస్తువులు, ఆదాయం కలిగిన ఈ ఆలయం యిప్పుడు చాలదీనావస్థలో ఉంది. ఈ మధ్యనే దేవాదాయశాఖవారి ఆధీనంలోకి వచ్చింది. అన్యాక్రాంతమైన భూములు, వస్తువులు తిరిగి పొందడానికి ఈ శాఖవారు ప్రయత్నించి ఈ ఆలయానికి పూర్వవైభవం తెస్తారని ఆశిద్దాము. ఈ ఆలయంలో ప్రతిసంవత్సరం సెప్టెంబరులో బ్రహ్మోత్సవాలు జనవరి 13న గోదాదేవికళ్యాణం, చైత్రశు॥ ఏకాదశికి వేంకటేశ్వరకళ్యాణం జరుగుతుంది. ఈ వేంకటేశ్వరకళ్యాణం మొదట్లో డా॥ కొమ్ముల రాజారావుగారు, తరువాత వారి సంతతివారు జరుపుతున్నారు. లక్ష్మింశెట్టి వెంకటేశ్వరరావుగారి కుటుంబీకులు గోదాకళ్యాణం జరుపుతారు.

శివాలయం, వేంకటేశ్వరస్వామి ఆలయాలలో ధనుర్మాసం సందర్భంగా ప్రత్యేకపూజలు జరుగుతాయి. తెల్లవారుజామునే భజంత్రీలతో గోదావరికి వెళ్ళి అర్చకులు తీర్థపుబిందె తెస్తారు.

ఇక 1980లో లేటు కస్తూరి సుబ్బారావుగారి కోరిక ప్రకారం బి.సావరం రోడ్డులో కోడివారింటి ప్రక్కగా సావరం కస్తూరివారిచే యఱ్ఱమిల్లి సూర్యప్రకాశరావుగారి ఆధ్వర్యంలో శ్రీ వీరవెంకటసత్యనారయణ స్వామివారి ఆలయం నిర్మించబడింది. ప్రతిసంవత్సరం వైశాఖ శు॥ ఏకాదశి కళ్యాణం జరుగుతుంది.

అట్లే 1988ప్రాంతంలో భారంవారి వంతెనగా పిలవబడేచోట గణపతి ప్రయుక్త కనకదుర్గ ఆలయం నిర్మించబడింది. వంతెన ప్రక్కగా శాస్త్రోక్తంగా ఈ ఆలయానికి జి. రాజేంద్రప్రసాద్ ప్రతిష్ఠాకార్యక్రమం నిర్వహించారు. దొర్లపెదబాబుగారు, చదలాడరామారావుగారు, అరుమిల్లి రామచంద్రరావు,బందారు భాస్కరరావు,నైనాల సత్యనారాయణమూర్తి వగైరాలు ఈ కార్యక్రమాలు నిర్వహించారు. ఇది రోడ్డు ఆక్రమణలో ఉందని 1997లో పంచాయితీరాజ్‌వారు దీనిని తీసివేయడానికి ప్రయత్నిస్తుంటే విగ్రహాలను వేరే ఉంచి ప్రస్తుతం గుడిని ప్రక్కగా వేరే స్థలంలో నిర్మిస్తున్నారు.

1988లో సత్రము ఎదురుగా గల సందులో వీరభద్రస్వామి, స్వామిఅయ్యప్ప మందిరాలు నిర్మించబడ్డాయి. శివరాత్రికి వీరభద్రస్వామికి ఘనంగా ఉత్సవాలు జరుపుతారు.

ఇక 1993లో సాయిబాబాఆలయం నిర్మాణానికి, దంగేటిరామచంద్రరావు, దారపురెడ్డి వీరవెంకటసత్యనారాయణ (చిట్టి) గారలు వగైరాలతో దత్తసాయిసంక్షేమసంఘం ఏర్పడింది.

ఆర్.యస్.నెం.111/1గా గల గ్రామచావిడిలోని బందిలదొడ్డి మూడుసెంట్లు స్థలం ప్రభుత్వంవారు ఈ సంఘానికి దఖలుపరచారు. ఈ స్థలాన్ని పడమరగల మరో మూడుసెంట్లు స్థలం వారు కోరగా అది లోగడ బార్‌అసోసియేషను వారికి లీజుకు యిచ్చినట్లు రికార్డు ఉన్నందున వారు అభ్యంతరపెట్టి కోర్టులో దావాచేశారు. అప్పటికే ప్రభుత్వంవారు ఆ స్థలం యివ్వగా అప్పటి జిల్లాకలెక్టరును ఈ అంశం పరిశీలించమని వేరొక రిట్‌లో హైకోర్టు ఆదేశించగా అప్పటి కలెక్టరు విచారణచేసి రెవిన్యూవారు యిచ్చిన పట్టా రద్దుచేసి తిరిగి ప్రతిపాదనలు పంపారు. ఆ తరువాత బార్ అసోసియేషను వార్కి, దత్తసాయి సంక్షేమసంఘం వారికి రాజీకుదరడంతో తిరిగి వారికి పట్టా యిచ్చారు. ఆ తరువాత నిర్మాణం 1995లో ప్రారంభమయి 2000 సం॥ ఏప్రియల్ నెలలో ప్రతిష్టా కార్యక్రమం జరిగింది. గ్రౌండ్‌ఫ్లోర్‌లో గన్నాబత్తుల వారి పేర కళ్యాణమండపం, మొదటి అంతస్తులో సాయిమందిరం, రెండవ అంతస్తులో లైబ్రరీ నిర్మించబడ్డాయి. అప్పనధర్మసాయి, దారపురెడ్డి చిట్టిగారలు ఈ ఆలయం నిర్వహణ భాద్యత తీసుకొన్నారు.

ఇక 12వ వార్డులో ఒక త్రాచుపాము తరుచు కనిపించడంతో అక్కడ వెంకటేశ్వరస్వామి పటం ఉంచడంతో భక్తులుచేరడం ప్రారంభించారు. ఇక్కడ కూడ చైత్ర శు॥ ఏకాదశి శ్రీ వేంకటేశ్వర కళ్యాణం జరుగుతూ వస్తోంది. విజయవాడలో ఉంటున్న రాజోలు వాస్తవ్యులు సొంపల్లిసుబ్బారావుగారిచ్చిన స్థలంలో ఈ మధ్య వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని నిర్మించారు. దీనిని కొత్తవెంకటేశ్వర ఆలయంగా పిలుస్తున్నారు. రేకపల్లి ధర్మారావుగారు ఈ అలయ భాద్యత వహిస్తున్నారు.

రాజోలు శివాలయం ప్రక్కగా సేకరించిన స్థలంలో 1998 నుండి వీరబ్రహ్మేంద్రస్వామి ఆలయం నిర్మించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. దార్లచినబాబు పర్యవేక్షణలో రాజోలు తాలూకా స్వర్ణకారులు సంఘంవారు ఈ ఆలయనిర్మాణ కార్యక్రమం జరుపుతున్నారు.

**ఉత్సవాలు :** రాజోలు బజారు సెంటరులో పూర్వకాలంనుంచి ప్రతిసంవత్సరం శ్రీ రామనవమి ఉత్సవాలు జరిగేవి. ఎక్కువగా నాయనప్పగారని పిలువబడే నండూరి క్రిష్ణమూర్తి గారు ఈ కార్యక్రమాలు నిర్వహించేవారు. ఎన్నో హరికథలు, నాటకాలు జరిగేవి. ఈయన ఆ కార్యక్రమాలు నడిపేవారు. బజారులోని వ్యాపారస్తులు ఈ కార్యక్రమాలు నడిపేవారు. ఈ మధ్యకాలంలో ఇవి పూర్తిగా మానివేశారు. కొంతకాలం క్రితం దారపురెడ్డివారి కాంప్లెక్సు వద్దకూడ శ్రీరామనవమి కార్యక్రమాలు 5 సం॥లు జరిగాయి.

ఇక నాయనప్ప గారు అఖండహరినామ సప్తాహాలు చాలాసార్లు నిర్వహించారు. 1952-53 లలో పొన్నాడవారి యిళ్ళముందు పెద్దపెద్ద పందిళ్ళు వేసి ఈ సప్తాహకార్యక్రమాలు నిర్వహించేరు. పశ్చిమబెంగాలుకు చెందిన ఓంకార్‌నాధ్, అలహాబాదుకు చెందిన ప్రభుదత్తబ్రహ్మచారి గారలు ఈ సప్తాహకార్యక్రమాలలో వారి బృందాలతో పాల్గొన్నారు. అల్లే 1955 డిసెంబరు 56 నుండి ఫిబ్రవరి వరుకు నప్తసప్తాహాలు కూడ నాయనప్పగారు నడిపారు. ఆదే ప్రదేశంలో 49 రోజులు





అఖండహరినామసంకీర్తన ఓం కార్‌నాధ్‌వారి శిష్యబృందంతో జరపబడింది. ఆ తరువాత శివాలయంలో గల రామాలయంలో నాయనప్పగారు, కోటిబిల్వార్చన, శతకోటిబిల్వార్చన కార్యక్రమాలు కూడ నిర్వహించారు. ఈ కార్యక్రమాలలో పెద్దింటినారాయణ దీక్షితులు ( దీక్షితదాసు) గారు అనేక సార్లు చక్కని హరికథా కార్యక్రమాలు ఇచ్చారు.

**కార్యక్రమాలు :** 1953 వేసవికాలంలో కూచివీరభద్రశాస్త్రిగారిచే నెలరోజులు భారతం హరికథాకాలక్షేపం జరిగింది. ఈయన బుర్రకథల స్టైలులో నూతన వొరవడులతో, ఆర్కెస్ట్రాతో హరికథ చెప్పడంతో ఇది అప్పుడు ప్రజలను బాగా ఆకట్టుకొంది. అయనను రోజూరాత్రి కార్యక్రమం మొదలయ్యేసరికి, భక్తులు పూలదండలతో, బిస్కెట్టుదండలతో, రూపాయల దండలతో ముంచెత్తేవారు. ఈయన నిడదవోలు అచ్యుతరామయ్యగారి బుర్రకథ దళంలో హాస్యం చెప్పేవారు. అందుకని హరికథలో అయన చెప్పే పిట్టకథలు కూడ ఎంతో సరదాగా ఉండేవి. ఇక కోటసచ్చిదానందశాస్త్రిగారి హరికథ కూడ 1989 ఆగష్టులో బార్ క్లబ్‌ఆవరణలో జరిగింది. అల్లే 1986 జూలై నెలలో రాజోలు ప్రశాంతి థియేటరులో 6రోజులుపాటు సినీగాయకులు యం.ఎస్. రామారావు గారిచే సుందరకాండ కథాగానం జరిగింది. ఆధ్యాత్మిక సంఘం, రోటరీక్లబ్ వగైరాలు దీనికి ఆధ్వర్యం వహించాయి. అల్లే 1989లో మల్లాదిచంద్రశేఖరశాస్త్రి భారతంపై ప్రసంగం, 1990లో ద్విభాష్యం అప్పలాచార్యులు గారి రామాయణపురాణకాలక్షేపం కూడ బార్ క్లబ్ ఆవరణలో జరిగాయి. జొన్నలగడ్డ సుబ్బారావుగారు ఎన్నో ఆధ్యాత్మిక గ్రంధాలు రచించిన మేధాశక్తితో ఈ కార్యక్రమాలకు తగు సలహా అందించేవారు. శ్రీ శిష్టారామశాస్త్రిగారు (శరత్‌పంతులుగారు), వెలదివెంకటరామారావుగారు, యం.వి. సుబ్బారావుగారు ఈ కార్యక్రమాలు నిర్వహించేవారు.

**పర్యటనలు :** రాజోలుకు ఎంతోమంది ఆధ్యాత్మిక ప్రముఖులు పర్యటించారు. 9-3-1937న అప్పటి కంచికామకోటిపీఠాధిపతి రాజోలు వచ్చి సత్రంలో బసచేశారు. ఏనుగుకూడ వచ్చింది. ఎంతోమంది వచ్చి దర్శనం చేసుకొన్నారు.

17-4-37న మళయాళస్వామి శివకోడు వెడుతూ రాజోలు వచ్చారు. తరువాత 1950 ప్రాంతంలో కస్తూరి సత్యవతమ్మగారు ఈ మలయాళస్వామి వారిని తీసుకువచ్చి సొంపల్లి సరిహద్దులో పెద్దకార్యక్రమం నిర్వహించారు. వారి ఉపన్యాసం వినడానికి ఎంతోమంది స్త్రీలు, పురుషులు వచ్చారు.

1954-55 ప్రాంతంలో "మెహర్‌బాబా" కూడ రాజోలు వచ్చి, రాజుగారి మేడవద్ద ఖాళీస్థలంలో భక్తులనుద్దేశించి సందేశం యిచ్చారు.

అల్లే కుసుమకుమారి, హరనాధబాబాగారు కూడ 1954 ప్రాంతంలో రాజోలులో ఆలమూరి వారింటికి వచ్చారు.

శ్రీశ్రీశ్రీ శృంగేరి పీఠాధిపతి డి. 23-6-60న రాజోలు వచ్చారు. పొన్నాడ సూర్యారావుగారింటిలోను,

శివాలయంలోని పూజలు జరిగాయి. తిరిగి ఈయన 1977వ సం॥ఆగష్టు నెలలో రాజోలు రాగా బాలురహైస్కూలు వద్ద పూజలు జరిగాయి. తిరిగి ప్రస్తుత శృంగేరిపీఠాధిపతి 1985 సం॥ మే నెల 24,25 తారీఖులలో రాజోలు వచ్చారు. పొన్నాడహనుమంతరావు గారింట్లో బసచేశారు. బార్‌క్లబ్‌లో ఉపన్యాసం యిచ్చారు.

అల్లే 1986 వ సం॥ డిసెంబరు 16వ తేదీన పుష్పగిరిపీఠాధిపతి రాజోలువచ్చి హనుమంతరావుగారింట్లో మకాం చేశారు. అక్కడే ఇంటిముంద స్థలంలో భక్తులకు సందేశం యిచ్చారు.

1994 మే నెలలో కుర్తాళం పీఠాధిపతి కూడ రాజోలు వచ్చి హనుమంతరావుగారింట్లో మకాం చేసి బార్ క్లబ్ ఆవరణలో భక్తులకు సందేశం యిచ్చారు.

1969 జనవరి 23వ తేదీన శ్రీ సత్యసాయిబాబా రాజోలువచ్చి బిక్కిన జానకిరామారావుగారింటిని సందర్శించారు.

1976లో విద్యాప్రకాశానందగిరిస్వామి (కాళహస్తి) వారు రాజోలులో18రోజులు 56వ గీతాయజ్ఞం నిర్వహించి ఇచ్చట భక్తులను ఆధ్యాత్మికచింతన లో ముంచెత్తారు.

1969వ సం॥లో జనవరి నెలలో కళాశాల ఖాళీస్థలంలో అప్పటి దేవాదాయశాఖమంత్రి రామలింగరాజుగారి ఆధ్వర్యంలో రాజేశ్వరనాందస్వామి వారి పర్యవేక్షణలో అఖిలాంధ్రసాధుపరిషత్ సమావేశాలు జరిగాయి.

1950 నుంచి రాజోలులో తెంపెల్ల సూర్యనారాయణగారి ఆధ్వర్యంలో దివ్యజీవనసంఘం (డివైన్ లైఫ్ సొసైటీ) ఉండేది. 1980లో అప్పటి ఇంగ్లీషు లెక్చరర్ మహంకాళిసుబ్రహ్మణ్యం గారిచే ఈసంఘం పునరుద్ధరింపబడింది.1984లో ప్రపంచదివ్యజీవనసంఘ పరమా అధ్యక్షులు శ్రీ స్వామి చిదానంద మహరాజ్ (ఋషీకేష్) వారు రాజోలు వచ్చారు. అప్పటి నుండి శ్రీ ***శివానందమహరాజ్*** వారి ప్రియశిష్యులు శ్రీ దేవానంద చిన్నస్వామి(ఋషీకేష్) వారు ప్రతీ సంవత్సరం జనవరినెలలో వచ్చి ఎన్నో ఆధ్యాత్మిక సందేశాలుఇచ్చేవారు.ఇప్పుడుశ్రీరుద్రరాజురామరాజుగారు, డి.వి. సుబ్రహ్మణ్యంగారు (గాజులమాస్టారు), జె.ఇ. హనుమంతరావుగారు,లెక్చరర్ నారాయణరావు గారు జి.చక్రధరరావుగారు (ప్రెస్), మంత్రిప్రగడ రామచంద్రుడుగారు వగైరాలు ఈ సంస్థను నడుపుతున్నారు.ఈ సంస్థ ఆధ్యాత్మిక మాసపత్రిక ***శ్రీ శివానందవాణి*** శ్రీ రవిప్రెస్‌లో ప్రింట్‌చేసి దేశంలో అన్ని రాష్ట్రాలకే కాక విదేశాలకు కూడా ఇచ్చట నుంచి వెళ్ళటం రాజోలు విశేషం.

**గణేశనిమజ్జనం** : 1991లో రాజోలు తాలూకా గణేశ్‌నిమజ్జన సమితి ఏర్పడింది. భాద్రపదమాసంలో గణపతి నవరాత్రులు ఆయిన వెంటనే ఆ గణపతి విగ్రహాన్ని జలాశయాలలో నిమజ్జనం చేస్తారు. చుట్టుప్రక్కల గ్రామాలలో నవరాత్రులు నిర్వహించినవారు ఆఖరిరోజున ఊరేగింపుగా రాజోలు వచ్చి, రాజోలు పురవీధులలో ఊరేగించి వశిష్టానదిలో సామూహికంగా నిమజ్జనం చేయించే ఉద్దేశ్యంతో ఈ సమితి ఏర్పడింది. ఇది ప్రతిసంవత్సరం పెరుగుతూ వచ్చి ప్రస్తుతం సుమారు 50





వరకు గణేశ్ విగ్రహాలు ప్రతిసంవత్సరం రాజోలుకు చేరడం ప్రారంభంఅయ్యింది. ఈ విగ్రహాలన్నీ రాజోలు బాలురహైస్కూలు వద్దకు మధ్యాహ్నం చేరతాయి. వారికి సమితివారు అల్పాహారం యిచ్చి ఊరేగింపుజరిపి సాయంకాలం నిమజ్జనం జరిగేవరకు సమితి బాధ్యత వహిస్తోంది. డా॥ఎ.వి. అప్పారావుగారు,నగరానికి చెందిన కంచర్లగణపతిగారు, జగన్నపేటకు చెందిన జాన సత్యనారాయణగారు తాటిపాకకు చెందిన బత్తులవెంకట్రావుగారు వగైరాలు ఎంతో శ్రమపడి ఈ కార్యక్రమాలు నెరవేరుస్తారు.

**బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయం** : పద్ధతులు వేరైనా భారతదేశంలో అందరి ఆశ, కులద్యేయం శాంతి, మోక్షం సాధించడమే. అటువంటిదే బ్రహ్మకుమారిఈశ్వరీయవిశ్వవిద్యాలయం. ఈశ్వరుడు మనలోనే బిందురూపంలో ఉన్నాడని. రాజయోగంద్వారా వారిని చూడాలని ఈ విశ్వవిద్యాలయం వారి నమ్మకం మాతృసంస్థరాజస్తాన్‌లోని అబూలో ఉన్నది. వారిశాఖ 1990లో రాజోలులో లక్కింశెట్టి పండుగారి మేడలో బ్రహ్మకుమారి రజనిగారిచే ప్రారంభింపబడి రాజయోగశిక్షణ జరుపుతున్నారు. ప్రస్తుతం బ్రహ్మకుమారి మామిడిపల్లి పద్మావతి, శ్రీ మామిడిపల్లి లక్ష్మీనారాయణగారు బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయశాఖ నడుపుతున్నారు. ఈ సంస్థకు లక్కింశెట్టి సుబ్బలక్ష్మి నారాయణగారు లైబ్రేరీ ప్రక్క తనవిలువైన స్థలాన్ని యిచ్చి ధ్యానందుహాలును కూడ నిర్మించి 1999లో ప్రారంభించారు.

**వేదశాస్త్రవిషయాలు** : 1908 లో గోదావరి పుష్కరాలు జరిగాయి. ఆ సందర్భంలో పెదపట్నం అగ్రహారంకు చెందిన బోళ్ళబులిసుబ్బారాయ్డుగారు రాజోలు వద్దకు 17-8-1908న పుష్కరస్నానం చేసి "హిరణ్యం" పెట్టే సమయంలో అప్పటి తహశీల్దారుగార్కి కొంత భూమిని దానం యిచ్చి గౌతమిపుష్కర పాఠశాలను తన అన్నగారు బోళ్ళసుబ్బారాయ్డు గారి పేర మీద స్థాపించారు. ఆ తరువాత 29-8-1908న ఆ పాఠశాలకు ఆ భూమిని దానమిస్తు దానపట్టా వ్రాసియిచ్చి, తిరిగి `కదపా` కూడ పాఠశాల పేర వ్రాసియిచ్చినారు. మొదట్లో సంస్కృత విద్య బోధించుటకు ఈ పాఠశాల ఏర్పడింది. ఆలమూరి క్రిష్ణంరాజుగారు ఈ పాఠశాలకు మొదటిఅధ్యకులు. శివాలయంలో ఉత్తరం వైపున పెంకుటిభవనం కట్టి అందులో ఈ పాఠశాల ప్రారంభించారు. 29-3-25 న పొన్నాడశ్రీ రామవెంకటసూర్యారావుగారు సభ్యునిగా జేరి దీనికి అధ్యక్షులయ్యారు. తిరిగి 25-12-25న కార్యదర్శిగా ఎన్నికయ్యారు. అయితే 9-4-32న సూర్యారావుగారు రాజీనామా చేయగా దానిని తిరిగి ఉపసంహరించుకోమని కోరినందున 17-7-32న జరిగిన సమావేశంలో ఉపసంహరించుకొన్నారు. 31-5-1933న అమలాపురం వాస్తవ్యులు, అప్పటి మద్రాసుప్రెసిడెన్సీ కాలేజి సంస్కృత ప్రొఫెసరు అయిన కూచిమంచిగోపాలక్రిష్ణమూర్తి గారి అధ్యక్షతన పాఠశాల ఆధ్వర్యంలో వేదసభ జరిగింది. ది. 2-6-1933న గోపాలక్రిష్ణమూర్తి గారు పాఠశాల విద్యార్థులకు సంస్కృత పరీక్షలు జరిపి సాయంత్రం పాఠశాల వద్ద బహుమతులు పంచారు. ఆ సందర్భంలో కమిటీ సభ్యులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు కలసి ఆయనతో ఫొటో కూడ తీయించుకొన్నారు.

తరువాత 11-3-35న విశ్వేశ్వరాయపురం కాపురస్థులు వేదపండితులు కడియాల పేరావధానులు గారు వేద ఉపన్యాసం యిచ్చారు. ఈ పాఠశాల కాలక్రమేణా వేదపాఠశాల గా మారింది.

ఆ తరువాత అధ్యక్షకార్యదర్శుల స్థానంలో మేనేజరు పదవి ఏర్పడింది. 5-12-37న తాత్కాలికంగా గానుగపాటిసుబ్బరాయశాస్త్రిగారు మేనేజరుగా ఎన్నుకోబడ్డారు. తరువాత మళ్ళీవెంటనే సూర్యారావుగారు మేనేజరుగా ఎన్నికై తన జీవితకాలం అంటే 1964 సెప్టెంబరు 5 వరకు కొనసాగారు.

భారతీయులు గర్వించదగ్గ విషయాలు చతుర్వేదాలు. ప్రపంచం కళ్ళు తెరవకముందే భారతదేశంలో వేదాలు పుట్టాయి. ఈ వేదం 20వ శతాబ్దంలో చదువుకొనేవారు చాల తక్కువ. ఓ మోస్తరు వేదం చదువుకొనే వారిని క్రమపాఠీలని, బాగా చదువుకున్నవారిని ఘనపాఠీలని వ్యవహరిస్తారు. విజయవాడలో వీరికి పట్టాలు యిస్తారు. ప్రతి సంవత్సరం శ్రావణ భాద్రపదమాసాలలో వీరు యింటింట్కి తిరిగి వేదం పారాయణ చేస్తారు. వీరికి తగురీతిని కుటుంబీకులు సత్కరిస్తారు. దురదృష్టవశాత్తు యిట్టా గ్రామాలలో తిరిగే వేదపండితులపై చాలమందికి చిన్న చూపు ఉంటుంది. వీర్ని మామూలు పురోహితులుగా భావిస్తారు. మన గ్రామాలలో పూజలు చేయించే పురోహితవ్యవస్థ పూర్తిగా వేరు. వీరిలో చాలమంది స్మార్తశాస్త్రం చదువుకున్నవారు మాత్రమే.

పూర్వం నుంచి రాజోలులో కాచిభట్ట గోపాలం, బులుసు సూర్యనారాయణలు మరికొద్దిమంది మాత్రమే పురోహితులు ఉండేవారు. ఆ తరువాత కాచీభట్ల నరశింహం, కాచీభట్ల సుబ్బారావు, కాచిభట్ల లక్ష్మీనారాయణ వగైరాలు పురోహితులుగా ఉండేవారు. ఆ తరువాత విశ్వేశ్వరాయపురం నుండి శ్రీ కడియాలవెంకటేశ్వర్లు గారు, వీరి సోదరులు సుబ్రహ్మణ్యంగారు, క్రిష్ణమూర్తి గారలు 1955 తరువాత రాజోలు వచ్చి చదువుకొనేవారు. ఆ తరువాత పౌరోహిత్యం ప్రారంభించారు. అట్లే శ్రీధరవెంకటసిద్ధాంతి గారు కూడ రాజోలులో పౌరోహిత్యం చేసేవారు. వీరి తరువాత వీరి కుమార్తు శ్రీధర సత్యనారాయణ సిద్ధాంతి (పండుగారు) పౌరోహిత్యం చురుకుగా చేస్తున్నారు. ఇక కాచీభట్ల సుబ్బారావుగారి కుమార్తు గోపాలం, తిప్పాభట్లక్రిష్ణమూర్తి, చల్లా సత్తిబాబు, కొంపెల్ల సుబ్రహ్మణ్యం (సుబ్బయ్య),కాచీభట్ల సూర్యనారాయణ, కాచీభట్లరాముడు వగైరాలు రాజోలులో స్థిరపడి పౌరోహిత్యం చేస్తున్నారు. నేమాని త్రిమూర్తులుగారు కూడ రాజోలులో చాలకాలంనుండి పౌరోహిత్యం చేస్తున్నారు. 1992నుండి అకొండి ఫణిశాస్త్రిగారు రాజోలులో స్థిరపడి అపరకర్మలు చేయిస్తున్నారు. ఇంకా ఈ మధ్య యువపురోహితులు కూడ రంగంలోకి చాలమంది వచ్చారు. ఇతర గ్రామాలనుండి కూడ పురోహితులు వస్తూంటారు.

**వేదపరిషత్** : లోగడ వ్రాసినట్లు వేదం అభ్యసించిన పండితులు శ్రావణ భాద్రపదమాసాలలో గ్రామాలు తిరిగి వేదపారాయణ చేసి యింటింటికి తిరిగి చిల్లరసొమ్ము తీసుకొనే పద్ధతి రాజోలులో కూడ ఉండేది. అయితే రాజమండ్రిలో ప్రతి సంవత్సరం వీరంతా యింటింటికి తిరగకుండా అందరిని ఒకేసారి ఆహ్వానించి పట్టణం మొత్తంగా ప్రతిసంవత్సరం కృష్ణాష్టమినాడు సత్కరించే పద్ధతి





ప్రవేశపెట్టారు. అదేవిధంగా రాజోలులో కూడ పాన్నాడశ్రీరామవెంకటసూర్యారావు గారు కూడ గౌతమీపుష్కరపాఠశాల అధ్వర్యంలో 1951వ సం॥లో "**వేదపరిషత్**" ప్రారంభించారు. కదలికి చెంది, ఆ తరువాత పుట్టపర్తిలో స్థిరపడిన వేదపండితులు చెరుకుమిల్లికామావధానులుగారి సహకారంతో, విశ్వేశ్వరాయపురానికి చెందిన వేదపండితులు కడియాల పేరావధానులుగారి అధ్యక్షతన భాద్రపద శు॥ చతుర్దశి అంటే అనంత పద్మనాభ చతుర్దశి రోజున రాజోలులో మొదటి వేదపరిషత్ సభ జరిగింది. గ్రామగ్రామాల నుండి వచ్చిన వేదపండితులకు గ్రామం తరుపున సత్కారం జరగడం ప్రారంభంఅయింది. ప్రజలు వద్ద విరాళాలు ప్రోగుచేసి ఈ కార్యక్రమం నడపడం ప్రారంభించారు. ఉదయం అనంతవ్రతం జరిపి అనంతుని వాహనాన్ని ఊరేగించి మధ్యాహ్నం వేదసభ, వేదస్వస్తి, సత్కారం జరుపుతారు. ప్రతి సంవత్సరం జమాఖర్చుల వివరాలను చిన్న పుస్తక రూపంలో ప్రచురించి పంచిపెట్టే పద్ధతి ప్రవేశపెట్టారు. 1964 తరువాత డా॥ పారుపూడి విశ్వేశ్వరరావుగారు ఈ సభను 1970 వరకు నిర్వహించారు. ఆ తరువాత 1970 నుండి 2000 సం॥ వరకు శిష్టారామశాస్త్రి (శరత్పంతులు) గారు దీనిని నడిపారు. ఈ సభకు పూర్వంనుంచీ రేమిళ్ళ, సూర్యప్రకాశశాస్త్రిగారు, బులుసు అప్పన్నశాస్త్రిగారు, లంక వెంకట్రాయసోమయాజిగారు, విశ్వనాథజగన్నాధ ఘనాపాఠీగారు, శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు, రాణీనృశింహశాస్త్రిగారు, గుళ్ళపల్లి ఆంజనేయులు గారు, ఇంకా ఎంతోమంది వేదపండితులు ఈ వేదసభలలో పాల్గొని అధ్యక్షత వహించారు. వేదపండితులను, తద్వారా వేదాన్ని పోషించడానికి ఎన్నోపధకాలు ప్రారంభింపబడ్డాయి. శ్రీ శరత్పంతులుగారు ఈ సంస్థను అభివృద్ధిచేయడాన్కి ఎంతో కృషిచేశారు. మొదట్లో పాన్నాడసూర్యారావుగారు, ఆ తరువాత సుతాపిల్ల సూర్యనారాయణమూర్తిగారు, ఆ తరువాత అప్పన మాణిక్యాలరావు గారు ఈ వేదపండితులకు మృష్టాన్న భోజనాలు ఏర్పాటుచేసేవారు. ప్రస్తుతం వేదపండితులు సభా సమయానికి మాత్రమే రావడం ప్రారంభంకావడంతో ఈ భోజన ఏర్పాట్లు అవసరం తగ్గింది. ఈ సభ జరిగిన రోజురాత్రి చెరువు గట్టుపై గల వేంకటేశ్వరస్వామి ఆలయంలో కూడ గంటిశ్రీరామమూర్తి, నేమాని విశ్వనాథం వగైరాలు వారికి భోజన సదుపాయాలు చేసి అదే రాత్రి సభ ఏర్పాటు చేయడం ప్రారంభించారు. ఇప్పటికీ ఇదికొనసాగుతోంది.

వేదం మన సంస్కృతి. దీనిని పోషించవలసిన భాధ్యత మన మీదున్నది. జిల్లాలోనే గాక రాష్ట్రంలోనే ముందుగా ప్రారంభింపబడిన ఇట్టి వేదసభలలో రాజోలు కూడ ఒకటి 50 సం॥లు నిండుకొన్న ఈ వేద సభను ఇంకా జయప్రదంగా నడపాలని ఆశిద్దాం.

**ఇతరమతసంస్థలు** : రాజోలులో ముస్లిముల జనాభా కొద్దిగా పెరగడంతో సున్నీలకు సంబంధించి 1923లో జామ్మామశీదు కూడ ఏర్పడింది. దీనికి ఖాసింకా సాహెబ్‌గారి భార్య మౌలాబీబి ది. 14-3-29 తేదీ గల క్రియదస్తావేజు రీత్యా సయ్యద్‌మౌలానాసాహెబ్‌గార్కి కొంత ఆస్థి అమ్మారు. ఈ మశీదుకు ఆయన మొదట అధ్యక్షులు. ఈయన చింతపల్లిలో ఒక దూడలశాలకొని ఆకలపతో మశీదు

నిర్మించారు. ఇప్పుడు యిది పక్కాగా నిర్మించారు.

ఇది బాలికల హైస్కూలుకు దగ్గరలో ఈ మశీదు నిర్మించబడింది. దీనికి చాలాకాలంనుండి సయ్యద్‌హుస్సేన్ (రొట్టెలసాహెబుగారు) అధ్యక్షులుగా, ఇస్మాయిల్‌గారు ఉపాధ్యక్షులుగా, పి.పి.ఖాన్‌గారు సెక్రటరీగా, నూర్‌మహ్మద్‌గారు కోశాధికారిగా వ్యవహరిస్తున్నారు. అట్లే సుమారు వందసంవత్సరాల పైబడినప్పటి నుంచి షియాలకు సంబంధించి మీర్‌ఆలమ్ పీర్లపంజా కూడ ఉన్నది. చాలకాలం ఈ పంజా మెయినురోడ్డులో ప్రస్తుతం లక్ష్మింశెట్టి పండుగారి భవనం ఉండేచోట ఉండేది. తరువాత 30 సం॥లు క్రితం కోర్టుకు తూర్పు ప్రక్కవీధిలోకి మార్చబడింది. ప్రస్తుతం యిక్కడ నడుస్తోంది. మొహరం నెల మొదటిరోజున ఈ పంజాలో పీర్లు అల్లాను నిలబెట్టి 10 రోజులు ఉత్సవం చేస్తారు. 8వ రోజు రాత్రి నిప్పులగుండం 8గజాల నిప్పులగుండం ఏర్పాటు చేసి నిప్పులపై నడుస్తారు. పదవరోజున ఊరేగింపుజరిపి గోదావరివద్ద పూర్తి చేస్తారు. ఈ ఉత్సవాల్లో చాలామంది హిందువులు కూడ పాల్గొంటారు. ఆ పదిరోజులలో అక్కడి హిందువులు కూడ మ్రొక్కుబడులు చెల్లిస్తారు. మీర్‌ఆలంపీర్లు యింటింటికి వచ్చినప్పుడు అందరూ వాటిని స్వాగతిస్తారు. మొల్లామీరాసాహెబు ఈ కార్యక్రమాలు చేసేవారు. ఆయన 1919లో మరణించినప్పుడు వారి కుమా[illegible] ఈ కార్యక్రమాలు నడిపించారు. ఈయన చాలాకాలం వీరభానుపురమందిరంలో అటెండరుగా పనిచేశారు ఈయన తరువాత వీరి కుమారు జాఫీ, రాజా, లాల్‌సాహెబ్ మరియు సాదిక్ వగైరాలు, ఆ తరువాత వీరి సంతతి వారు ఈ కార్యక్రమాలు జరుపుతున్నారు.

20వ శతాబ్దంలో క్రిష్టియన్లు కూడ జనాభాలోకి రావడంతో వారికి కూడ చర్చిలు ఏర్పడ్డాయి. సుమారు 40 సం॥లు క్రితం లూథరన్ చర్చి ఏర్పడింది. టి.టి.డి. కళ్యాణమండపానికి వెళ్ళేరోడ్డు, మెయిన్‌రోడ్డుకు జంక్షనులో ఒక చర్చిభవనం కూడ నిర్మింపబడింది. ఈ చర్చికి ప్రస్తుతం జేబులూ[illegible]గారు పాస్టరుగా ఉన్నారు. అట్లే సుమారు 30 సం॥లు క్రితం పెంతకోస్తుచర్చికూడ ఏర్పడింది. దీనికి [illegible]రోడ్డులో చర్చి భవనం కూడ నిర్మింపబడింది. దీనికి డేవిడ్‌గారు పాస్టరుగా ఉన్నారు.

1949 శివరాత్రినాడు ముమ్మిడివరంలో ఒక దళిత బాలుడు పద్మాసనంలో కూర్చొని, సమాధిచెందేవరకు కొన్ని సంవత్సరాలపాటు యోగంలో ఉండిపోయాడు. ఆయనే బాలయోగి. ఈయనకు దర్శించడానికి ప్రతిశివరాత్రికి దేశం నలుమూలలనుండి జనం విపరీతంగా వచ్చేవారు. ప్రత్యేకబస్సులు నడిపేవారు. రాజోలునుంచి 1950 ప్రాంతంనుండి శివరాత్రికి ముమ్మిడివరం వెళ్ళి బాలయోగిని దర్శించుకొనేవారు.

భారతదేశంలో ఎన్నోమతాలు, ఎన్నోనమ్మకాలు ఉన్నాయి. కాని భారతసంస్కృతి అందరిదీ ఒకటే. అదే భారతదేశంలోని భిన్నత్వంలోని ఏకత్వం. దీనిని కాపాడుకోవడం మనందరి బాధ్యత. అందుకు తమవంతు సహకారం రాజోలు ప్రజలుచేస్తూనే ఉన్నారు. ఇది కొనసాగాలని ఆశిద్దాం.

*నాదేశం గొప్పది. నా ప్రజలు గొప్పవారు. నా ఊరు మంచిది.*

జైహింద్

❖❖❖



తూర్పు గోదావరి జిల్లా కలక్టరు, కాకినాడ

**శ్రీ నీతీష చంద్ర, IAS గార్కి**

తూర్పుగోదావరి జిల్లా ప్రిన్సిపలు మరియు సెషన్సు జడ్జి

**శ్రీ బి. శేషశయన రెడ్డి గార్కి**

జిల్లా పోలీసు సూపరింటెండెంటు

**శ్రీ ఎ.బి. వెంకటేశ్వర రావు, IPS గార్కి**

అమలాపురం రెవిన్యూ డివిజనలు ఆఫీసరు

**శ్రీ సి. శ్రీధర్ గార్కి**

అమలాపురం డిప్యూటి పోలీసు సూపరింటెండెంటు

**శ్రీ ఎ.ఎస్.యన్. రెడ్డి గార్కి**

అభినందనలతో....

## మలి పలుకు

ఈ చిన్ని ప్రయత్నంలో ఏమైనా తప్పులుగాని, లోపాలుగాని వుంటే అవి ఉద్దేశ్యపూరితము కాదు. నా జ్ఞాపకశక్తి, సేకరణ లోపాలు కావచ్చు. తెలియని లోపాలకు క్షంతవ్యుడను.

అతి కొద్ది సమయంలోనే చేసిన ఈ సేకరణ కేవలం ఇన్‌ఫర్మేటివ్ మాత్రమే.

ఇదే నా మొదటి ప్రయత్నం వల్ల భాష, ముద్రణ మరియు వ్యాకరణ దోషాలకు క్షమార్హుడను.

ఇందులో వ్రాసిన అంశాలు ఎవరినీ కించపరచడానికిగాని, మెప్పు చేయడానికి కాని ఉద్దేశించినవి కావు. కేవలం జరిగిన సంగతులు.

ఘన చరిత్ర కలిగిన రాజోలు గురించి చదివిన ఏ ఒక్క పాఠకుడైన స్పందించి రాజోలు అభివృద్ధికి కృషిచేయగలిగితే వారికి నేను ఋణపడి వుంటాను.

శెలవు

పొన్నాడ హనుమంతరావు.